సరస్వతీ గ్రంథమండలి :

# దేవతలు మాట్లాడనప్పుడు



మూలం :

మైఖేల్ సొలోవైవ్

అనువాదం :

ఓ. గిరాల వెంకటసుబ్బారావు




ప్రచురణ : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# Dēvathalu Mātladanappudu

## (WHEN THE GODS ARE SILENT)



By

MIKHAIL SOLOVIEV

Translated by

VOGIRALA VENKATA SUBBARAO



First Edition – January 1962 – Price Rs. 2-00





Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

అధ్యాయము 1.

# సురోవ్‌లు కమ్యూనిస్టులైన విధం

దక్షిణ రష్యాప్రాంతపు స్టెప్పీలలో నివసించే జానపద స్త్రీలందరివలెనే వెరా ఇవనోవ్న తన పనేదో తను తొణుకు బెణుకు లేకుండా, చేసుకుపోతూ వుండేది. వంటినిండా ఒత్తుగా దుస్తులు ధరించె అలవాటువల్ల, తాను ప్రసవించే వరకూ గర్భవతి అన్న సంగతే యెవరూ గుర్తించలేదు, భర్త అయిన ఒక్క టిమొతిసురొవ్ తప్ప. టిమొతికైనా గర్భవతి అన్న సంగతి మాత్రమె తెలుసుకాని, ప్రసవసమయం సమీపిస్తున్న సంగతి తెలియదు.

సుమారు యాభై సంవత్సరాలున్న వనిత, మళ్ళీపిల్లను కనబోతున్నానని — అదీ పందొమ్మిదవకానుపు — యిరుగుపొరుగువారితో యేమని చెప్పుకుంటుంది! ఇంతకన్న పదేళ్ళు తక్కువవున్నా యీవిధంగా పిల్లలను కంటూంటే, పెద్దవాళ్లు కనుబొమ్మలను యెగరవెయ్యక మానరాయె. "నేనేం చెయ్యను, దేవుడు పిల్ల తరవాత పిల్లను యిస్తూంటె, కనడం నాతప్పా?" అని తనలో తను సమాధానపరచుకొనేది వేరా.

పొత్తిళ్ళలో పట్టుకొని అప్పుడే కలిగిన శిశువు ముఖంలోకి చూస్తున్న తనచుట్టూ వలయాకారంగానిల్చున్న తన సంతానాన్ని తలయెత్తి చూచి "ఇది నా తప్పా?" అని నెమ్మదిగా అడిగింది. "అంతా ఆ భగవంతుని లీల."

"మరొక పాప కలిగాడని కాదమ్మా" అన్నాడు ముప్పైఅయిదేళ్ళ పెద్దకొడుకు, జాకబ్, "మరో యిరవై మందిని

కను, యెవరొద్దన్నారే; లోకులు నవ్విపోరా అనే మేము అనుకుంటున్నది."

అది వేసవికాలం; సమయం పగటి సమయం. పొలంలో చేయవలసిన పని యెంతో వుంది. అప్పుడే కొడుకుని కని, పాకలో గడ్డిమీద పడుకుని వున్న వేరానూ, పసికందునూ చూడడానికి సాయంకాలం వరకూ సాధ్యపడలేదు టిమొతీకి. టిమొతీ ధృఢకాయుడు. కళ్ళు మినహా ముఖమంతా వెంట్రుకలు, గడ్డమే. వంగి, భార్యను సాదరంగా ముద్దు పెట్టుకొని చూపుడు వ్రేలుతో ప్రేమ ఉట్టిపడేటట్టు పసికందు తలమీద తట్టాడు.

వేరా కృతజ్ఞతా వీక్షణాలతో అతణ్ణి తిలకించింది. "మన అబ్బాయిలకు కోపంగా వుంది, ముసలితనం వస్తూన్నా నేను పిల్లల్ని కనడం మానలేదని. 'నాకింక సంతానం అనుగ్రహించకు ప్రభూ' అని నేనెంత దీనంగా సెంట్ మార్క్‌ను వేడుకొంటున్నా, నావిన్నపం ఆయన చెవికి సోకినట్టు లేదు."

"ఈవిషయంలో మనకు ధర్మపన్నాలు చెప్పవలసింది మన అబ్బాయిలుకాదు" అన్నాడు మరోవ్ తీవ్రంగా. "మన మాత్రం తెలియక పోలేదు భగవంతునికి. అ ద లా వుంచు. పిల్లల నివ్వవద్దని నువ్వు వేడుకున్నది సెంట్ మార్క్‌ను కనక, వీణ్ణి మనం మార్క్ అని పిలుచుకుందాం, మనం యింత వరకు యెవరకీ మార్క్ అని పేరు పెట్టలేదుగా!"

సాయంకాలానికి తన బట్టలన్నింటినీ చుట్టగా చుట్టి పట్టుకుని వేరా ఇవనోవ్నా పొలంవదలి యింటికి దారితీసింది. ఆ బట్టల చుట్టలోంచి చంటిపిల్ల యేడ్పు వినవస్తోంది. వీధు ఆ

కుటుంబంలో స్థానం యేర్పరచుకొన్న మరొక అతిథి; ఆ యింట్లో అతనికి కావలసిన సదుపాయాలను యేర్పాట్లు చెయ్యవలసి వచ్చింది.

అదొక పురాతనమైన గృహం, చీకట్లు ముసురుకునివున్న ఆ యింటి కిటికీలు, ధూళిధూసరితమై తమ ప్రక్కనుండే పోతున్న బాటలో నడచే అనేకవింతలనూ, విశేషాలనూ చూస్తూండేవి. ఆ గ్రామంలో వున్న అనేక యిండ్లవలెనె అది కూడా రెండు భాగాలుగావున్న భవంతి. ఒక భాగం వంట గది, పడకగదీని; యీ గదిలోనే ఆకుటుంబంలో వారు పడుకుంటారు; మిగతా భాగంలో మసలుతూ అప్పుడప్పుడెవరైనా వస్తే విడిదికి యిస్తూ వుంటారు. ఐతే, వంటగదిలో సగానికిపైగా, పొయ్యే ఆక్రమించుకుంది.

మార్క్ నడక నేర్చే యీడు వచ్చేటప్పటికి తెలుసుకున్నాడు ఆ కుటుంబంలో వున్నవారు యెవరెవరు తనకేమే మౌతారో. తల్లి, తండ్రి, తొమ్మండుగురు అన్నలూ, యిద్దరు అక్కలూ తన ఆత్మబంధువులని. తనకు పూర్వం కలిగిన పద్ధెనమండుగురిలోనూ యేడుగురు చనిపోయారు.

ఆయింట్లోనే మరొకకుటుంబం వేరుగా కాపరం వుంటోంది. మూడో కొడుకైన సైమన్ కు పెళ్ళయింది. అతనికిప్పుడు పీటర్ అనే యేడేళ్ళకొడుకు. వేరా ఇవనోవ్నా కొన్ని నిముషాల క్రితం కన్న కొడుకును యింటికి తీసుకువచ్చి మంచంలో పడుకోపెట్టగానే సైమన్ తన యేడేళ్ళ పీటర్ ను వెంటబెట్టుకుని మంచం దగ్గరకు వచ్చి “పీటర్, మీ బాబయ్యరా” అన్నాడు.

"ఏడీ మా బాబయ్య?" అని ప్రశ్నించాడు పీటర్.

"అదేమిటిరా, మంచంలో?" అన్నాడు హేళనగా సైమన్.

"అంత చిన్న పాప నా బాబయ్యేమిటి?" అని ప్రతిఘటించాడు పీటర్.

జాకబ్ కు కూడా పెళ్ళి అయింది కాని, రెండేళ్ళకే భార్య పరలోకగతురాలైంది. మళ్ళీ పెళ్ళి చేసుకోలే దతను. సెర్గి వయస్సు ఇరవై తొమ్మిది, డిమిట్రీకి యిరవై నాలుగేళ్ళు వున్నందున యేనాడో పెళ్ళిళ్ళు అయివుండవలసిందే, కాని, కారణాంతరాలవల్ల యింకా కాలేదు. కోర్నికి పదహారేళ్ళు వచ్చినా, శుద్ధ పేచీకోరూ, కలహప్రియుడూ కావడంచేత వచ్చిన ప్రతి సంబంధం తప్పిపోయేది; యేపిల్లా యితణ్ణి వరించేది కాదు. ఆ తరువాత వాళ్లు గ్రిగోరి, ఫిలిప్, తారస్; తరువాత యిద్దరాడపిల్లలు—ఓల్గా, తాతియానా – ఆపై తరువాత ఇవాన్, ఆఖరివాడు మార్క్. మార్క్ కంటె ఇవాన్ రెండు సంవత్సరాలే పెద్ద.

మార్క్ పుట్టాకకు రెండేళ్లు ముందూ వెనకా కూడా సైప్సోరై తాంగాన్ని ప్రకృతి చిన్నచూపు చూసింది. కారణాలేమైతే నేమి, యేటేటా పంట పాడౌతూనే వచ్చేది. పంట తీరా కోతకు వచ్చే సమయానికి చేతికందే పంట బహుస్వల్పం. ఈస్వల్ప దిగుబడితో కుటుంబాలను పోషించుకో లేక, మాసి మాసి ప్రాణాలను వదలనూ లేక, తమ కున్న శాస్త్ర కొంత్రనూ, కొద్దిమంది స్థితిపరులైన భూస్వాములకు విక్రయించి వారిదగ్గర మళ్ళీ కౌలుకు తీసుకునేవారు. కొందరు

సర్వస్వం పోగొట్టుకొన్నారు. మిగతావారు గర్భదరిద్రులుగా తయారయ్యారు.

ఆ విధంగా సర్వస్వం పోగొట్టుకున్న వారిలో టిమొతి సురోవ్ ఒకడు. మార్క్ పుట్టుకకు కొన్ని సంవత్సరాల క్రితం వరకూ అతనికి పశువులు, గుర్రాలు, భూవసతి పుష్కళంగా వుండేవి. రాను రాను వాటిని యెలాగైనా నిలబెట్టుకొనాలని, ముగ్గురు మనుష్యులు చేసే కాయకష్టాన్ని తానొక్కడే చేసేవాడు. కాని, అదృష్టం కలసి రాలేదు. పంట తరవాత పంట నష్టమై పోతూనే వుంది. దానితో తనకున్న ఆస్తి నంతనూ, ఒకటి తరవాత ఒకటిగా, అమ్మకోక తప్పింది కాదు. కాపరం వుంటున్న ఆపాత యింటిని మాత్రం మిగుల్చుకుని, సమీపంలోవున్న బస్తీలో తను నౌకరీకి కుదిరాడు. రైలురోడ్డుమీద కూలిపని అది. పది సంవత్సరాలుగా చెమటోడ్చి పనిచేస్తూ, వీలున్నంత వరకు, ఆర్జనను వెనుకవేస్తూ వచ్చాడు, పోయిన ఆస్తిని తిరిగి సంపాదించాలనే ఆశతో. 1905 లో ఆ సంఘటనలే కనక జరిగి వుండకపోతే, అతని ఆశలు మోసలుతీరి వుండేవి.

ఆ యేడు (1905) అనేక సమ్మెలూ, సాయుధ తిరుగుబాట్లూ రష్యానంతనూ తుడిచిపెట్టేశాయి. అతడు పనిచేసే రైల్వేడిపోలో విప్లవనాయకులు, జార్ పరిపాలనను ప్రతిఘటించమని కార్మికులలో ప్రబోధం చేసేవారు. ఒకసారి విప్లవనాయకులలో ఒకడు రైల్‌రోడ్డుమీద నిలచివున్న యింజన్‌లో నుండి కార్మికులను సంబోధిస్తూంటే శ్రద్ధగా ఆకలిస్తున్న టిమోతి విసురుగా ముందుకు త్రోసుకు వెళ్ళి,

"మరి భూమిమాటేమిటి?" అని ప్రశ్నించాడు.

"భూమిని దున్నుకొనే రైతాంగానికి స్వాధీనపర్చవలసిందే" అని సమాధానం యిచ్చాడు యింజనులోవున్న ప్రబోధకుడు, "భూమిని భూస్వాములనుండీ, ధనికవర్గమునుండీ వశపర్చుకుంటాం" అన్నాడు విప్లవనాయకుడు.

ఈ పద్ధతి టిమోతి సురోవ్‌కు బాగా నచ్చింది. అదే రోజున బస్తీలో కార్మికుల ఊరేగింపొకటి వెడుతూంటే, టిమొతి సురోవ్ ఊరేగింపుకు ముందు పెద్ద యెర్రరంగు బోర్డును పట్టుకొని నడుస్తున్నాడు. "దున్నేవాడిదే భూమి" అన్నవాక్యం పెద్దపెద్ద అక్షరములతో ఆబోర్డుమీద లిఖించబడివుంది.

కొంతదూరం నడిచాక ఊరేగింపును పోలీసులు చెదరగొట్టారు. టిమొతి సురోవ్‌ను తీవ్రంగా కొట్టి, బంధించి, వాళ్ళ గ్రామానికి పంపేశారు. ఊరువిడచి పోగూడదని ప్రభుత్వం ఆంక్షవిధించారు. నాటినుండీ టిమొతి ఒక సామాన్య రైతుగా రోజులు దొర్లిస్తూండేవాడు. కుటుంబ పోషణకు, ఆ గ్రామంలోనే ఒక భూస్వామి దగ్గర వ్యవసాయ కూలీగా చేరాడు. మార్కొ కు యేడేళ్ళు వచ్చేటప్పటికి టిమొతి యేడుగురు కొడుకులూ గడికట్టి ఆర్జనపరు లయ్యారు. పడిపోయిన స్థితి అప్పుడే మెల్లమెల్లగా కోలుకుంటోంది. కాని, 1914 లో జర్మనితో యుద్ధం సంప్రాప్తమైంది.

1914 చివర రోజుల్లో మాస్కో ప్రభుత్వం నుండి టిమోతీకి అజ్ఞాపత్రం అందింది. వయసువచ్చిన తన యేడుగురు కొడుకులూ సత్వరంగా సైన్యంలో చేరాలని, వెంటనే యేడు

గురూ, దేశరక్షణకు యుద్ధం చెయ్యడానికి పంపబడ్డారు. కాని, అచిరకాలంలోనే, స్థానికాధికారులు దుర్వార్తలు కూడా వినిపిస్తూ వచ్చారు. మొదట, జాకబ్‌ను గురించి— "జార్ కోసం, మతం కోసం, పితృభూమి కోసం ప్రాణాలు కోల్పోయాడు" అని. తరువాత, సెర్గికూడా స్వర్గమలంకరించాడు. సైమన్ ప్రాణాలను గోల్పోలేదు కాని ఒక చెయ్యిపోయింది. ఈదుస్థితిలో, అసలే కష్టాలతో క్రాగిపోతున్న తండ్రి నింకా వేధించడం యిష్టంలేక యుద్ధం నుండి తిరిగి యింటికివస్తూ మనసు మార్చుకొని కనపడకుండా పోయాడు, యెక్కడికో, సైమన్.

ఈవిధంగా దురవస్థలపాలైన వందలూ, వేలూ కుటుంబాలలో ఒకటి సురోవ్ కుటుంబం. తండ్రులూ, కొడుకులూ, అధికసంఖ్యాకంగా దినదినాభి వృద్ధిగా, నేలకొరగడమో, వికలాంగులు కావడమో, గాయాలు తగలడమో పరిపాటైంది. వారిస్థానే, కొత్తవారిని యుద్ధభూమికి సిద్ధం చెయ్యవలసి వచ్చింది. సంపాదించి, కుటుంబాలను పోషించే వారి సంఖ్య తగ్గుతున్నకొద్దీ ఆకలిమంటలు మిన్నంటడం, క్షుధార్తులలో అసంతృప్తి ప్రబలడం యెక్కువైపోతూ వచ్చింది. వారిలో వారు అనేక విధాలుగా ప్రశ్నించుకోసాగారు. ఈయుద్ధం యెందుకు చేస్తున్నట్టు? ఎవరు కావాలని కోరుకున్న యుద్ధం యిది? దీనికెప్పుడైనా ముగింపు అనేది వుండేనా; అనేమర్మర ధ్వనులు అధికం కాసాగాయి, మంద్రస్థాయిలో ప్రారంభమైన యీధ్వనులు గంభీరగర్జనల భీకరస్వరూపం దాల్చాయి, తత్పరిణామంగా వదంతులు ప్రాకడం ప్రారంభించాయి.

"సైన్యం యుద్ధం చెయ్యనంటోంది" అని, "విప్లవం" అన్న మాట ప్రతి వారి పెదిమలమీద తాండవిస్తోంది.

యుద్ధం సాగుతున్న కొద్దీ సురోవ్ కుటుంబం జరాభారంతో కృంగే వృద్ధురాలుగా తయారైంది; విచారం యెక్కువైంది, స్తబ్దత పెరిగింది. ఇలా వుండగా 1916–17 సంవత్సరంలో ఒక నాడు, ఉన్నట్లుండి యింట్లో కదిలిక యేర్పడింది. మార్క్ తోట గోడమీద కూర్చొని వీధివైపు కళ్ళు వప్పగించి చూస్తూన్నాడు, జోడుగుర్రాలబండి ఒకటి వస్తూ తిన్నగా తమ యింటిముందరే ఆగింది. సైనిక దుస్తులలో యిరువురు పురుషులు ఆశకటంలోంచి దిగారు. వారిలో ఒకరు, చేతిలో తుపాకి పట్టుకున్న వాడు, యీ బాలుణ్ణి సమీపించాడు.

"నన్ను మరచిపోయావురా, మార్క్ ?" అన్నాడు.

ఆతడు, మార్క్ శిపాయి అన్నల్లో నాలుగోవాడు — కోర్ని; అతని ప్రక్క నున్నవాడు అయిదోవాడు, డిమిత్రి.

మార్క్ గంతులు వేసుకుంటూ, కేకలు పెడుతూ రివ్వున యింట్లోకి పరుగెత్తాడు. "అన్నయ్యొచ్చాడు; తుపాకి కూడా తెచ్చాడు" అంటూ.

కోర్ని, చిన్నప్పుడు, ఆవూరి వారందరికీ యేవగింపుగా వుండేవాడు. పని పాటులు లేక, కనపడిన వాళ్ళందరితో కల హిస్తూ, పోకిరీగా తిరిగేవాడు. కుటుంబమూ దరిద్రంతో కొట్టు మిట్టాడుతూ వుండేది. ఎవరే అహితమైన మాటన్నా, అది తనను న్యూనత పరచడానికి అన్నట్లుగానే అపార్థం చేసుకొని తూర్పారబట్టేవాడు. కలహం లేకపోతే కాలయాపన అయ్యేదే కాదతనికి, అతని తండ్రి, అనేస్తార్లు, తన కోపాన్ని ఆపుకో

లేక విపరీతంగా కొరడాతో కొట్టేవాడు. ఎన్ని చేసినా అతడు దారికివచ్చిన పాపాన పోలేదు. పద్ధతి మార్చుకోలేదు.

కాని, యిప్పుడో! కోర్నీలో పెద్ద మార్పు వచ్చింది. పూర్వంవలె కాక ఆత్మవిశ్వాసాన్ని అలవర్చుకున్నాడు. కార్య శూరుడయ్యాడు. తాను తిరిగి వచ్చిన మర్నాడు సాయంకాలం గ్రామస్థులలో కొందరిని కలుసుకుని గోష్ఠి జరిపాడు. అతడి మాటలధోరణిని బట్టి, సైన్యం యుద్ధం చెయ్యడానికి నిరాకరించినందున, యుద్ధం సమాప్తమైనట్లేననీ, జార్ నుండి సర్వాధికారాలు స్వాధీనం చేసుకోబడ్డాయనీ, యిక ముందు ప్రజలే రష్యాకు పాలకులౌతారనీ, యథాశక్తిగా మార్క్స్ కూడా తెలుసుకున్నాడు. రైతాంగానికి భూమి స్వాధీనపర్చడాన్ని గురించి కోర్ని యెన్నెన్నో విషయాలు చెప్పాడు.

కొన్నాళ్ళు గడచిన తరువాత, చెయ్యిపోయిన సైమన్ కూడ యింటికి వచ్చాడు. కొంతకాలం మాస్కోలో గడిపాడు. చివరకు అతడు కూడా విప్లవకారుల జాబితాలో చేరాడు. సురోవ్ గృహం, గ్రామంలోవున్న అగ్రశ్రేణి విప్లవకారు లందరికీ రహస్యకూటస్థలం అయింది. ఇచ్చట జరిగే సమావేశాల్లో కేకలు,చప్పట్లు, ఒట్లు ప్రమాణాలు, శపథాలు పరిపాటై పోయింది. ఐతే, గ్రామంలో విప్లవం లేవదియ్యడానికి కాని, రైతాంగానికి భూమి మార్పిడి చెయ్యడానికిగాని అవలంబించవలసిన పద్ధతులేమో యెవరికీ—చివరకు సైమనుకు కూడా — బోధపడడంలేదు.

1917 వసంతకాలంలో అగ్రశ్రేణి విప్లవకారులూ, రైతులూగల మహాసభ ఒకటి సురోవ్ భవన ఆవరణంలో జరపడానికి నిశ్చయమైంది. ఈ మహాసభలో యుద్ధమనే చర్చ తీసుకోవాలనుకున్నారు కూడా. చూస్తూండగానే మహాసభ తేదీ వచ్చింది. ఆనాడు కూడా కోలాహలానికెక్కడా మితిలేదు. ఆవేశాలతోటీ, వాగాడంబరాలతోటీ, ప్రమాణాలతోటీ, 'వోడ్కా' మదిరాపానంతోటి సభ ముగిసేటట్లే కనిపించింది. ఇంతలో, జోసెఫ్ అపనాసెంకో అనే కోర్నీ స్నేహితుడొకడు తలవని తలంపుగా అక్కడ వూడిపడ్డాడు.

అపనాసెంకో సురోవ్ కుటుంబ స్నేహితుడు; అందరికీ బాగా తెలిసినవ్యక్తి. అక్కడికి సుమారు యిరవై మైళ్ళ దూరంలోవున్న ఒక గ్రామం అతని నివాసం. యుద్ధానికి పూర్వం, ఆగ్రామంలోనే ఒకభూఖామందు దగ్గర వ్యవసాయ కూలీగా పనిచేసేవాడు. యుద్ధంలో అతడూ, కోర్నీ ఒక్క క్షణమైనా ఎడబాయకుండా కలసి మెలసి ఉండేవారు. ఇరువురూ ఒకే పటాలంలో పనిచేస్తూ ఒకేసారి ఉన్నతపదవి నందుకొని, ధైర్యసాహసాలకు చిహ్నంగా "జార్జ్‌క్రాస్" బహుమానాన్ని ఒకేరోజున అందుకున్నారు. యుద్ధరంగం చెల్లాచెదరైనప్పుడు యిద్దరూ ఒకేసారి కలిసే తిరిగివచ్చారు. అపనాసెంకో తెలివైనవాడు. అతనికి వ్రాతకోత అంతగా తెలియక పోయినప్పటికీ స్థానిక విప్లవనాయకులలో ఒకడుగా అతను పరిగణింపబడుతూ వచ్చాడు.

సమావేశం జరుగుతూంటే అవనాసెంకో ఆ సమీపం లోనేవున్న ఒక బండినెక్కి ఉపన్యాసం ప్రారంభించాడు. అక్కడికి యిరవై మైళ్ళ దూరంలోవున్న తమ గ్రామంలోని అగ్రశ్రేణి నాయకులంతా 'సోవియెట్ ఆఫ్ డిప్యుటీస్' స్వంత పరిపాలనను నెలకొల్పుకొని ప్రభుత్వాధికారాన్ని స్వాధీనం చేసుకొన్నారనీ, తాను వారి ప్రతినిధిగానే యీసభకు వచ్చా ననీ, రెండు గ్రామాలు కలసి ఒకటిగా పనిచేస్తే బాగుంటుం దని తమ సోవియెట్ అభిప్రాయపడుతోందనీ చెప్పాడు.

దీన్ని సూచనగా తీసుకొని విప్లవం లేవదియ్యాలంటె యేమి చెయ్యాలో స్థానికులు గ్రహించారు. గ్రామంలో సోవి యెట్ నొకదాన్ని నెలకొల్పుకోవాలి; అదె స్థానిక ప్రభుత్వం ఔతుంది. ఈవిధంగా వారొక నిర్ణయానికి వచ్చారు. పిమ్మట మాటలు కట్టిపెట్టి చేతలకు పూనుకొన్నారు. కోర్నిని అరుణ రక్షణ దళాధిపతి (కమాండర్ ఆఫ్ ది రెడ్ గార్డ్స్) గా యెన్ను కొన్నారు. ఈరక్షణదళం ముందు వరసలోనున్న విప్లవకారుల నందరినీ సమీకరించి క్రొత్తగా లభించిన అధికారాన్ని పరి రక్షించుకుంటుంది.

కోర్ని అరుణ రక్షణ దళాధిపతిగా యెన్నుకోబడడానికి పూర్వం, అతని తండ్రి కోర్ని యోగ్యతలకూ, ప్రవర్తనకూ తాను ఉత్తరవాది కాగలనని బండిపై కెక్కి సభవారికి హామీ యిచ్చాడు.

"మీరు సందేహించ నక్కరలేదు." అన్నాడు సురోవ్. వెనుకటిమల్లే కోర్ని అల్లరి చిల్లరవేషాలేస్తే వాడితలకాయను చితకేస్తాను. వింటున్నావురా, కోర్ని?"

ఆ మాటలకు సభలో నున్న వారంతా గొల్లున నవ్వారు. టిమోతి సురోవ్ పిడికిలి బిగించాడంటె యెవరూ నిలబడలే రన్న సంగతి ప్రతి వారికీ తెలుసు. నలుగురితో పాటు కోర్ని కూడా పైకినవ్వాడే కాని అతని ముఖంలో వ్యాకులత కనిపిస్తూనే వుంది.

చివరకు, క్రొత్తగా యేర్పడిన గ్రామ సోవియెట్ కు వచ్చే వారంలో లాంఛన ప్రాయంగా అధికార సంక్రమణకు ముహూర్తం నిర్ణయమైంది.

గ్రామ సోవియట్ కు ఆనాడు ప్రారంభోత్సవం జరగడానికి యేర్పాటైంది. వెనకటి ప్రభుత్వంలోనే నియమింపబడ్డ గ్రామాధికారి శుభ్రమైన ఉడుపులనుధరించి యెర్రటి రిబ్బన్ ను గుండెలమీద తగిలించుకొన్నాడు. గ్రామచౌకీదారు కూడా తన యూనిఫారం ధరించి అధికారచిహ్నమైన కరవాలాన్ని కూడా పట్టుదలతో ధరించియున్నాడు. ఊరేగింపు బయలుదేరింది. పాటలు పాడుతూ, నినాదాలుచేస్తూ కొందరు ఊరేగింపు ముందు నడుస్తూ వుండగా అగ్రనాయకులూ, రైతాంగమూ వెంటరా, గ్రామచౌక్ దగ్గరకు చేరారు. అచ్చట పురోహితుడు వారి మీద పవిత్రజలాలను అభిషేకం చేసిన పిమ్మట, కోర్ని దొంగతనంగా యెత్తుక వచ్చిన మరతుపాకీ మీద కూడ పవిత్రజలం చిలికాడు. మళ్ళీ ఉత్సవం కదిలి తిన్నగా గ్రామ కార్యాలయాన్ని చేరుకుంది. అక్కడ, అంతవరకూ ప్రభుత్వ కొలువులోవున్న వుద్యోగ బృందమంతా సమావేశ మయ్యారు. గ్రామాధికారి, రక్షణాధికారి, గ్రామ కార్యదర్శి, ధాన్యపు గిడ్డంగుల చౌకీదార్లు ఆనేతలు, డాక్టరు,

ప్రభుత్వవేతనాలు పుచ్చుకొంటున్న వేతనోద్యోగులే. గ్రామాధికారి, తన చేతిలో గ్రామచావడీ పెద్ద తాళపుచెవినీ, అధికారపట్టాన్ని పట్టుకున్నాడు.

కోర్ని నిలువెత్తునా లేచి గ్రామాధికారిని, తన వారిని ఉద్దేశించి యీవిధంగా ప్రారంభించాడు ఉపన్యాసం.

"పౌర మహాజనులారా! యిప్పుడు పాతప్రభుత్వం పతనమై ప్రజలచే యెన్నికైన ప్రజాప్రభుత్వం పదవి నలంకరించబోతోంది. దీన్ని మీరెవరైనా ప్రతిఘటిస్తే వెంటనే మేము అణచివేస్తాం..."

"అదేమిటి, కోర్ని?" అని అందుకున్నాడు గ్రామాధికారి.

"మేమెందుకు యెదిరిస్తాం? మాకీ అధికారాలు వద్దే వద్దు. తీసుకో! ఇదిగో తాళపుచెవి. ఇదిగో అధికార ముద్ర ఊం! తీసుకో."

ఐతే క్రొత్త ప్రభుత్వానికి అధిపతి సైమన్ కావడంచేత వాటన్నిటిని స్వాధీనం చేసుకొన్నాడు. అందరూ జయజయ ధ్వానాలు చేశారు. అందరికన్నా గట్టిగా జయ్ కొట్టినవాడు అధికారాన్ని దత్తంచేసిన గ్రామాధికారి.

తరువాత చౌకీదారు ముందుకు వచ్చాడు. తన యూనిఫారాన్నీ ప్రభుత్వ లాంఛనాలనూ, కత్తి మొదలైన వాటినీ అక్కడ కుప్పపెట్టాడు. వేరొక దుస్తులజత అతని భార్య పట్టుకొని యివ్వబోతూంటే జనంలో ఒకడు అడ్డగించాడు. అలాగే నిలబడిపోయిన చౌకీదారుని చూచి అక్కడున్న వారంతా పక్కున నవ్వారు. ఆ ముచ్చట తీరిన తరు

వాత కొంత సేపటికి దుస్తులు తెచ్చిన భార్యను అతని వద్దకు వెళ్ళనిచ్చారు.

ఈసారి వంతు కార్యదర్శిది. తన చేతుల్లోవున్న చిత్తాను విప్లవనాయకుడు ఎక్కిన బండిలో వుంచి గంభీరంగా ప్రారంభించాడు ఉపన్యాసం. ఈ చిత్తాలో రాబడి అంతా యెడమవైపునా ఖర్చంతా కుడివైపునా వ్రాయబడి వున్నాయి. ఆ గ్రామంలో చదువునేర్చిన వారింకెవరూ లేకపోవడంచేత యీ కార్యదర్శినే నూతన ప్రభుత్వం కూడా కార్యదర్శిగా నియమించుకుంది. అతను వెంటనే సోవియట్ సభ్యుల వెనకకు వెళ్ళి నిలుచున్నాడు.

పోతే, యిక, డాక్టరు సంగతి ఒక సమస్యగా తయారైంది. అతని స్థానే యుద్ధంలో పనిచేసిన మిట్కా అనే యువకుణ్ణి నియమించాలని అగ్రనాయకుల కోరిక. కాని, గ్రామంలోవున్న స్త్రీలు దానికి యిష్టపడలేదు. తీవ్రంగా తమ అయిష్టతను ప్రకటించారు. చివరకు, పాతడాక్టరును ఉంచడానికీ, మిట్కాను అతనిచేతి క్రింద పనిచేయమని నియోగించడానికీ రాజీకి వచ్చారు. కార్మికులందరికీ సరియైన వైద్యసేవ లభించేట్టుగా చూడవలసిందని అతణ్ణి కట్టడిచేశారు.

రెండురోజుల అనంతరం రైతాంగం భూములను పంచుకొనడానికి బయలు దేరారు. ఉన్నభూమినంతనూ—భూస్వాముల (ఆస్తి, చర్చి ఆస్తితోసహా—ప్రతి కుటుంబంలోను ఉన్న జనసంఖ్యను బట్టి – కుటుంబాలవారీగా వాటాలు వెయ్యడానికి నిర్ణయం జరిగింది. సురోవ్ కుటుంబానికి యిదివరకెన్నడూ లేనంత భూమి దఖలు పడింది. టిమోతి ఆ

భూమిలో కొంతభాగాన్ని చిన్నకుటుంబాల వాళ్ళకు యిచ్చాడు. మిగతావారు కూడా అతణ్ణి అనుసరించారు. భూఖామందుకు కూడా తనూ, తన కుటుంబీకులూ. యెంత విస్తీర్ణాన్ని సాగుచేసుకోగలరో అంత విస్తీర్ణాన్ని మాత్రమే అనుమతించారు. కూలీల నియామకం యెంతమాత్రం పనికి రాదన్నారు. జరిగిన సంగతంతా వివరంగా చెప్పడానికి విప్లవ సంఘ ప్రతినిధులు కొందరు భూస్వామి దగ్గరకు వెళ్ళినప్పుడు కోపంతో ఆయన యిలా అన్నాడు.

"మీరు నాభూమి నంతెనూ బలాత్కారంగా వశపరచు కున్నారు. నాభూమి మళ్ళీ నాకప్పగించి కాళ్ళమీదపడి, లెంపలు వేసుకొని, క్షమాభిక్ష వేడుకోండి, తరుణ్ణం మించి పోకముందే." అంటూ గిరుక్కున తిరిగి, రోజుకుంటూ, లోప లికి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా సురోవ్ గ్రామంలో విప్లవ బీజాలు నాటు కున్నాయి.



అధ్యాయము 2.

# రక్తపు వెల్లువలు

అధికారాన్ని హస్తగతం చేసుకొని పంటభూమిని పంచేసుకోవడంతో విప్లవం చల్లారిందనే ప్రజలు భావించారు. కాని, నిజానికి, అసలు విప్లవం అప్పుడే నాటుకుంది. నవంబరులో రెండవ విప్లవం,కమ్యూనిస్టు విప్లవం, ప్రారంభమైంది. ఎక్కడ చూచినా 'లెనిన్ బోల్షివిక్' అన్నమాటలె వినవస్తూవుండేవి. ఈవార్త లిలావుండగా, ఎర్రవాళ్ళను – కమ్యూనిస్టులను పిలచేవారు; తెల్లవాళ్ళు – ఇది మరొక రాజకీయ వర్గం–ప్రతిఘటిస్తున్నారన్న వార్తలు కూడావినవస్తూండేవి. అన్నదమ్ములే ఒకరి నొకరు ఢీకొనేవారు. అంతకంతకు అంతర్యుద్ధ సూచనలు ప్రస్ఫుటమైనాయి. చివరకు అంతర్యుద్ధం రానే వచ్చింది.

"వాళ్ళు వస్తున్నారా!" అని సైమన్‌ను కాని, కోర్నీని కాని అడుగుతూవుండేవాడు టిమోతి.

"వస్తున్నారు" అని బరువెక్కిన హృదయంలోంచి గంభీరంగా వచ్చేది సమాధానం.

ఏదో ప్రమాదం రాబోతోందని ప్రతివారు శంకింపసాగారు. చివరకా ప్రమాదం పరిసర గ్రామాలైన డాన్,క్యూబన్ గ్రామాల నుంచి యీగ్రామం ప్రవేశించింది. జనరల్ ఫ్రాంకో వస్కి ఆధిపత్యం క్రింద తెల్లవాళ్ళ పెద్ద దండొకటి స్టెప్పీలలో, అడుగుపెట్టినంత మేర,దగ్ధపటలం చేసుకుంటూ పురోగమిస్తున్నారు. నిర్దాక్షిణ్యంగా రైతు విప్లవాన్ని పీరువారనే విపక్షత

లేక కాల రాస్తున్నారు. తమచేతుల్లో పడగానే ఉరితీయబడ వలసిన వారి పేర్లుగల అచ్చుజాబితాను తమ చేత బట్టుకుని ముందుకునడుస్తూ టెలిగ్రాఫ్ స్తంభాలకు అంటిస్తూ వచ్చారు. అంతవరకూ ఆ గ్రామం నుండి జాబితాలో యెక్కిన పేర్లు యిరవై ఆరు. ఆ యిరవై ఆరు పేర్లలో సురోవ్ కుటుంబంలో పేర్లు మూడు—కోర్ని, సైమన్, టిమొతిసురోవ్.

గ్రామంలో అలజడి ప్రారంభమైంది. తర్కవితర్కాలు ప్రారంభించారు, గ్రామస్థులు. పౌరకోసక్కదండును ప్రతిఘటించడమా లేక యావన్మంది ఊరువిడచి యెక్కడికైనా పారిపోవడమా? అనేప్రశ్న ఉదయించింది. తెల్లవాళ్ళు ఊరు సమీపిస్తున్నారని తెలియగానే ప్రజలు సైమన్ సలహాను ఆమోదించారు—యుద్ధంచేయగలవాళ్ళంతా, నాశనంకాకుండా వుండడానికి, పూరువదలి వెళ్ళిపోవాలనీ, కుటుంబాలు మాత్రం గ్రామంలోనే వుండిపోవాలనీ నిర్ణయింప బడింది.

" భార్యాబిడ్డలను విడచిపోవాలన్న యోచన దుర్భరమనీ, దుఃఖం దుస్సహమనీ నాకు తెలియకపోలేదు. కాని, పోక చేసేదేమున్నది? ఇంతకూ తెల్లవాళ్ళుకూడా మనలాంటి రష్యనులే. కాబట్టి, మనస్త్రీలనూ, పిల్లలనూ వారు బాధించకపోవచ్చు. యుద్ధవయస్కులమైన మనమంతా ఆస్ట్రిగాన్ చవిటి భూములకూ, కోటమన్ స్టెప్పీలకు పోయి వేచి వుందాం. అక్కడ మన బలాన్ని కూడగట్టుకొని పోరుకి సిద్ధమౌదాం."

కోర్నిజట్టు రాత్రికి రాత్రి పూరువదలి బయటపడ్డారు. తమతోకూడా టిమొతి సురోవ్‌నూ, సురోవ్ సోదరులైన

ఫిలిప్ తారస్ లనూ తీసుకుపోయారు. పోగా, సురోవ్ కుటుం బంలో యిక మిగిలినవారు ఇవాన్, మార్కు కాక నలుగురు స్త్రీలు–వేరాఇవనోవ్నా, సైమక్ భార్య, బార్బర, ఓల్గ, టాటియాన. యువకులంతా వూరువదలి వెళ్ళిపోవడం చేత, యెప్పుడే ప్రమాదం సంభవిస్తుందో అని ప్రతివారు గడ గడ లాడి పోతున్నారు.

మరుసటి సాయంకాలం తెల్లవాళ్ళు గ్రామంలో ప్రవేశిం చారు. మొదట వాళ్ళు చాలమర్యాదగాను, స్నేహపూర్వకం గానే కనిపించారు. ఈ వైఖరికి గ్రామంలో ఉండిపోయినవారం తా బ్రతుకుజీవుడా అనుకున్నారు. ఇంతకూ యెర్రవాళ్ళకూ తెల్లవాళ్ళకూ భేదంమాత్రం యేముంది? తెల్లవాళ్ళు విప్ల వాత్మకులె. వాళ్ళూ రష్యనులూ, క్రైస్తవులే నాయిరి. పొరు గుననున్న కోసక్ మండలాలేకదా వారివి! వారు మాత్రం పైవారా? అంటూ సమాధానపడుతూ, సరిపెట్టుకుంటూ వచ్చారు అమాయిక ప్రజానీకం. కాని, తెల్లవాళ్ళు నిజ స్వరూపం బహిర్గతం కావడానికి ఆట్టేకాలం పట్టలేదు. వారి రాక స్నేహపూర్వకమైనది కాదని రుజువు చేశారు. ఇండ్లను సోదాచేసి, అనేకమందిని గ్రామంలోనే ఖైదు చేశారు. వీరిలో వేరా ఇవనోవ్నా, బార్బరాకూడా వున్నారు. మార్కును యెవరికీ వప్పగించడానికి వీలులేక తప్పనిసరిగా తమతోచే తీసుకుపోయారు. ఇవాన్ యిద్దరుపిల్లలూ ప్రాయం వచ్చిన వాళ్ళుకావడంచేత, యేప్రమాదమైనా అసంభవం కాకపో వచ్చుని, వాళ్ళిద్దరినీ తమ పొరుగింటికి పంపేసింది.

చెరసాలనుండి సురోవ్‌లు గ్రామచావడిలో యేర్పాటు చెయ్యబడ్డ తెల్లవాళ్ళ ప్రధాన కార్యాలయానికి గొనిపో బడ్డారు. స్థానికవిప్లవానికి కోర్నీ, సైమన్ నాయకులవడంచేత, తెల్లవాళ్ళ కౌర్యానికి పూర్తిగా గురి అయ్యారు. వేగా ఇవ నోవ్నాను చూడగానే కోసక్ అధికారికి ఆత్మనిగ్రహం పటా పంచలై పోయింది. మానవత్వం నశించి, పశుత్వం ప్రకోపిం చింది. కోపోద్రేకంతో ఒడలుతెలియని ఆ అధికారి ప్రక్క నున్న చిన్నగదిలోకి యీడ్చుకు పోయాడు. అతనిలో యెటు వంటి భావాలు పరుగులు తీస్తున్నాయో, యేమి చెయ్య దలచుకున్నాడో, చూపులలోనే ప్రతిబింబిస్తున్నాయి. ఆమె, యెట్టి అభ్యంతరమూ చెప్పక అతనితో వెళ్ళిపోయింది; బార్బర, మార్క ఆమె వెంట పరుగెత్తుతూ వెనకకు లాగ డానికి ప్రయత్నించారు.

"ఆమె నెక్కడికి తీసుకుపోతున్నారు?" అని బార్బరా గద్దించి అడిగింది, "మమ్మల్నికూడా తీసుకువెళ్ళండి" అని ప్రాధేయ పడింది.

ఆ అధికారి తన పిడికిలితో బార్బరా ముఖంమీద ఒక్క పోటు పొడవగానె నేలమీద కూలిపోయింది. ఒక్కతోపుతో మార్క బంతివలె మరొకమూలకు యెగిరిపడ్డాడు. గోడకు తల తగిలి స్మృతితప్పిన మార్కకు కొంతసేపటికి స్మృతి వచ్చింది. కళ్ళు తెరచి చూచేవరకు ప్రక్కగదిలోంచి, గుండెలను ద్రవింప జేసే తన తల్లి యేడ్పు వినిపిస్తోంది. "దేవాదిదేవా, ప్రభూ" అని భగవంతుణ్ణి తూర్చి ఆమెచేసే విలాపం కటికివాని గుండె లను కూడా కరగించేస్తోంది. ఆమె శరీరంమీద దెబ్బలు బరు

ప్పుగా పడుతున్నట్లు వినవస్తోంది. బార్బరా మూర్తీభవించిన శోక దేవతవలె నిస్సహాయస్థితిలో గదిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తోంది. భయం ఒకవంక, శోకం మరొకవంక ఆమెను పిచ్చిదాన్ని చేసివేశాయి.

"ఆమెను చంపెయ్యకండి, రక్షించండి" అని పదేపదే అంగలారుస్తూ ప్రాధేయపడుతోంది. మా అమ్మను కర్రలతో కొట్టి చంపేస్తున్నారు. దయచేసి యెవరైనా వారించండి" అంటూ వాపోవసాగింది.

మార్క్ తలుపుదగ్గరకువెళ్ళి తెరవడానికి ప్రయత్నించాడు. కాని, యెవరో, మొరటుమనిషి ఒకడు విసురుగా అతణ్ణి వెనకకులాగి పట్టుకున్నాడు. ఆ పట్టులోంచి విడిపించుకొనడానికి ప్రయత్నిస్తున్న మార్క్‌కు తన తల్లియేడుపులు స్పష్టంగా వినిపిస్తున్నాయి. ఆమె వంటిమీదపడిన ప్రతి దెబ్బతోటి యిక్కడ మార్క్ ఊగిపోతున్నాడు. బాధతో కుమిలిపోయాడు.

కొంతసేపటికి కంఠానిశ్శబ్దం, అతనితల్లి బయటపడింది. కట్టుకున్న బట్టలు చీలికలూ, పేలికలూ అయినాయి. ముఖం దెబ్బలతో కమిలి వివర్ణమైపోయింది. ఒక్క అడుగుకూడా ముందుకు పెట్టలేకుండావుంది వేరా.

వేరా, బార్బర, మార్క్ యింటికిపోవడానికి అనుమతింపబడ్డారు. బార్బర చేతనైనంతవరకు వేరాయివనొప్పాను తన మీాద ఆన్చుకుని నడుస్తోంది. మార్క్ ఆమె చేతిని గట్టిగా పట్టుకొని ప్రక్కగా నడుస్తున్నాడు, ముందుకు నడుస్తున్న

కొద్దీ గ్రామచౌకలో ఉరితియ్యబడ్డవాళ్ళు ఉరికంబాలనుండి వేళ్లాడుతున్నారు.

తొలిసారిగా నాడు తెలుసుకున్నాడు మార్క్, జీవితమంటె యెంతకష్టభూయిష్టమైందో; ఎటువంటి కష్టపరిస్థితులలో మనిషి యెంతటి బలవంతుడైనా దుర్బలుడై ఊరుకుంటాడో. ఆనాడు అతడు ముక్కుపచ్చలారని బాలుడు; కాని, తనతల్లి పడినభంగపాటు అతణ్ణి ఒక్క ఊపులో పెద్దవాణ్ణి చేసింది.

వేరా ఇవనోవ్నా చాలారోజులు మంచంపట్టి మెల్ల మెల్లగా కోలుకున్నాక కుటుంబపోషణకు పాటు పడవలసి వచ్చింది. కొద్దో గొప్పో కుట్టుపనినేర్చి వున్నందున, ఊళ్ళో వాళ్ళ దుస్తులు కుట్టుమిషనుమీద కుట్టియిచ్చి ఆకూలిడబ్బు లతో కుటుంబపోషణ చేసేది. తాతియానా తల్లిచేతికి అప్పు డప్పుడు ఆసరా ఔతున్నా, తనుచెయ్యగల పనిపాటలు అం తగా లేకపోవడంవల్లనూ, ఆ కుటుంబపోషణభారం ఒకరుతప్పినా మంచిదేనని భావించి పక్కవూళ్ళో వుంటూండేది. పోతే, యివాన్, మార్క్ కూడా పనిపాటలులేకుండానే వున్నారు. పెరడంతా ఖాళీగా వుంది. తోటలో పండినపంటను మాత్రం పోగుచేసుకోవడం అయిపోయింది. ఆకురాలుకాలం చేరు వౌతున్నా తోటిస్నేహితులతో ఆడుకుందామనే, ధ్యాస కూడా వారికిలేదు.

తమ కండ్లకు కనపడినదాన్నంతను తెల్లవాళ్ళు యెత్తుకు పోవడంచేత ఉన్నవాటితోటే సరిపెట్టుకోవలసి వచ్చిందిరైతాంగం. ఇక సురోవ్ కుటుంబం సంగతి చెప్పనే అక్కరలేదు. ఇట్టిదుస్థితిని వారిదివర కెన్నడూ అనుభవించియెరుగరు.

వేరాసంపాదన యిద్దరుపిల్లలకూ కడుపునిండా తిండిపెట్టడాని కేనా సరిపోవడంలేదు. ఇది ఆమెను చాలా మథనపెడుతోం దన్నసంగతిని పిల్లలిద్దరూ గ్రహించి తాముకూడా యిల్లువిడచి వెళ్ళిపోదా మనుకున్నారు. ఇవాన్‌కు సంపన్న రైతొకడు ఉద్యోగంయిచ్చాడు. తన గుఱ్ఱాలను కనిపెడుతూ వుండమ న్నాడు. మార్క్ స్టెప్పీలలో యితరగొర్రెల కాపరులతో పాటు గొఱ్ఱెలను కాపలాకాయడానికి కుదిరాడు. ఈవిధంగా సురోవ్ భవనంలో చిన్నకుటుంబంలోంచి మరోముగ్గురు నిష్క్ర మించారు.

1918 లో రెండుమాసాలపాటు మార్క్ స్టెప్పీలలోనే వుండిపోయాడు, గొర్రెలకాపరిగా. ఎండవేడికి అతనిచర్మం బాగా వలుపెక్కింది. జుట్టు తెల్లబడింది. దరీ అంచూలేని ఆవిశాల సమప్రదేశంలో, వినీలాకాశంక్రింద రాజ్యం యేలు తున్న నిశ్శబ్దవాతావరణంలో మానవక్లేశాలన్నీ కొరగానివిగా కాన్పిస్తాయి, ప్రకృతిలో లీనమై యేకాంతవాసిగా నున్నంత సేపూ నరుడు, తనను వేధిస్తున్న బాధలను తాత్కాలికంగా నైనా మరచిపోతాడు. మార్క్ కూడా అంతే. తనగ్రామంలో, ఆ పాతయింట్లో తాను విడచివచ్చినదంతా ఒక స్వప్నగత వృత్తాంతంగా తోచిందతనికి. ఒక్కతల్లినగురించిన భావాలె అతణ్ణి మంగలంలోపెట్టి వేచినట్టు వేపుతూవుండేవి. ప్రతిరాత్రి నిద్రకుని కే ముందు ఆమె కుట్టుమిషను మీదకు వాలి అదే పనిగా బట్టలుకుడుతూ, కుడుతూ, కుడుతూవున్నట్లే కలలుకనే వాడు పాపం మార్క్.

తల్లిని చూడాలనివున్నా, తాను కష్టాలు పడుతూవున్నా స్టెప్పీలలో రోజులుదొర్లించడమె బాగుంది మార్క్‌కు, ముందుగతి ప్రసక్తిలేకుండా. కాని, మార్క్ ఆవిధంగానూ సఫలీకృతుడు కాలేకపోయ్యాడు, ఒకప్పుడు యెర్రవాళ్ళు, మరొకప్పుడు తెల్లవాళ్లు జట్లుజట్లుగావచ్చి గొర్రెలమందలను తోలుకుపోతూండేవారు. కాగా, యిక కాపలాకాయడానికి గొర్రెలేమి మిగలలేదు.ఆఖరిమందలు తోలుకుపోతూంటె కాపరులు దీనంగా కళ్ళప్పగించి చూస్తూ నిలబడిపోయారు. మార్క్‌ను తల్లివద్దకు పంపేశారు.

ఇంటికి తిరిగివచ్చే సరికి ఊరినిండా సాయుధభటులుండడం చూశాడు మార్క్. ఏ యింట్లోచూసినా వాళ్ళే. తమ యింట్లోనే ఆరుగురుదాకా వున్నారు. వారిలో దొడ్డికాళ్ళూ, ముఖంనిండా వెంట్రుకలు, ఛాతీమీద వరసలుదీరిన పతకాలు గల గెరసిమోవిక్ అందరిమీద ప్రత్యేకాధికారం చలాయిస్తున్నట్టు కనిపించాడు.

"మనం యిక్కడి కెందుకొచ్చినట్టు?" అని ప్రశ్నించాడాయన. "పరుల భూములకు సంబంధించిన వివాదాలలో జోక్యం కలిగించుకోవడమేనా మన పరమావధి? మనం మోసపోయాం. ఈ రైతాంగం భూమిని పంచేసుకొని మంచిపనే చేశారుకూడా. కాని, మనంవచ్చి, సాగులోవున్న ఆ భూమిని వారి చేతుల్లోంచి బలాత్కారంగా స్వాధీన పరచుకొని, యెవరిభూమిని వారికి స్వాధీనపరచాం. ఎందుకని?

పాపం, తెల్లవాళ్ళు కొన్నాళ్ళయినా గ్రామాన్ని స్వాధీనంలో వుంచుకొనడానికి నోచుకొనలేదు. గ్రామానికి 20 మైళ్లు

చుట్టుపక్కల తెల్లకాపలావారికీ యెర్రకాపలా వారికీ ఘర్షణలు యెప్పుడూ జరుగుతూనే వుండేవి. ఈ గ్రామం కూడా అనేకసార్లు చేతులు మారింది. ఇటువంటి సన్నివేశంలోనే, ఒకానొకపోరాటంలో గాయపడినవారిని 'స్లి' శకటంలో వేసుకొని, 'టిమొతిసుగోవ్ తో లకుపోతూంటె చంపబడ్డాడు.

జాకబ్ చనిపోయాడు; సేర్గి అతణ్ణి అనుసరించాడు; సైమన్‌కు చెయ్యిపోయింది; డిమిట్రి యెక్కడికో పోయాడు; ఇప్పుడు టిమొతి వంతు వచ్చింది. ఈ కొత్తవిచారంతో వేరా ఇవనోవ్నా పూర్తిగా కృంగిపోయింది. ఎలుగెత్తి యేడ్చేదికాదు కాని, తనలో తను కుమిలిపోతూ మౌనంగా కూర్చొని గదిమూల అలుముకున్న చీకట్లను చూస్తూ పరధ్యానంలో వుండేది. ఆ పగలు, ఆ రాత్రి మరుసటిరోజంతా అలాగే కూర్చునివుంది. టాటియానా తల్లినిసమీపించి, అనునయవాక్యాలతో, దుఃఖోపశమనంచేస్తూ, గోలు గోలున యేడ్చింది. ఆహార మేమైనా తీసుకోమని దీనాతిదీనంగా గృచ్చి గృచ్చి బ్రతిమాలింది. కాని, లాభం లేకపోయింది. ఆమె నేత్రాలు వికసించేవున్నా, చూపు లేకుండా పోయింది. తనకన్నబిడ్డలు కార్చే కన్నీళ్ళుకూడా ఆమెకండ్ల కానడం లేదు. ఆమె వినీలకుంతలాలు పాండిమను వహించాయి.

క్రిమేపి జనరల్ ఇవటావ్ ఆధీనంలోవుండి, కోర్ని, సైమన్‌ల నాయకత్వం క్రింద పురోగమిస్తున్న రెడ్‌గార్డ్సు బలం చేకూర్చుకొని తమ నెదిరిస్తున్న తెల్లవారి ఫౌజుమీద పడి, వారిని ఓడించడమెకాక గ్రామాన్నే తిరిగి పట్టుకొన్నారు; పట్టుకొనడమే కాదు కాలు నిలద్రొక్కుకున్నారుకూడ.

ఆ యుద్ధంలో నూరుమందికి పైగా తెల్లవాళ్ళు ఖైదీలుగా పట్టుబడ్డారు. ఈ పట్టుబడ్డ వారిలో వేరా ఇవనోవ్నాను హింసించిన యుద్యోగి నికిట గెరసిమోవిల్ కూడా వున్నాడు.

ఈ విజయోత్సవ సూచకంగా వేరా యివనోవ్నా తన వంటింటిలో, తనకొడుకులకూ, యితర రెడ్‌గార్డ్ ఉద్యోగులకూ పెద్ద విందొకటి యేర్పాటు చేసింది. భోజనాల బల్లమీద మధ్యగా వుంచబడిన పళ్ళెం లోంచి యెవరికి కావలసింది వారు వడ్డించుకొని తినేవారు. భోజనాలప్పుడు యెవరూ అంతగా సంభాషించ లేదు. కాని, యెవరి చంచాలను వారు క్రింద పడవెయ్యగానె అంతా ఒక్కసారిగా ప్రసంగానికి ప్రారంభించారు.

"మనం నూరుమందికి పైగా ఖైదీలను పట్టుకున్నాం." అన్నాడు సైమన్ ఇపటొవ్‌తో. "వీరిని యేమిటి చెయ్యడం?"

"మనవాళ్ళని-సుమారు నాలుగువందల మందిని-వాళ్ళేమి చేశారో మనమూ వాళ్ళని అదె చేద్దాం—కాల్చేద్దాం" అన్నాడు ఇపటోవ్.

ఈ మాట విని అంతవరకూ గోడ నానుకుని నిల్చున్న వేరా ఇవనోవ్నా బల్లను సమీపించి మౌనంగా ఇపటోవ్ ప్రక్కన మోకరించింది. గదిలో యెవరూ మాట్లాడలేదు. అతని ముఖంమీద తన దృష్టిని నిల్పి, గద్గద కంఠంతో ప్రారంభించింది; "వాళ్ళను క్షమించండి; రక్తం చిందించకండి... రక్తం రక్తాన్నే కావాలంటుంది. వీళ్ళకీ తల్లు లుంటారు;

భార్యలూ పిల్లలూ కూడా వుంటారు ; వీళ్ళని చంపితే తమ తండ్రిల కోసం యెదురు చూస్తున్న చిన్నపిల్లల్ని కూడా చంపారన్న మాట. అటువంటి దారుణాన్ని చెయ్యకండి. మని షైన తరవాత జాలి, అంతఃకరణ, దయారసం అనేవి వుండాలి ”

ఇపటోవ్ పళ్ళు పటపట కొరుకుతూ కిటికీవద్దకు వెళ్ళి బయటకు చూస్తూ నిలుచున్నాడు. ఒకటి రెండుక్షణా లంతా నిశ్శబ్దం ; ఆ నిశ్శబ్దానికి వేరా యేడ్పువల్ల అంతరాయం కలి గింది. ఇపటోవ్ వెనకకు తిరిగి ఆమెను నేలపై నుండి లేవ నెత్తాడు.

“ ను వ్వేమంటావ్ం, సైమన్ ? ఇంతకూ మీ అమ్మ చెప్పిందే మంచిదేమో. మనం వాళ్ళను విడిచిపెడితే, తెల్ల వాళ్ళు మనవాళ్ళను చంపడం మానేస్తారు. ”

సైమన్ యేదో చెప్పబోతోంటే, అతనితల్లి తనవద్దకు పరుగెత్తుకు వచ్చి భుజంమీద నానుకొని, చెవిలో, అందరికి వినపడే టంత గట్టిగా చెప్పడం ప్రారంభించింది :

“ నాయనా, సైమన్, మీ తండ్రికోసం, నీ చిన్న తమ్ము ళ్ళకోసం...”

సైమన్ నేల మీదకు చూస్తూ వుండి పోయాడు. అతని నోటివెంట మాటలు చాల బరువుగాను, వెగటుగాను వెలు వడు తున్నాయి.

“ వీళ్ళమీద నా కేమాత్రం కనికరం లేదు. ఎప్పుడూ వుం డదుకూడ ; కాని, మా అమ్మ ముఖం చూసి ఆలోచి స్తున్నాను.

మీరు ఆజ్ఞల నివ్వండి, ఇపటోవ్. దాన్ని అక్షరాలా నిర్వ ర్తించే భారం నేను వహిస్తాను."

"మా అమ్మ కూడా మీ రన్నట్లే అనివుండు నను కుంటాను." అన్నాడు ఇపటోవ్ వేరా ఇవనోవ్నాతో, "కాని, ఆమె నాతల్లి కావడంవల్ల వాళ్ళు ఆమెను చంపే శారు." ఒక్క క్షణం అతని ముఖం జేవురించింది. కాని, వేరావైపు తిరగ్గానే కంఠం సరళమైంది. "సరే మీ యిష్ట ప్రకారమె ఖైదీలను వదలి వేద్దాం." అన్నాడు యిపటోవ్.

1919 సంవత్సర మంతా రక్తపాతంతోటి, కష్ట నష్టాల తోటి క్షుధార్తుల ఆక్రందనాల తోటి గడచి పోయింది; 1920 తో స్థబ్దత యేర్పడింది, మరొకసారి, సురోవ్ కుటుం బంలో. తనకున్న పన్నెండుగురు సంతానంలోను తనతో ముగ్గురుమాత్రం వున్నారు—పద్దెనిమి దేళ్ళ యువతి తాతి యాన, పదమూడేళ్ళ ఇవాన్, పదకొండేళ్ళ మార్క్.

డిమిట్రీని తెల్లవాళ్ళు చంపేశా రన్న సంగతి ఆమెకు తెలియదు. సైమన్ చాలా ప్రముఖుడై పోయాడు. ఆ ప్రాం తాన్నంతా అజమాయిషీ చెయ్యవలసిన బాధ్యత అతనిది. తత్కారణంగా, ప్రధాన కేంద్ర స్థానమై, చేరువలో నున్న పట్టణానికి అతడు తరలవలసి వచ్చింది. అతణ్ణి అనుసరించ వలసివచ్చింది బార్బర. కోర్ని ఒక పటాలానికి అధిపతిగా వుంటూ బుడెన్ని ప్రథమ అశ్వికదళంలో పనిచేస్తూ మంచి పేరు ప్రతిష్టలను సంపాదించాడు. తారస్, ఫిలిప్, కోర్ని సిబ్బందిలో చేరాడు. గ్రిగొరిస్క్వాడ్రన్ కమాండర్ అయ్యాడు.

ఆ రోజుల్లో ఉత్తర ప్రత్యుత్తరాలకు రాకపోకల సౌకర్యాలంతగా వుండేవికావు. ఉన్నా చాల సక్రమంగా వుండేవి. తన కొడుకులు క్షేమంగా ఉన్నారా లేదా అన్న సంగతేనా వేరా యివనోవ్నాకు సరిగ్గా తెలియడం లేదు. ఈ మధ్య ఉత్తరాలు అసలే లేకపోవడంచేత, ఆమె మరీ దిగులుపడుతూంటే తాతియానా, ఆమె యిద్దరు సోదరులూ ఒక ఆలోచన చేశారు. తమలో యెవరో ఒకరు అన్నల అన్వేషణకు బయలుదేరి అమ్మకు వార్తలను చేరవెయ్యాలనే నిర్ణయానికి వచ్చారు. కాని యెవరు వెళ్ళడం అన్న తర్జనభర్జనలు జరిగిన మీదట ఆభారం మార్క్ మీద పడింది. ఎక్కడికో గమ్యస్థానం తెలియని చోటికి ప్రయాణమౌతున్న మార్క్‌కు చెయ్యవలసిన ప్రయాణ సన్నాహాలకు కొంతకాలం పట్టింది. చివరకు ఆరోజు రానే వచ్చింది.

బుడెన్ని అశ్వికదళం ఉక్రెయిన్ కొండలలోనే యెక్కడో వున్నదని వినికిడి. రష్యా యెంతటి పెద్దదేశమో, ఊహించడమైనా చేతగాని బుడుతడు ఉక్రెయిన్ కొండలు యెక్కడున్నాయో యెలా ఊహించ గలడు! పైగా, అదొక పెద్దదూరంలా కనిపించలేదతనికి. తన ఉన్న పట్టణానికి కొంచెం అవతలగా యెక్కడో చేరువలోనే ఉక్రెయిన్ వున్నదని మార్క్ భ్రమ. ఇక ఉక్రెయిన్ చేరుకుంటే, తన అన్నలను కలుసుకున్నట్టే నని అతడు భావించాడు.

తన కడసారపు కొడుకు, అన్నలను వెతుక్కుంటూ, వెళ్ళాడని, విన్న సాయంకాలం వేరా ఇవనోవ్నా యేడ్చిన యేడ్పు యింతా అంతా కాదు. కాని, అప్పటి కప్పుడే

మార్క్ రైలుమీద ప్రయాణంచేసి కొన్నివందల మైళ్ళు దూరమైనాడు. ఈ మహా ప్రపంచంలో త్రొక్కిళ్ళాడుతున్న జన బాహుళ్యంలో ఒంటరిగాడై పోయాడు మార్క్. జర్మనీతో జరిగిన నాలుగేళ్ళ యుద్ధంవల్లా, అంతర్యుద్ధాల వల్ల నిలవనీడలేక అల్లాడుతున్న, ఆజనంలో కలసి పోయాడు మార్క్. ఏ రైలు చూచినా జనంతో కిటకిట లాడుతోంది. ఎలాగైనా రైల్లో పడితేచాలు నని జనం రోజులు, వారాలు నెలలుగా పడిగాపులు పడిపడి తహతహ లాడుతున్నారు. ప్రతి స్టేషన్ లోనూ, రైలుమార్గం పొడుగునా అభాగ్యులైన పిల్లలై—తల్లిదండ్రులను పోగొట్టుకొన్నవారు, వారిచే పరిత్యజింప బడినవారు— ఆకలిదప్పులకు తాళలేక శోషించిపోయే వారు. ఎక్కడ చూచినా ధూళి ధూసరితమై, నిరాశాజనకమై, నిస్తేజమై, హృదయవిదారకమై భయంకరమై తోచేవి పరిస్థితులు.

మార్క్ తన వెంట తీసుకువెళ్ళిన ఆహారం ఒకవారంకన్న సరిపోలేదు. కొనుక్కొన డానికి దగ్గర డబ్బులేక పోవడం చేత, రైల్వే స్టేషన్లలో పనిచేసుకుంటూ, ఆవచ్చిన కూలి డబ్బులతో పొట్టపోసుకునే వాడు. కాని, ఆకలివేసినప్పు డల్లా పనిమాత్రం ఎక్కడ దొరుకుతుంది! అందుచేత, తరచు ఆకలితో అల్లాడి పోయేవాడు. ఆమాత్రమైనా నోచుకోని అనేకమంది మార్గ మధ్యంలోనే, రైలుబాట వెంట సొమ్మసిలి పడి ప్రాణాలను వదిలేవారు, ఆవిధంగా అసువులను బాసిన వారి కళేబరాల నన్నింటినీ ఒకచోట గుట్టకింద పడేసేవారు. ఎవరూ ఆకళేబరాలను గురించి తెలుసుకొన డానికికూడా ప్రయ

త్నించ సాహసించేవారు కాదు. ఫలానా శవం యెవరిదని కాని, ఫలానా శవం యిక్కడికి కెలావచ్చిందని కాని, యెవరూ ప్రశ్నించేవారూ కాదు. వ్యక్తిగతంగా మనషి యెట్టి ప్రాముఖ్యాన్ని పొందలేదు కదా!

ఈ విధంగా అధ్వాన్న స్థితిలోనున్న ఆప్రాంతంలో, ఒక స్టేషనునుండి, మరొక స్టేషనుకు తర్లుతూ, మధ్య మధ్యయెన్నెన్నో దుర్భరదృశ్యాలను చూస్తూ వచ్చాడు, మార్క్. ఎక్కడచూచినా, పేలు కుప్పలుకుప్పలుగా బారులు బారులుగా కనపడేవి. ఆ క్రిమి మనిషిమీద యుద్ధాన్నే ప్రకటించింది. రైలు స్టేషన్లమీద, అక్కడ గుమిగూడిన వారిమీద దండెత్తి ఓడించేవి. బల్లలూ, కుర్చీలు గోడలు—అన్నీ యీ పేలతో నిండిపోయాయి. రాత్రిళ్ళు నిద్రలేకుండా స్టేషన్లలో నతమతమైపోయిన జనం తెల్లవారిన తరవాత లేచి వందలాది పేలను తమకట్టు బట్టలమీదనుండి దులుపుతూ వుండేవారు.

విధీ విరామమూ లేక, ఒక వంక ఆకలితోటి వేరొకవంక పేలతోటి యమయాతన పడి మార్క్ యెలాగో ఉక్రెయిన్ జేరుకున్నాడు.

బుడెన్ని అశ్వికదళం ఆ ప్రాంతంలోనె యెక్కడో వున్న మాట నిజమేకాని, యెక్కడో, అక్కడికి యెలా వెళ్ళాలో మాత్రంయెవరూ చెప్పలేక పోయూవారు. అపరిచితమైన ఆ ప్రాంతమంతా యెన్నోసార్లు ముందుకీవెనక్కీ తిరుగుతూవుండేవాడు. మనిషి వయస్సు చూస్తే తక్కువ—పరిస్థితిచూస్తే

అయోమయం—రైలుకార్ల కప్పులమీద,గాసొలైన్ ట్రక్కుల మీద ప్రయాణం చేస్తూంటే ఘోరమైన వాసనలకు తట్టుకో లేక అప్పుడప్పుడు యించుమించు స్పృహతప్పి పడిపోయే వాడు కూడ. కాగా, తప్పనిసరి అయినప్పుడు నడకసాగించే వాడు.

తన అన్నకోసం తిరిగి తిరిగి చివరకొక రైలుస్టేషన్‌ను చేరుకుని అక్కడ ఒకవారంరోజులు ఆగవలసి వచ్చింది. ఆ స్టేషన్ మాస్టరుకు యెలాగో తెలిసింది యితగాణ్ణిగురించి. సైన్యం యెక్కడ విడిసి వున్నదో తెలుసుకొనడం కోసం తహతహ లాడుతున్నాడని ఆయన కెవరో చెప్పారు. పిలిపిం చాడు.

"ప్రక్కనున్న పట్నంలో బుడెన్ని సైన్యానికి సంబంధిం చిన ఆస్పత్రి ఒకటి వుంది. నువ్వు అక్కడికి వెళ్ళావంటే, మీ అన్నయ్యలను కలుసుకొనడానికి వాళ్ళేమైనా సాయం చేయవచ్చు. కాని, అక్కడకు కాలినడకను వెళ్ళడంకన్న మార్గంలేదు. దూరం యిరవై మైళ్ళలోపు" అన్నాడు మాస్టర్. మర్నాడు మార్క్ పట్నం ప్రవేశించాడు.



అధ్యాయం 3.

## "పటాలం పెంపుడు కొడుకు"

ఆస్పత్రిలో మార్క్‌ను అడిగారు మీ అన్నలు యే పటాలంలో వున్నారని.

"నాకు తెలియదు" అన్నాడు మార్క్.

"ఐతే, కష్టమే" అన్నది. అతణ్ణి లోనికిరానిచ్చిన ఆడ నర్స్. "బుడెన్ని సైన్యం చాలపెద్దది. అందులో యెన్నో పటాలాలున్నాయి. నీ పేరేవరు?"

"సురోవ్"

"సురోవ్?" అని తెల్లబోయిందామె. "ఆ సంగతి చెప్పవేమి యింతవరకూ? ఐతే, వాళ్ళకోసం నువ్వు ఆట్టేశ్రమ పడనక్కరలేదు. ఇద్దరు సురోవులూ యిక్కడే వున్నారు, కాని, వారిలో ఒకడు..."

అంటూనే ఆమె మార్క్‌ను సురోవ్‌లున్న గదిలోకి తీసుకువెళ్ళింది. కాలిమీద, చేతిమీద బలమైన గాయాలు తిన్న కోస్త్య ఒకబల్లదగ్గర కూర్చుని వున్నాడు. దూరంగా, ఒకమూల తారస్ చాలా జబ్బుతో పడుకుని వున్నాడు."

"మార్క్" అని ఒక్కకేక పెట్టాడు కోస్త్య సంతోషం పట్టలేక. ఎలావూడిపడ్డావురా, నాతండ్రీ, యిక్కడకు?" ఈలోపుగా మార్క్ గదిమూలగా వున్న ప్రక్కవైపు చూస్తూండడం కనిపెట్టిన కోస్త్యముఖం వివర్ణమైంది. "ఔను వాడు తరాసె. చాల జబ్బుగా వున్నాడు"

ఆ మూలనుండి నీరసమైన కంఠధ్వని వినిపించింది : "మార్క్ వచ్చాడా? లేక, నేను కలగంటున్నానా? అని ప్రశ్నించాడు తరాస్.

మార్క్ అతని మంచందగ్గరకు వెళ్ళి యేమనాలో తెలియక నిలుచున్నాడు. బాధ పడుతున్న తన సోదరుని ముఖాన్ని అతడిప్పుడు స్పష్టంగా చూడగలిగాడు. వెల వెల పోతూ, క్షీణించి, పాలిపోయి, ముచ్చెమటలు పోసిన ఆముఖాన్ని చూశాడతడు. అతనికటిప్రదేశానికి క్రిందభాగంలో దుప్పటి, పక్కమీదపరచిన దుప్పటివలెనె ఉంది. ఆ దృశ్యాన్ని చూడలేక భయంతో కోర్ని చేతిని గట్టిగా పట్టుకున్నాడు మార్క్.

"అమ్మ క్షేమంగా ఉందా?" అని అడిగాడు నీరసంగా వున్నకంఠంతో తరాస్.

"క్షేమంగానే వుంది .... ..." అన్నాడు మెల్లగా మార్క్.

"పోనీలె, చల్లటి మాట చెప్పావు. మరి, నాన్న? నాన్న మళ్ళీయింటికి వచ్చేశాడు కదూ? ఉండు...బయటకు వెళ్ళి నా గుఱ్ఱాన్ని తీసుకువస్తాను, అంటూ స్మృహలేకుండా తనలో తనే యేదో గొణుక్కోవడం ప్రారంభించాడు.

మార్క్ ఆవిరులువచ్చే వేడినీళ్ళల్లో స్నానం చేశాడు. శుభ్రమైన బట్టల నిచ్చారు కట్టుకొనడానికి—తరాస్ బట్టలవి. కొన్నినాళ్ళకె తరాస్ పరలోక గతుడయ్యాడు. అతని కళేబరాన్ని ఆ ఆస్పత్రి ఆవరణలోనే సమాధి చేశారు.

కోర్ని గాయాలింకా బాగా మానకపోయినా, తరాస్ చనిపోయిన ఆ ఆస్పత్రిలో అతను యింక వుండలేక పోయ్యాడు. పాక్షిక ఆస్పత్రివదలి వెళ్ళరాదని వారిస్తున్నా వినక, నేను వెళ్ళితీరాలని పట్టు పట్టాడు కోర్ని.

తరాస్‌ను ఆస్పత్రి ఆవరణలో సమాధిలో వదలి వెళ్ళి పోతూన్న కోర్ని శోకోద్రేకంతో కంపిస్తూ అన్నాడు, "మరో సురోవ్ ప్రాణి యెగిరిపోయింది. మొదట నాన్న, తరువాత డెమిట్రి, ఆ తరవాత గ్రిగోరి, యిప్పుడు తరాస్. మిగిలినవాళ్ళు కూడా చావక మానరు. సురోవ్ కుటుంబం యీ విధంగా నాశనమై పోతోంది."

ఒక్క కన్నీటి బిందువు అతని చెంపమీద నుండి జారి క్రింద పడింది. "గాలివల్ల కళ్ళనీళ్ళు కమ్ముతున్నాయి" అంటూ ముఖం ప్రక్కకు త్రిప్పుకొని కళ్ళు తుడిచేసు కున్నాడు, మార్క చూసిపోతాడేమో నని.

సైనిక, ప్రధాన కార్యాలయంలో కమాండర్ కోర్నీకి, అతని చిన్నతమ్ముడు మార్క్‌కీ పెద్దవాగ్వాదం చెలరేగింది. నెస్టర్ మాఖ్నో అనె తెల్లకమాండర్ సోవియట్ ప్రభుత్వాన్ని యెదిరించి, కొన్ని వేలమంది బలంతో ఊళ్ళమీదపడి తుడిచి పెట్టేస్తున్నాడు. అతణ్ణి యెదిరించడానికి యీ పటాలం కదల బోతోంది. నెస్టర్ మాఖ్నోను హతమార్చి అతడి తాలూకు ఒక్క పురుగుకూడా లేకుండా నిశ్శేషం చెయ్యవలసిందిగా బుడెన్ని సైన్యానికి హుకుం అందింది. దాన్ని పురస్కరించు కుని, యెర్రసైన్యం తాలూకు అశ్వికదళం యుద్ధ సన్నద్ధం

కా బోతోంది మరొకసారి. ఆ సైన్యంతో కోర్ని పురోగమిస్తే యిక్కడమార్క్ పనేం కావాలి? స్వగ్రామానికి పంపివెయ్యడమా? అసంభవం - మళ్ళీ తిరుగుప్రయాణమంటే అది పరలోక ప్రయాణమే. కాని, అంతపసివాడు పటాలంవెంట, రణరంగంలో యెలా రాగలడు? అని తర్క వితర్కాలకు లోనయ్యాడు కోర్ని. ఇదికూడా ప్రమాదంతో కూడుకున్నదే కదా! ఐతే, వృద్ధులతోటి, బాలలతోటి వెనకకు వుండిపోవడం యిష్టం లేదు మార్క్ కి.

కోర్ని ఒక నిశ్చయానికి వచ్చేశాడు. తన ఉద్యోగస్థులలో ఒకరితో సుదీర్ఘమైన సమాలోచనలు జరిపిన పిమ్మట మార్క్ వైపు తిరిగి కోపంతో అన్నాడు కోర్ని, "నీకు యిక్కడ వుండడం యిష్టం లేదు కనక తిఖాన్ శిరోవిచ్ నాయకత్వం క్రిందనున్న రెండవదళంతో ఉండడానికి నీకు యేర్పాటు చేస్తున్నాను. ఒక వేళ నువ్వు ఆయన ఆజ్ఞలను పాలించని కారణంగా చిక్కులలో పడితేమాత్రం నాదగ్గరకు పరుగెత్తుకు రాకు. నేను నీకు అన్ననే అయినా, అధికారాన్ని బట్టీ ఉద్యోగధర్మాన్ని బట్టీ తగినశిక్ష పడేటట్టే చూస్తాను."

రెండు నెలలపాటు కోర్ని సైన్యం మాఖ్నో సైన్యాన్ని ఉక్రెయిన్ ప్రాంతంలో తరిమి తరిమి కొట్టినప్పటికీ ప్రతిఘటనకు తిరుగుబాటు నాయకుడు తటస్థపడలేదు. ఒకవంక 1920 శీతకాలపు చలి యెముకలను కొరికేస్తోంది. పటాలాలలో సగానికి పైగా — మనుష్యులేతేనేమి, గుర్రాలైతే నేమి — మంచుకు బలి అయిపోయారు.

ఎర్ర సైన్యంలోని అశ్వికులందరివలెనే మార్క్ కూడ సైనిక వేషాన్ని ధరించి, టైఖాన్ తనకిచ్చిన 'రావెన్' అనే గుర్రెన్నెక్కి రెండవదళంతో యుద్ధానికి బయలుదేరాడు. అతనంటె, యెంతో ఆదరాభిమానాలను గనబరుస్తూ "పెంపుడు బిడ్డగా చూసుకునేవారు శిపాయిలు. తానుకూడా ఒక యోధుడైపోయినట్లు మార్క్ గర్వంతో ఉబ్బి తబ్బిబ్బైపోయాడు. ఒకవేళ యుద్ధమేగనక అనివార్యమైతే మార్క్‌ని కూడా అశ్వికదళానికి చెందిన సేవకబృందంతో వెనక్కు పంపించివెయ్యవలసిందనీ, వారు, యుద్ధం ముగిసేవరకూ అతణ్ణి భద్రంగా చూస్తారనీ కోర్ని టైఖాన్‌శిడిరోవిచ్‌కి జనాంతికంగా సూచించాడు.

తలవని తలంపుగా శత్రువు పటాలంమీద దాడి జరిపినప్పుడు మార్క్ సిడిరొవిచ్‌కి చుట్టుప్రక్కల యెక్కడా లేడు. దళానికి ముందుభాగంలోనే కోర్నితో పురోగమిస్తున్నాడు. పోరు భీకరమైనప్పుడు మార్క్‌గుర్రం నేలకూలింది. మార్క్‌కు కాలిమీద దెబ్బ తగలడంచేత స్పృహతప్పి పడిపోయాడు. మళ్ళీ తెలివివచ్చి నలుప్రక్కలా కలయచూసేవరకు తానొక ఆస్పత్రిలో క్రిందపడుకొని వున్నట్లూ, చుట్టూ క్షతగాత్రులు మూలుగుతున్నట్లూ గ్రహించాడు.

చీకట్లు అలముకుంటున్నాయి. కలతబారిన మనస్సుతో, తన అవివేకానికి తన్నుదానే నిందించుకుంటూ మార్క్‌ను చూడడానికి ఆస్పత్రికి వచ్చాడు కోర్ని. అతని ముఖ కళవళికలను బట్టి మనస్సులో రేగుతున్న తుపాన్‌ను గ్రహించాడు మార్క్. తనకు తగినగాయం అంతప్రమాదమైన దేమీ కా

దన్నట్లు తేల్చేశాడు మార్క్. "ఏం భయం లేదు. టిఖాన్ సురోవిచ్ యెలావున్నాడు?" అని అడిగాడు అన్న కోర్నిని.

"ఆయన మరణించాడు" అన్నది కోర్ని ప్రక్కనే నిల్చునివున్న నర్స్.

టిఖాన్ శిడిరొవిచ్ మరణించాడన్న ఘోర వార్తను మార్క్ నమ్మకలేక పోయాడు. అతని కళ్ళలో నిండుతున్న నీళ్ళు కనురెప్పలు పొంగి సంతతధారగా ప్రవహింపసాగాయి. వాటిని తుడుచుకొనడానికైనా ప్రయత్నించలేదు మార్క్.

"ఏడవకు మార్క్" అని యెలాగో ఓ ధార్చాడు తమ్ముణ్ణి, మార్క్. అతడు పడే మానసిక సంక్షోభం ముఖంలో, అద్దంలో కన్పించినట్లు స్పష్టంగా కనిపిస్తోంది. "ఇక్కడి పరిస్థితి యింతే, యుద్ధంలో పనిచేసేవాడు యీక్షణం సజీవుడు, ఉత్తరక్షణంలో నిర్జీవుడు. మనలో ప్రతివారమూ మృత్యువును భుజాన వేసుకొనే పయనిస్తూంటాం.

మెల్లగా కోర్ని బయటకు వచ్చేసి చీకటిలో అదృశ్యుడై పోయాడు. యుద్ధరంగం అతనికోసం యెదురు చూస్తోంది.

ఆస్పత్రి జీవితం ధర్మమా అని మార్క్‌కు పెద్దవాళ్ళ సాంగత్యం లభ్యమైంది. ఆశ నాధారం చేసుకునే మనిషిజీవితం దొర్లిస్తూ వుంటా డన్న సామ్యం ఆస్పత్రిలో వున్నవారిపట్ల కూడా సార్థకమైంది. భావి జీవితంలో ఆశా సౌధాలను నిర్మించుకొని ఆనంద తరంగాలలో ఓలలాడడం పరిపాటైపోయింది; ప్రతివానికి తన భవితవ్యాన్ని గురించిన తపనే, సుఖ సంతోషాలు తనవైపు భవిష్యత్తులో నుండి తొంగిచూస్తూ సైగ చేస్తున్నట్లే ప్రతివాడు మురిసి పోయ్యేవాడు.

మార్క్ పడుకున్న గదిలో పధ్నాలుగురు క్షతగాత్రులు పడుకుని వున్నారు. వీరంతా బుడెన్నిసైన్యంలో వివిధ దళాలకు చెందిన సైనికులు, మాస్కోనుండి కమ్యూనిస్టు ప్రచారసాహిత్యం గుట్టలు గుట్టలుగా వచ్చి పడుతూండేది. కరపత్రాలు, చిన్న చిన్న ప్రచారిక గ్రంథాలు' చౌకరకం కాగితం మీద అచ్చువేసి సైన్యంలోని అన్ని యూనిట్లకు, ఆస్పత్రులకు సహా, పంపించేవారు. ఈ ఆస్పత్రిలో బాగా చదవ నేర్చిన వాడు మార్క్ ఒక్కడె, .కావడంచేత ప్రచురణల నన్నిటిని చదవవలసి వచ్చేది. చదవడమె కాదు, చదివిన దాన్ని బాగా ఆకళింపుచేసుకుని మిగతా వారికి విప్పి చెప్పే వాడు. ఈవిధంగా పదమూడేళ్ళ వయసులో మార్క్ కమ్యూనిస్టు ప్రచారకుడుగా తయారయ్యాడు.

తన చుట్టూ వున్న వారివలెనే తానూ ఆశా సౌధాలను నిర్మించుకొని తూగు టుయ్యాలలో పవళించి, కలలు కనడం నేర్చుకున్నాడు.—యుద్ధం ముగుస్తుంది; అప్పుడు మేమంతా యింటికి వెళ్ళిపోతాం; పెద్ద పెద్ద భవనా లెన్నో్న్నో— విశాలప్రాంగణాలు కలవి-మన కుంటాయి. అందచందా లుట్టిపడేటట్లు అలంకరించుకుని పెళ్ళికి తర్లి వెడతాం. పెళ్ళిచేసుకొని, జీవితంలో వుండే ఆనందాన్ని తనివితీర అనుభవిస్తాం. ఇలాగే భావి జీవితం పూలబాటమీద దొర్లిపోతుంది. . .మళ్ళీ తుపాకీ పట్టనక్కరలేదు ; రైలు స్టేషన్లలో పడిగాపులుపడి, వేలుగారుకుంటూ కూర్చోనక్కరలేదు ; యెవరెవ రెక్కడెక్కడికి వెళ్ళాలనుకున్నా అక్కడక్కడికి రెక్కలు కట్టు

కొని వ్రాలవచ్చు. ప్రతియింటికి తోట, దొడ్డి వుంటాయి; పాతదన్న ప్రతిదాన్ని నేలమట్టంచేసి నవ్యసంపదతో శోభిల్లు తుంటాం. ప్రజా ప్రభుత్వం పిల్లలకు తినుబండారాలను, ఆట బొమ్మలను విరివిరిగా పంచిపెడతారు ... ఇదంతా మార్క కంటున్న కల. ఈ కలలో కొన్ని సన్నివేశాలను తనకు ప్రత్యే కంగా కేటాయించుకొనే వాడు. తరవాత...వయసుమీరిన వాళ్ళు పిల్లలను కొట్టగూడదు; వారికి తినుబండారాలివ్వాలి; ఆటబొమ్మల నివ్వాలి అన్న అభిప్రాయంతో పెద్దవాళ్ళు యేకీ భవించరని అతని భయం. పిల్లలకు కావలసిన రెండేసి జేబుల లాగుజర్లు, బూట్లు మొదలైనవి ప్రతిబాలునికి యివ్వాలన్న సూచన పెద్దవారికి నచ్చదని అతని అనుమానం.

ఆస్పత్రిలో దెబ్బలుతిన్న రోగులదగ్గర, ప్రధాన ప్రచా రకుడుగా ఆ సాహిత్యాన్నంతా బిగ్గరగా చదవవలసి వచ్చేది మార్క. ఒకనాటి రాత్రి అనేవీవ్ అన్న సైనికుడు తనకు చదివి వినిపించమని మార్కను తనమంచం దగ్గరకు పిలిచాడు. అతడు అవసాన దశలో ఉన్న సంగతిని మార్క గ్రహించి, ప్రక్కనేవున్న దీపపుకాంతిలో చదవడం ప్రారంభించాడు. చదువుతూ, పుటలు త్రిప్పుతూవుంటె సైనికుడు కళ్ళుమూసు కుని వింటూండే వాడు; చదవడం ఆపుచెయ్యగానే, "ఆగి పొయ్యావేం? చదువు!" అనే వాడు.

"కమ్యూనిస్టు సమాజ ప్రధాన సూత్రం: ప్రతివ్యక్తి తన శక్తి సామర్థ్యాలను బట్టి పని చెయ్యాలి; ప్రతివ్యక్తికీ వుండే జీవితావసరాలు తీరాలి." అంటూ చదువుకు పోతు న్నాడు. "జీవితంలో యీ సూత్ర విజయానికి మనం యేం

త్రిక సహాయంతో మానవశక్తిని యెంతగా జోడించి సార్థకం చేస్తే ఉత్పత్తి అంతగా యినుమడిస్తుంది, కమ్యూనిజం ప్రకారం ప్రతికార్మికుడు రోజుకు ఒక గంట పని చేశాడంటే, అతడు ఉత్పత్తిచేసిన వస్తుసంపద వల్ల యెల్లరిలోటు తీరుతుంది. జీవితావసరాలు తీరే టంతగా కార్మికశక్తిని ఫలప్రదం చెయ్యాలి.

"చాలా బాగుంది" అన్నాడు అనీవ్. "రోజూ ఒక్క గంటే!" తా నెంత నీరసస్థితిలోవున్నా, ఒకప్పుడు తా నెంతగా వళ్ళువంచి పనిచెయ్యవలసి వచ్చేదో, జ్ఞాపకం వుంచుకున్నాడు. ప్రాణాలు నిలుపుకొనడానికి కార్మికుడుగా, రాత్రింబగళ్ళు ఉన్న శక్తినంతనూ ధారపోసి, యెలా పనిచేసేవాడో స్ఫురణకు తెచ్చుకున్నాడు.

చనిపోతూన్న వారికి తుది ఘడియలలో బైబిలు చదివి వినిపించడం ఆచారం. కాని, పాషండులైన విప్లవకారులు లెనిన్ అనే కొత్తదేవుణ్ణి ఒకణ్ణి కనుగొన్నారు. కారల్ మార్క్స్ వ్రాసిన "డాస్ కాపిటల్" అన్నగ్రంథం వారి బైబిల్. అమాయకప్రజల కీ బైబిల్ అంటె యెక్కడలేనినమ్మకమూను. మరణశయ్యమీద నున్న అనీవ్ తల దగ్గర యీ క్రొత్తబైబిల్ను పదేపదేచదువుతూ కూర్చున్నాడు మార్క్. తెల తెలవారుతూంటె ఆ రోగి పెద్దమూలుగు మూలిగాడు. అనీవ్ యిక యెంతోసేపు బ్రతుకడనీ, యేక్షణంలోనైనా యీ లోకాన్ని వదలిపెట్టవచ్చునీ గ్రహించాడు. ధైర్యం సడలిపోతున్నా, యెలాగో చిక్కబట్టుకొని మార్క్ తల యెత్తి చూచాడు. అనీవ్ రెప్పవాల్చకుండా తనవైపే తేరిపార

చూస్తున్నాడు. తననేదో అడగనున్నాడని ఒక్క క్షణం పొరపడ్డాడు కాని, మరుక్షణంలో అర్థమై పోయిం దతనికి అనీవ్ యీ లోకాన్ని వదలి పెట్టాడని.

కొన్నాళ్ళైన తరువాత, మాస్కోలోని సైనిక రాజకీయ శాఖకు చెందిన ఒక ఉన్నతోద్యోగి ప్రబోధకుడుగా ఆస్పత్రికి వచ్చాడు. అతని పేరు పెరెస్వెటావ్. బుడెన్ని పటాలంలో ఉన్న వారికి రాజకీయాలలో ప్రచార ప్రబోధాలను చెయ్యవలసిందిగా ఆయనను నియోగించారు. ఆయన ఆస్పత్రికి వచ్చిన కొన్ని నాళ్ళకే యెవరో చెప్పారు, మార్క్ అక్కడ ప్రచారం చేస్తున్నాడని. వెంటనే అతనికి కబురు చేశాడు పెరెస్వెటావ్, యేం ప్రబోధం చేస్తున్నాడో తెలుసుకుందామని.

మార్క్ ఆయనతో చెప్పాడు అంతవరకు తానే యే గ్రంథాలను చదివాడో; ఏ మేమి చదవదలచుకొన్నాడో; యే విధంగా సాయంసమయగోష్ఠులను నిర్వహిస్తున్నాడో; తాను ప్రబోధం చేస్తూంటె అనీవ్ యీ లోకాన్ని యెలా వదిలిపెట్టాడో

"నీకు భయం వెయ్యలేదా?" అని అడిగాడు పెరస్వెటావ్.

" వెయ్యకేం ? వణికిపోయాను భయంతో, కాని, యెలాగో తేరుకున్నాను.

పెరెస్వెటావ్, గదిలో యిటూ అటు పచారు చేస్తున్నాడు యేదో యోచిస్తూ ; తటాలున ఆగి, మార్క్ భుజం మీద చెయ్యివేసి, సాదరంగా అన్నాడు:

"మార్క్, పరీక్షణానికి సిద్ధంగావుండు. నువ్వు బాగ చదువుకోవాలి, నాయనా. మేము రాజకీయ విద్యాలయా న్నొకదాన్ని యేర్పాటు చెయ్యబోతున్నాం. అందులో చేరు దువు గాని. తరవాత ఆలోచిద్దాం నీ సంగతి. మీ తరంవాళ్ళే యీ ప్రపంచ భవిష్యత్తును తీర్చి దిద్దవలసినవారు. ఆ పని చెయ్యాలంటే బాగా శ్రద్ధగా చదువుకోవాలి."

మార్క్ పంపబడిన విద్యాలయం ఒక వింతవిద్యాలయం. అది స్థావరంగా ఒకచోట ఉండేది కాదు. నిరంతరం కదలుతూ వుండే సైన్యంతో కూడా యీ విద్యాలయం నడుస్తూ వుం టుంది. తుపాకులను వీపులకు తగిలించుకుని, పాఠ్యగ్రంధాలను జీనులకు బిగించి కట్టి, అధ్యాపకులు మంచుకు, చలికి గురి ఔతూ, స్టెప్పీల వాతావరణానికి లొంగిపోతూ దీర్ఘ ప్రయా ణాలచే డస్సి, సోలుతూ ఒకచోట నుండి మరొకచోటికి పయ నిస్తూ ఉండేవారు. సైన్యం యెక్కడైనా విడిసినప్పుడు, తమ తుపాకుల నన్నింటిని యెక్కడో ఒక పాకలో మూలగా జేర వేసి, పాఠ్యగ్రంధాలను బయటకు తీసేవారు; చదివేవారు; అధ్యాపకు లిచ్చే ఉపన్యాసలను శ్రద్ధాళువులై వినేవారు; చర్చించే వారు; కష్టపడి, ప్రభుత్వం యెదుర్కొంటున్న గడ్డు సమస్యలకు పరిష్కార మార్గం కనుగొనే వారు—పోనీ కను గొన్నామనుకునే వారు.

ఈ విధంగా రెండు సంవత్సరాలు గడపిన తరవాత పెరెస్వె టావ్ మాస్కోకు తిరిగి వచ్చాడు. విద్యాలయం మూసి వెయ్య బడింది. విద్యార్థులు యెవరి పటాలానికి వారు వెళ్ళి పోయారు. మార్క్ యిప్పుడు పదిహేను సంవత్సరాల యువ

కుడు. పొడగరి అయ్యాడు. విశాలమైన భుజస్కంధాలు; కాని, ముఖంమాత్రం ఆ పలచనిముఖమే. చిన్ననాటి, ఆవేదనా పూరితమైన ఆశా జ్యోతులె ఆనేత్రాలు.

మార్క తిరిగివచ్చేటప్పటికి కోర్ని పదివేల సైనిక నివహానికి (డివిజన్) అధిపతి అయ్యాడు. తనదగ్గరె, సైనికప్రధాన కార్యాలయంలో ఉండమని కోర్ని మార్కకు కబురు పంపాడు. కాని, మార్క యిష్టపడలేదు. పూర్వం తాను ఉన్న టువంటిదిన్నీ కోర్ని నాయకత్వం వహించినట్టిన్నీ రెండవపటాలంలో మళ్ళీచేరి తనమిత్రులతో ఉండిపోతా మనుకున్నాడు. ఆ రెజిమెంటుకు తానింకా పెంపుడు బిడ్డగానే చలామణీ అవుతున్నా దానికతడు రాజకీయ ప్రబోధకుడుగా కూడా పేరు పడ్డాడు. తాను ఆస్పత్రిలో గడించిన అనుభవాన్నీ, విద్యాలయంలో నేర్చిన విద్యనూ జోడించి సైనికులకు ప్రబోధం చేసే వాడు. తాము యే కమ్యూనిస్టు సమాజంకోసం యుద్ధం చేస్తున్నారో ఆ కమ్యూనిజం స్వరూపాన్ని వాళ్ళ ముందర చిత్రించే వాడు; వాళ్ళు వేసే ప్రశ్నలకు సమాధానాలు చెప్పే వాడు. సమాధాన పడకపోతే, చర్చించి వప్పించేవాడు

ఉత్తర కాకస ప్రాంతంలో బారక్స్‌లో విడిసి వుంది యిప్పుడు బుడెన్ని సైన్యం, సప్లైలు యిప్పుడు మునపటి కన్నా బాగానే అందుతున్నాయి, లోటనేది లేకుండా. కాని, యిప్పుడు అత్యవసరంగా కావలసింది రాజకీయ పరిజ్ఞానం; రాజకీయచైతన్యం; రాజకీయవిద్యా ప్రబోధం. దీని అవసరం యువక బృందంలో మరీ ప్రాముఖ్యం వహిస్తోంది. పూర్వపు

సాంప్రదాయాల నుండి నవీన పద్ధతులకు రాజకీయాలను మార్చడం, ప్రభుత్వాన్ని నిర్వహించడం అనుకున్నంత వేగంగా సాగడం లేదు. అదెలా సాధ్య పడగలదో దురూహ్యంగా వుంది కూడ. ఈ పరిస్థితిలో అటు సైన్యానికి గాని, యిటు ప్రజకుగాని తృప్తి అనేది కలగడం లేదు.

రాను రాను దేశం క్షీణిస్తూ వచ్చింది. రైతాంగం యెలాగో సూర్యాస్త మయాలను చూడ గలుగుతున్నారు. వర్షాభావంవల్ల అటు వాల్గా ప్రాంతలోను, యిటు ఉక్రెయిన్, ఉత్తర కాకసస్ ప్రాంతాలలోను పంటలు దెబ్బతిన్నాయి. ఈ దుర్భిక్షాన్ని వెంటాడింది జననష్టం. లక్షోపలక్షల మంది ప్రాణాలను గోల్పోయారు. కొన్ని ప్రాంతాలలో నరమాంస భక్షణ చేసి కూడా ప్రజలు మృగాలవలె జీవిస్తున్నట్టు వార్తలు అందుతుండేవి. విదేశాలనుండి, ముఖ్యంగా, అమెరికానుండి సహాయమె అందకపోతే యీ అరిష్టం మరీ విపరీతంగా పెచ్చు పెరిగి వుండేది. క్రొత్తగా అధికారంలోకి వచ్చిన సోవియట్ ప్రభుత్వం, యేమి చెయ్యాలో తెలియక గుటకలు మ్రింగుతూ కూర్చుంది. పైగా, పట్నవాసస్తులనూ నాగరికులనూ క్షుద్బాధ నుండి, ఆకలి చావులనుండి కాపాడడానికి పల్లెలలో దొరికే ప్రతివస్తువనూ, ఆస్తి పాస్తులను గుంజడం ప్రారంభించింది. అప్పుడప్పుడు ప్రభుత్వ తాబేదార్లు రైతుల మీద పడి, వారి కుటుంబపోషణకు చాలకపోయినా, అడిగినంతా యిచ్చి తీరాలని నిర్బంధం చేసేవారు. ఈ పరిస్థితులను గమనిస్తున్నకొద్దీ, అభ్యుదయభావాలతో యుద్ధం చేసే వారిలో కూడా భయ సందేహాలు రేకెత్తాయి. రష్యనులు ఆదినుండీ

అరాజకానికీ, ఆక్రందనాలకూ. కష్టపరంపరలకూ, దైన్యజీవితానికీ అలవాటు పడుతూ వచ్చినా కొందరు మాత్రం యీ దుఃఖమయ జీవితానికి అవధి అనేది లేదా? అని ప్రశించుకునే వారు. ఒక్కొక్కప్పుడు శిష్టాచార కమ్యూనిష్టులుకూడ, అసంతృప్తివల్ల, యెదుర్కొన డానికి సిద్ధపడే వారు.

చెదురుగా అక్కడక్కడ తలయెత్తుతున్నట్లు కనిపించినా, గాను రాను సాయుధుల తిరుగుబాటు క్రొత్త ప్రభుత్వానికి ప్రమాద హేతువే అయింది. కాకసస్ ఉత్తర ప్రాంతంలో ఎరుగుచున్న అల్లరులు మాస్కో ప్రభుత్వాన్ని బాగా కలవర పెట్ట సాగాయి. కాకసస్ పర్వతప్రాంతాలు తిరుగుబాటును జయప్రదంగా సాగించడానికి అనువైన ప్రదేశాలు అవడమే కాక అక్కడ నివసించే కోసక్కులు దృఢకాయులూ, ధైర్యశాలురూ, భండన భీములూకూడ. వాళ్ళు చిన్న చిన్నముఠాలుగా యేర్పడి, చిన్న, పెద్దగ్రామాలపై బడి సోవియట్ ప్రతినిధులను, యేజంట్లనూ నిర్దాక్షిణ్యంగా మట్టు బెట్టేవారు. అచిరకాలంలోనె ధాన్యం పంటకూ, పశుగణానికీ పుట్టినిల్లన దగిన విశాల భూభాగం ఒకటి సోవియట్ పరిపాలననుండి వేరు చేయ బడింది.

ఈ తిరుగుబాటు దారులను బల ప్రయోగంతో అణచి వెయ్యడానికి ఆదిలో ఒక ప్రయత్నం జరిగింది. కాని, యిది అసాధ్యం అని రుజువైనప్పుడు లెనిన్ పక్షాన, సోవియట్ ప్రభుత్వపక్షాన ఒక ప్రకటన చేశాడు. ఎవరైతే, ఆయుధ విసర్జనచేసి లొంగిపోతారో వారు తిరిగి యెవరి యిళ్ళకు వారు క్షేమంగా వెళ్ళిపో వచ్చుని ఆ ప్రకటన అనుమ తిస్తోంది.

ఈక్షమాపణ మార్క్ కు మరొక క్రొత్త పనిని కల్పించింది. క్షమాపణ ప్రకటింప బడగానే, దళవాయి మార్క్ కు ఒక బీదకోసక్ ఖుర్రవాని వేషం వేయించి గ్రామ గ్రామానికి పుత్రాలను తిరుగుబాటు దారులకు పంపాడు. మార్క్ ఆవుత్రాలను, యెక్కడెక్కడ తిరుగుబాటు నాయకులు సమావేశమౌతారని తాను భావించేవాడో ఆ భవనాల్లోకి, వాటిని గిరవాటేసేవాడు. తరచు తాను స్వయంగానె వారి యిండ్లకు వెళ్ళి యెర్రవాళ్ళు తనను యీ పుత్రాలు అందజెయ్యమన్నారని చెప్పి యిచ్చే వాడు. ఒకొక్కప్పుడు ఆ పుత్రాలను తీసుకుని విప్లవనాయకులు మార్క్ ను వెంటనె పోనిచ్చేవారు, కాని, సాధారణంగా అతణ్ణి ఆపి, అతనిద్వారానే తమ సమాధానాన్ని కూడా యెర్రవాళ్ళకు పంపేవారు.

అది చాలా కష్టంతోను, ప్రమాదంతోను కూడుకున్న పని, కాని, మార్క్ కు మాత్రం ఆనందంగానే వుండేది. శాంతిని మళ్ళీ నెలకొల్పడానికి తిరుగుబాటు దారులను మళ్ళీ కమ్యూనిజం వైపు ఆకర్షించడానికి యథాశక్తిగా తాను ఉపయోగపడుతున్నానని సంతృప్తి పడేవాడు. నిజానికి, అతని కృషి ఫలితంగా చాలమంది క్షమాపణ షరతుల నంగీకరించి, ఆయుధాలను విసర్జించి తమ తమ పొలాలలోకి పోయి యెప్పటివలే పనిపాటులు చూచుకునే వారు. కడపటి క్షమాపణ సందర్భంలో ఒస్టాప్ అనే కోసక్ యువకుడొకడు అందంగా వున్న కత్తినొక దాన్ని మార్క్ కు బహూకరించాడు. అప్పటినుంచీ, అతనికీ మార్క్ కు బాగా స్నేహం కుదిరింది, ఒస్టాప్ యిచ్చిన బహుమతికి తిరిగి తానేమైనా యిద్దామనుకున్నాడు.

కాని, అతని దగ్గరున్న యావదాస్తి 'గ్రావెన్' గుర్రం ఒక్కటే. ఇక దాన్ని ఇచ్చివెయ్యడానికి నిశ్చయించాడు మార్క్. ఇంత కాలంగా ఆ గుఱ్ఱాన్ని తన సోదరుణ్ణి ప్రేమించి నట్లుగా ప్రేమించాడు కాని, దళవాయి కూడా యిచ్చివెయ్యమనీ, అది ప్రాంతీయ తిరుగుబాటుదారు లందరికీ సౌహార్ద్ర చిహ్నంగా పరిగణింప బడుతుందనీ మొగమాట పెట్టడంచేత విధిలేక యీ త్యాగానికి సిద్ధ పడ్డాడు ఆయన సలహాను శిరసా వహించక తప్పిందికా దతనికి. ఐతే, రావెన్‌కు బదులుగా గుఱ్ఱాన్ని యిచ్చాడు ఓస్టాప్.

ఒకనాటి రాత్రి మార్క్‌కు తన అధికారుల నుండి ఆజ్ఞా పత్రం అందింది: అక్కడికి నూటపదిమైళ్ళ దూరంలో వున్న బుడెన్ని సేనానికి ఒక ముఖ్యమైన వార్తను ఇరవైనాలుగు గంటలలో అందజేయ్యమని ఆ ఆజ్ఞ. ఈ నూటపదిమైళ్ళ దూరం సరిమైనదైనా కాదు, ప్రయాణం చాల కష్టభూయిష్ట మైనది. నూటపది మైళ్ళు యిరవైనాలుగు గంటలలో నిర్గ మించాలన్నప్పుడు మార్క్‌కు రావెన్ లేని వెలితి కనిపించింది; ఎంతో విచారించాడు. పోనీ, టెలిఫోన్ ద్వారా వార్త పంపించడానికి తిరుగుబాటు దార్లు తీగెలు త్రెంచి, దాన్ని అసాధ్యం చేశారు. స్వయంగా వార్తలు చేరవెయ్యడం కన్న వేరు మార్గం లేదు.

"నువ్వు తప్ప యెవరు వెళ్ళినా లాభం లేదు, మార్క్" అన్నాడు కమాండర్. "నువ్వైతే బాణంలా రివ్వున వెళ్ళ గలవు. కొండల మీంచి, పర్వతాల మీంచి గుర్రం నిన్ను

అవలీలగా చేరవే స్తుంది. తిరుగుబాటు దాయలు బుడెన్నీకి బహూకరించిన గుర్రం మీద నువ్వు స్వారిచేసి వెళ్ళవచ్చు. అది మాంచి పుష్టిగల జంతువు కాబట్టి యీ దీర్ఘ ప్రయాణానికి తప్పకుండా తట్టుకుంటుంది. కాని, ఆయనకు దాన్ని నువ్వు వప్పగించే సమయానికి అది యెలా వుం టుందో భగవంతుడే వూహించాలి. ఐతే, దాన్ని యిదివరకే గ స్త్రీవాళ్ళతో పంపించేశాను. అందుచేత, నువ్వు మొదటి యిరవై మైళ్ళు నీ గుర్రంమీద వెళ్ళి అక్కడ గుర్రాన్నిమార్చుకో; నీ కోసం ఆగుర్రం సిద్ధంగా వుంటుంది.''

"నా రా వెవ్ ఉం టేనా!" అనుకున్నాడు మార్క్ ప్రయాణాన్ని సాగిస్తూ. ఒస్టాప్ యిచ్చిన గుర్రానికి తల పెద్ద, శరీరం చిన్న. అది వగరుస్తూంటె, మార్క్ చెవియొగ్గి వినేవాడు. ధాన్ని చూ స్తేనే అసహ్యాం వేసేది మార్క్‌కి. ఇది మాట దక్కి స్తుందనే నమ్మకం లే దనుకున్నాడు మార్క్. ఐతే, ఒక గంట ప్రయాణం చేశాక కూడా అది యధా ప్రకారంగా నే తాపీగా అడుగులు వేస్తూ సాగింట. కావా లన్నప్పుడు కొంచెం వడిగాను వడిచేది. ఉశ్వాస నిశ్వాసల క్రమంలో కూడా వడిదుడుకులు లేవు. దాంతో మార్క్ తన అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. నాల్గుగంటలు ప్రయాణం చేసిన మీదట మార్క్ గ స్త్రీవారిని కలును కున్నాడు. వారు బుడెన్నీకి బహూకరింప బడిన గుఱ్ఱాన్ని సిద్ధంచేసి, మార్క్ కోసం యెదురు చూ స్తున్నారు. చూడ ముచ్చటగా వుంది ఆ గుఱ్ఱం. సమున్నతంగాను, బలంగాను వున్న ఆ గుఱ్ఱం మీద నె మార్క్ మిగతా ప్రయాణాన్ని సాగించవలసి వుంది. ఈ

భద్రాశ్వం ప్రక్క ఆ చిన్న గుఱ్ఱం దిష్టి పిడతలా తయారైంది. అయినా యిరవై మైళ్ళు మార్క్‌ను మోసుకువచ్చి నప్పటికీ యే మాత్రం అలసటా కనపడకుండా నిశ్చలంగా ప్రశాంతంగా అలా నిలబడే వుంది ఆ చిన్ని గుఱ్ఱం. తన ప్రయాణానికి సిద్ధమై పోతూ దాన్ని విడచి వెళ్ళవలసి వచ్చినందుకు మార్క్ విచారించాడు. రావెన్ వలెనే యిదికూడా మార్క్ అభిమానానికి పాత్రమైంది. నేను రెండుగుఱ్ఱాలమీద స్వారి చేస్తానని ఉన్నట్టుండి నిశ్చయానికి వచ్చాడు మార్క్. తన రక్తనాళాల్లో ప్రవహిస్తున్న మంగోలియన్ రక్తం యీ నిశ్చయానికి దోహదం చేసివుండ వచ్చు. మంగోలియనులు దూర ప్రయాణాలు చేయవలసివచ్చి నప్పుడు రెండేసి, మూడేసి గుఱ్ఱాలను వెంట తీసుకు వెళ్ళుతూ మధ్య మధ్య మారుతూ ప్రయాణం చెయ్యడం అలవాటు.

గస్తీ కమాండరుకు మార్క్ యెలా వెళ్ళాడనే తాపత్రయం యెంతమాత్రం లేదు. అసలు వెళ్ళాడా? లేదా?... అంతే ఆయనకు కావలసింది. కొన్ని క్షణాలలో మార్క్, పెద్దగుఱ్ఱం యెక్కి ప్రొద్దుటి పొగమంచును చీల్చుకుంటూ ముందుకు సాగిపోతున్నాడు. నిడివైన త్రాటికి రెండవ చివర కట్టబడిన చిన్నగుఱ్ఱం వెనక పరుగెత్తుతోంది.

ఇంకా తొంభై మైళ్ళు స్వారి చెయ్యాలి; దారిలో యెన్నో యేరులు దాటాలి; పర్వతాలు యెక్కాలి; తిరుగుబాటు దారుల కన్ను గప్పాలి. ఇదంతా యిరవై గంటల వ్యవధిలో జరగాలి. కాని, మార్క్‌కు ధైర్యం వుంది, తను చెయ్యగల

నని, చేస్తాసని. అతగాడు తన రెండు గుఱ్ఱాలకు నామకరణం చేశాడు. పెద్దదానిపేరు 'యార్డ్' (గజం); చిన్నగుఱ్ఱంపేరు ఇంచ్ (అంగుళం). యార్డ్ పెద్ద పెద్ద అంగలు వేస్తూంటే, దాన్ని అందు కొనడానికి 'ఇంచ్' గాలప్ చెయ్యావలసివచ్చేది. యార్క్, తన వెనక గాలప్ చేస్తున్న చిన్నగుఱ్ఱం కేసి క్రీగంట నిరసనగా చూసేది. మార్క్ అద్రిగ్రహించి 'ఇంచ్'ని 'యార్డ్'ను బంధించిన త్రాటిని విప్పేశాడు. ఇంచ్, యార్డ్ ప్రక్కనే పరుగెత్తేది. దారి విశాలంగా లేక, రెండు గుఱ్ఱాలు ఒకదాని ప్రక్కన ఒకటి నడవడానికి వీలు లేనప్పుడు ఇంచ్ వెనకడుగు వేసి పరుగెత్తేది. కాని, యెప్పుడూ యార్డ్ వెన్నంటే వుండేది. ఇలా చెయ్యడం ఇంచ్‌కు యిదే, మొదలుకాదని తృప్తి పడ్డాడు మార్క్.

కొంతసేపటకి, మార్క్ ఇంచ్ మీదకు మారి యార్క్‌ను నడిపించేవాడు. మరి కొంతసేపు, తాను నేలమీద కురికి రెండూ చెరొక వైపునా పరుగెడుతూంటె వాటితో పాటు తానూ పరుగెత్తేవాడు. వాటికి విశ్రాంతి నివ్వడానికి మార్గం యిరుకుగాను దుర్గమంగాను ఉన్నచోట్ల ఇంచ్‌ను ముందుకుపోనిచ్చి, వెనక యార్డ్‌ను నడిపించేవాడు. యార్డ్ తోకపట్టుకుని, తాను వ్రేలాడే వాడు. ఇంచ్ ముందు నడవడానికి కారణం దానికి దారి బాగా తెలుసు.

సూర్యుడు పశ్చిమానికి ఒరిగే టప్పటికి వాళ్ళు చివరి పర్వత మార్గాన్ని దాటేశారు. ఇక దాటవలసింది స్టెప్పి బయలు ప్రదేశం. నలభై అయిదుమైళ్ళు పొడవున్న పర్వత మార్గాన్ని పదమూడు గంటలలో దాటగలిగేడు మార్క్.

ఇక ముందున్నదే హెచ్చుదూరం. వ్యవధి చూస్తే తక్కువ. అయినా, రెండుగంటల పాటు గుఱ్ఱాలకు విశ్రాంతినిచ్చి, దాణా పానీలు పెట్టి మార్క్ మళ్ళీ సాగించాడు ప్రయాణం, మైళ్ళు లెక్కించుకుంటూ.

యార్డ్ అలసిపోతుందని మార్క్ అనుకోలేదు. ఇంచ్ యథాప్రకారం నడక సాగిస్తూనే వుంది. ప్రయాణం సాగిన కొద్దీ మార్క్ ఇంచ్ మీదనె స్వారిచేస్తూ యార్డ్‌కు విశ్రాంతి నిస్తూ వచ్చాడు. పోను పోను అతని ప్రయాణం అంతా యించ్ మీదనే సాగింది. అర్ధరాత్రిపడేవరకు మార్క్ ఊరు చేరి మొదటి యింటి తలుపు తట్టాడు. యార్డ్ ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేని స్థితిలో పడింది. తలుపు తెరచుకొని బయటకు వచ్చిన వృద్ధునికి యార్డ్‌ను వప్పగించాడు మార్క్.

బుడెన్ని రైలులోనే వున్నాడని తెలుసుకున్నాడు మార్క్. ఆ రైలుకి మూడంటె మూడే పెట్టెలు వున్నాయి, పెద్దవి. ప్లాట్‌ఫారమూ, స్టేషనూ సైనికులతో టె కిట కిటలాడి పోతున్నాయి. వాళ్ళని తప్పించుకుంటూ దారి చేసుకుని మార్క్ గార్డ్ దగ్గరకు వెళ్ళాడు. తనపేరు, వచ్చినపని చెప్పిన తరవాత అతణ్ణి ఒకరైలు పెట్టెలోకి తీసుకు వెళ్ళారు. బుడెన్ని ఒకచిన్న పక్కబల్ల దగ్గర కూర్చుని వున్నాడు. కోటుకు బొత్తాములు పెట్టుకోకుండా అలా వదిలేసుకు కూర్చున్నాడు బుడెన్ని. మరొక బల్లదగ్గర ఒక యువతి ఆయనకు భోజనం వడ్డిస్తోంది.

మార్క్ తాను తెచ్చిన నివేదికను బుడెన్నికి అందజేసి నిలుచున్నాడు. బుడెన్ని నివేదికను ఆమూలాగ్రం చదివి ప్రక్కనే వున్న మరొక అధికారివైపు తిరిగి,

" ఈ చిన్నవాణ్ణి చూడు, క్లిమ్, మన కార్యాచరణ సైన్యం యిచ్చిన యీ నివేదికను తేవడానికి యిరవై మూడు గంటలలో నూటపది మైళ్ళు ప్రయాణం చేసి వచ్చాడు, అలసినట్లు కూడా కనుపించడు! " అన్నాడు

పొట్టిగా, దృఢంగా వున్న శరీరం, గుండ్రనిముఖం, విశాల మైన నేత్రాలు గల ఆ వ్యక్తి మార్క్‌ను సమీపించాడు. ఈయన వొరోషిలోవ్ అయి వుంటాడని వెంటనె గ్రహించాడు మార్క్.

వొరోషిలోవ్ కూడా చదివాడు నివేదికను. పిమ్మట మార్క్‌ను తేరి పార చూచి బుడెన్ని చెవిలో యేమేమో గొణిగాడు. బుడెన్ని కూడా మార్క్ వైపు తేరిపార చూశాడు.

" అయితే, నువ్వు డివిజనల్ కమాండర్ సురోవ్ చిన్న తమ్ముడివన్నమాట!" అని సాభిప్రాయంగా ప్రశ్నిస్తూ ప్రక్కనే వడ్డన చేస్తున్న తనభార్యవైపు తిరిగి "చూడు, వీడు కోర్ని తమ్ముడు."

ఆమె మార్క్‌ను సమీపించి, నిదానంగా కళ్ళల్లోకి చూస్తూ "అరే, ముమ్మూర్తులా, కోర్ని యే. అచ్చుగుద్దినట్లుగా వున్నాడు. ఇంతకూ, వీడికి ఆకలేస్తోంది కాబోలు, పాపము. వేడివేడి భోజనం పెట్టొద్దూ! అట్లాగే నిల్చోబెట్టి మాట్లాడేస్తున్నారు, మీరు?"

భోజనం తృప్తిగాచేసి, నిద్రలో మునిగిపోయాడు, మార్క్. మెలకువ వచ్చేటప్పటికి, రైలునడుస్తున్నట్లు గ్రహించాడు, మార్క్. ఇంతలోనె, అతనికి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది ఇంచ్ స్టేషన్లోవుండిపోయిందని, రైలుపెట్టె నసారా లోకి పరుగెత్తాడు. అక్కడవున్న ఒక యుద్యోగి యతని జోడు గుఱ్ఱాలకథను విని అదేపనిగా కడుపుచెక్కలయ్యేటట్లు నవ్వడం ప్రారంభించాడు. మార్క్ నిద్రపోతున్నప్పుడు, తనకు బహూకరింపబడిన గుఱ్ఱాన్ని చూడడానికి స్టేషన్ లోపలికి బుడెన్ని వెళ్ళాడనీ, అక్కడ మెలకవలెఉన్న ఇంచ్ని చూసి తన నెవరో యీవిధంగా పరాభవించడానికి చేసిన పనిగా భావించి ఆగ్రహించాడనీ ఆయుద్యోగియే కరువు పెట్టాడు.

గంటపోయిన తరువాత బుడెన్నివున్న పెట్టెలోకిరమ్మనమని మార్క్కు కబురువచ్చినది. ఈసారి బుడెన్ని, ఒరోషిలోవ్ మాత్రమె అక్కడవున్నారు. అప్పటికివారు రెండుగుఱ్ఱాలచరిత్రనూ పూర్తిగావిన్నారు. వెంటనే బుడెన్ని అన్నాడు:

"నాగుఱ్ఱాన్ని గురించి నువ్వేమి భయపడకు; ఆవృద్ధునివద్ద నుండి తీసుకుని దాన్ని నాకు పంపిస్తారు. కాని, నీతో ఒరిషిలోవ్ యేదో మాట్లాడుతాడట."

ఒరోషిలోవ్ యెంతో ఆసక్తితో మార్క్ ముఖంలోకి చూశాడు. తనులేచి, మార్క్భుజంమీద చెయ్యివేసి కూర్చో బెట్టాడు.

"ఈ పాటికి నువ్వు యుద్ధం చాలించడం మంచిది, మార్క్." అన్నాడు మార్క్కు యెదురుగా నిల్చుని. "అమూల్యమైన యీ ప్రాయంలో నువ్వు నిరంతరం విద్యా

వ్యాసంగంలో కాలం వెళ్ళ బుచ్చాలి. కాబట్టి, కామ్రేడ్, నిన్ను నిరాయుధుణ్ణి చేసి మాస్కోకు పంపుతున్నాం. అక్కడున్న ఒకరికి ఉత్తరం యిస్తాను. నువ్వు మాస్కో విశ్వ విద్యాలయంలో చదువుకోండువు గాని. నీకేమి కావలసినా నాకు కాని బుడెన్నికి కాని వ్రాస్తూ వుండు. తగిన సహాయం చేస్తాం.

"ఎదిరించి సాధించడమంటె యేమొ నీకు తెలుసును కాదు? సర్వే నువ్విప్పుడొక కంచుకోటను ఢీకొని సాధించాలి. అదె విజ్ఞానం. నువ్వు బుడెన్ని మనిషివి కనక నీ కసాధ్య మనేది లేదు. భయం అంతకన్నా లేదు."

అలాగే, వారం తిరిగి వచ్చే టప్పటికి మార్కొసురోవ్ మాస్కోకు వెళ్ళు తున్న రైల్లో ప్రయాణం చేస్తున్నాడు.



## చెదరినపేళ్ళు – పికిలిపిట్టలు

మాస్కోలో మరో ముగ్గురు స్నేహితులతో కలసి చదువుకుంటూ వుండే వాడు మార్క్. యూర, నియొనిడ్, అలెగ్జాండర్ అనే యీ ముగ్గురూ నివసించే నివాసమూ, తన నివాసము కూడా విశ్వ విద్యా లయానికి కొంచెం దూరంగానే వుండేవి. కొంతకాలం యూరా, మిగతా యిరువురికన్నా మార్క్‌కు సన్నిహితంగా వుండేవాడు.

ఆడపిల్లలలో లీనా ఒక్కర్తె మార్క్ హృదయాన్ని ఆకర్షించిన యువతి. అంతకు తప్పితే మరొక స్త్రీని అతడు ప్రేమించి వుండ లేదు. యూరా, లీనా లిరువురి ప్రేమ మార్క్‌ను మాస్కోలో వున్న కాలంలోనే కాక తరవాత కూడా వేధించి బాధించింది. వారి బాహ్యస్వరూపాలు, అందచందాలు—ముఖ్యంగా లీనా లావణ్యం–మార్క్‌ను ఆకర్షించినా వాళ్ళ భావాలంటె అతని కెంతమాత్రం నచ్చేవికావు. ఈ రెండు స్నేహాలు వైరుధ్య భావ ప్రకటనలతోటె మొలకెత్తాయి. అప్పుడే మార్క్ గ్రహించి వుండవలసింది, భిన్న భావాలు ఆట్టే కాలం పరస్పరా కర్షణను మననీయవని. కాని, తారుణ్యానికి రసపుష్టి. వైరుధ్య భావమే కదా! ఐతే, నిరాడంబర జానపద జీవితంలో పుట్టి, పెరిగి సైనికుడుగా మొరటు జీవితం అంతవరకూ సాగించిన మార్క్ మొదటిలోనే తమ స్నేహాలత గుంటపువ్వులు పూస్తోందని గుర్తించ లేక పోయ్యాడు.

యూరాతో మెప్పుడు వాగ్యుద్ధానికి దిగినా విషయం రాజకీయాలే. అప్పటిలో, ట్రాట్‌స్కీ, స్టాలిన్‌ల మధ్య పదవీ కాంక్షకు అధికార లాలనత్వానికి కీచులాట జరుగుతూ వుం డేది. లెనిన్ చనిపోయాడు; లెనిన్ అనంతరం పార్టీ ట్రాట్‌స్కీ-స్టాలిన్ లిరువురిలో మెవరిని వరిస్తుందన్న ప్రశ్న. స్టాలిన్ ట్రాస్కీల మధ్య అంతా వైరుధ్యమే—పుట్టుకలో, పెంపులో రాజకీయ పరిజ్ఞానంలో— విభిన్న పరిస్థితులలో తయారైనవాం వారిద్దరు. వారిరువురి దృక్పథాలలోను, విశ్వా సాలలోను కావలసినంత వ్యత్యాసం వుంది. వారివల్లనే కమ్యూ నిస్టుపార్టీ రెండుగా చీలిపోయింది. ఒక వైపున స్టాలినిస్టులు; వేరొకవైపున ట్రాట్‌స్కీయులు. ఈ ట్రాట్‌స్కీయులలో వారె యూరా,అతని స్నేహితులూను. ఏకక్షకు చెందక తటస్థంగా వుండిపోయారు కొందరు. ఆ తటస్థులలో వాడు మార్క్. ఇతనికిట్రాట్‌స్కీ, స్టాలిన్‌లకంటె కమ్యూనిస్టుపార్టీ ప్రధానం. దాన్ని ఆ రాధించడమె అతని ధ్యేయం.

"నీకు రాజకీయచైతన్యం కలిగించడానికి చేసె ప్రయత్న మంతా వృథా; నిష్ఫలం." అని కోపంగా ఉరిమేవాడు యూరా. "మెవరిపక్షం అవలంబిస్తున్నావో కూడా తెలు సుకోలేని పరిస్థితిలో వున్నావు నువ్వు."

"ఔను, ఉన్నాను" అని అదే స్థాయిలో సమాధానం యిచ్చాడు మార్క్. నేను పార్టీని, సోవియట్ ప్రభుత్వాన్ని సమర్థిస్తున్నాను. అర్థంలేని, స్వల్పవిషయాలపై కక్షలు, కావేషాలు, పెంచుకుని, వాదులాడుకుని పార్టీనే ఛిన్నాభిన్నం చెయ్యడం రాజకీయ చైతన్యానికి లక్షణంకాదు. మనం

కాంక్షించే దల్లా శ్రామికులు ఉత్తమజీవనాన్ని, స్వేచ్ఛా జీవనాన్ని అనుభవించడం. అదె మనకు ప్రధానం; దానికే మనం యింతగా యుద్ధం చేశాం; జీవితాలను నాశనం చేసుకున్నాం; మహత్తర త్యాగాలను చేశాం; ఆ ఆశయసిద్ధికే నాతండ్రీ, సోదరులూ జీవితాలను ధారపోశారు; నాకు కావలసింది ఆలక్ష్య సాధనె. ఆలక్ష్య సిద్ధికే నేనుచేసే కృషి అంతా. అయినా నేను నేనొక విద్యార్థిని. విద్యాభ్యాసమె నాలక్ష్యం. రాజకీయాలలో అనవసరజోక్యం కలిగించుకుని అమూల్యమైన కాలాన్ని వ్యర్థపుచ్చడం నా కిష్టం లేదు."

కాని,విద్యార్థులలో చాలమందికి రాజకీయాలలో పాల్గొనడమంటె యెంతో యిష్టం. ఒకనాడు యూరా, తన అనుయాయులతో ట్రాట్‌స్కీకి అనుకూలంగా బ్రహ్మాండమైన విద్యార్థి ప్రదర్శనాన్ని లేవదీశాడు. ట్రాట్‌స్కీ అనుయాయులలో ఒకడైన విషినిస్కీ యిటీవల విశ్వవిద్యాలయంలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించి వున్నందున యూరా నిర్భయంగా యీప్రదర్శనాన్ని యేర్పాటు చేశాడు.

కాని, యూరా పొరపడ్డాడు. ప్రదర్శన జరిగిననాడు చౌకులో ట్రాట్‌స్కీ సమక్షంలో నిలబడి గంభీరంగా ఉపన్యసించాడు. విషినిస్కీ పార్టీకి దేశానికి, ట్రాట్‌స్కీ ద్రోహి అన్నాడు. దాంతో ప్రదర్శనలో గందరగోళం బయలుదేరింది. ప్రదర్శన చెల్లాచెదరై పోయింది. ఆనాడు ట్రాట్‌స్కీయులకు తలయెత్తడానికి వీల్లేనంత పరాభవమూ, పరాజయమూ సంభవించాయి. విషినిస్కీ రెండు పక్షాల బలాబలాలను, తులతూచి, స్టాలిన్

పక్షం అవలంబించడమే క్షేమం అని నిశ్చయించుకోవడమె యీ పరిణామానికి కారణం.

యూరాతో సహా కొంతమంది విద్యార్థులను విశ్వవిద్యాలయంనుంచి బహిష్కరించి సైబీరియాకు పంపేశారు. తన ప్రాణమిత్రుణ్ణి యీ విధంగా యెడబాసి రావడం దుర్భరంగానే వున్నప్పటికీ రాజధానీ నగరంలో శాంతి భద్రతలు నెలకొనాలంటే ట్రాట్స్కీయులలో ప్రముఖులుగా యెన్నబడే వాళ్ళు నగరానికి దూరమై పోవాలని సమాధానపరచుకున్నాడు మార్క్.

యూరాతో వాదించేటప్పుడు తనకు రెండుపక్షాలు ఒకటేనని యెంత వాదించినా మార్క్‌కు స్టాలిన్ తత్వమంటె అభిమానం లేకపోలేదు. తనవలెనే స్టాలిన్ తత్వంకూడా దున్నేవారిదే భూమి అనడమె యిందుకు కారణం. తన చిన్ననాటి మొరటు జీవితానికీ, స్టాలిన్ తత్వానికీ సారూప్యం వుండడం వల్లనె కమ్యూనిస్టుపార్టీలో స్టాలిన్‌ను లీనంచేశాడు మార్క్. అలా చేసినందుకు తన ప్రాణస్నేహితుడైన యూరాకు క్షమాపణ చెప్పుకునేవాడు. స్టాలిన్ వ్యతిరేకి అయిన యూరాను ప్రాణస్నేహితునిగా ప్రేమిస్తున్నందుకు అతని వియోగానికి దుఃఖిస్తున్నందుకు స్టాలిన్‌కు క్షమాపణ చెప్పుకునేవాడు. ఈ సమర్థనలకు జోడించి తన భవిష్యత్తును రూపొందించుకునేవాడు మార్క్, ప్రవాహంలో కొట్టుకుపోయేవాడు, చివరకు, గడ్డిపోచ ఆధారంతో నైనా బ్రతకడానికి ప్రయత్నించినట్లు. భవిష్యత్ రాజకీయజీవితమనే మహాటవిని నరికేటప్పుడు. యూరావంటి కొన్ని వేళ్ళు చెదురుగా యెగిరి

దూరంగా పడిపోవడం సహజం. అలా జరగకుండా అడివిని నరకడం అనేది యెప్పుడూ సాధ్యం కాదు. యూరవంటి కొందరికి అన్యాయం జరిగినా, బాధకలిగినా చేసేదేమిలేదు. అదీ చివరకు అతనిలో స్థిరపడిపోయిన విశ్వాసం. ఒకుల నర్థంచేసుకోనడమంటె వారి భావాలను మన్నించడమన్నమాట. చరిత్ర మనలను అర్థం చేసుకుంటుందె కాని, పేళ్ళను చెదరగొట్టినిచ్చినందుకు గర్హించదు.

మార్క్సుకు లీనాతోవున్న సంబంధం కూడా అంతంత మాత్రంగానే వుంది. లీనాకూడా లోకానుభవంలేని, ఆవేశపూరిత. విప్లవకారులలో ఒకతె. పాతరాజకీయ వ్యవస్థే కాక, పాతదన్నది ప్రతీది క్రొత్తదానికి చోటిచ్చితీరవలసిందె అన్న వర్గానికి చెందినవ్యక్తి లీనా. లీనాకుకూడా యూరాకువలెనే యెన్నెన్నో భావాలున్నాయి. వాస్తవికజీవితంలో కాని, కనీసం, మార్క్స్ భావ ప్రపంచంలోకాని వాటికెక్కడా ఆస్కారం లేదు.

ఉదాహరణకు, ప్రేమకు సంబంధించిన ఆమె భావాలు:

"ప్రియమైన మార్క్స్" అంటుందామె. "నీకు తెలుసు కదూ, ప్రేమ అనేది యెక్కడలేదనీ, అలాంటిది వుండదనీ, అదంతా స్త్రీపురుషుల అవయవ సౌందర్యానికీ, భౌతిక ఆకర్షణకు సంబంధించినదనీ?"

"అది నువ్వెలా చెప్పగలవు?" అని అడిగాడు మార్క్స్ యిష్టం లేకపోయినా. "ఇదివరకు నీకేపురుషునితోనైనా సంబంధం వుందా?"

"ఇంతవరకు లేదు." అంటూంటె ఆమె ముఖం జేవురించింది. "కాని, అది సామాన్య విషయం అంటాను నేను. ఇక వివాహాంసంగతి." అని తొందర తొందరగా పూర్తి చెయ్యబోయింది. "పెళ్ళంటె యేమిటి? అదొక పెద్దమోసం. స్త్రీలను, పురుషులకూ, కుటుంబాలకూ బానిసలను చేయడానికి కనిపెట్టిన మాయోపాయం. స్త్రీనైన నేను పురుషుడవైన నీవలన ఆకర్షించబడినప్పుడు నీతో శయనిస్తేమాత్రం తప్పేముంది? దానికి నన్నేది అభ్యంతర పెట్టకూడదు."

దీన్నే "ఆధునిక నైతికవిధానం" అంటారు. ఆనాటి పెక్కుమంది రష్యన్‌యువకులకు అదె ఆచరణ యోగ్యమైన నైతిక విధానం.

మార్క్‌కు, తనతల్లి భర్తయెడ చూపించే భక్తి విశ్వాసాలు, పిల్లలయెడ చూపించే ప్రేమానురాగాలు, సంసారం అంటె తండ్రిచూపుచూ వచ్చిన అభిమానం యింకా స్పష్టంగా జ్ఞాపకం వుండడచేత లీనా ప్రసంగం, ఆమె భావాలు చాలా యేవగింపుగా తోచాయి మార్క్‌కు. అతడు లీనాను గాఢంగా ప్రేమించాడన్నవిషయం నిర్వివాదాంశం. సుదీర్ఘమై, దట్టమై ఆవరించిన ఆమె వినీల కుంతలాలూ, విశాలమై, ఉన్నతమై పొంగులువారే ఆమె వక్షస్థలం, ప్రపంచంలోకి సూటిగా చూసే తెల్లకలువ రేకుల్లాంటి ఆమె విశాలనేత్రాలు తన హృదయాధిదేవత దివ్యస్వరూపంగా భావించి, మనసార ప్రేమించేవాడు. కాని, ఆమె యెప్పుడు అతనితో సంభాషించినా ఆధునిక నైతిక విధానాన్ని గురించే ప్రస్తావించేది. అప్ర

స్థాపన వింటున్నంతసేపు తనలో ఒక మహత్తర రసానుభూతి యేదో యింకిపోయినట్లు అనిపించేది ; స్నిగ్ధప్రేమ మృగ్యమౌ తున్నట్లు బాధపడేవాడు. ఆమె తనను మనసా ప్రేమిస్తూంటె ఆధోరణిలో యెందుకు మాట్లాడుతుంద ? ప్రేమ అనే భావన లేకపోతే, ప్రేమించడం యెలా సంభవిస్తుంది? ఆమె యెవ రినీ ఆకర్షిస్తే వారితోనే శయనించడానికి సిద్ధపడితె, తన భార్యగా కాపరం చేస్తుందనే నమ్మకం యెక్కడుంది? ”

మార్క్ చే పరిత్యక్త అయినట్టు గ్రహించికూడా ఆమె తన నైతికసిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడానికి నిశ్చయించు కుంది. తన విశ్వవిద్యాలయ అధ్యాపకులలో ఒక కుమారుని మీద కన్నువేసింది. పాపం ! పూర్వకాలపు ప్రేమతత్వంలో యేదో మహాత్మ్యం వుండితీరాలి; ఆ ప్రేమ లేని స్త్రీపురుష సంబంధం యెంత బాధాకరం, యెంతదుర్భరం, యెంత హే యం, యెంతహృదయ విదారకం అన్న కఠోర సత్యం లీనా ఆత్మహత్యకు పాల్పడడం నిరూపణ చేసింది. పాపం ఉరి పెట్టుకుందామని ప్రయత్నించికూడ, కృతకృత్యురాలు కాలేక, కొన్నివారాల దాకా ఉన్మాదినిగా తయారైపోయింది.

ఇదంతా విన్న మార్కుకు కూడా, యించుమించుగా, మతిపోయింది. లీనాను ఆ స్థితికి తెచ్చిన యువకుణ్ణి గట్టిగా మర్దించి కొన ఊపిరితో వదలినా అతనికి చిత్తశాంతి కలగ లేదు. ఇక లీనాను ప్రేమించలేకపోయాడు; ప్రేమించకుండా ఉం డలేకనూ పోయాడు. కొన్ని నెలలపాటు ఒకరినొకరు కలు సుకో లేదు.

తాను మాస్కోలో అడుగుపెట్టి ఆరు సంవత్సరాలైన తిమ్మట మాస్కో నగరానికీ, లీనాకు వేలాదిమైళ్ళ దూరంగా— దూరప్రాచ్యంలో— ప్రత్యేక బాధ్యతలను నిర్వహించడానికి పంపబడుచున్నట్లు విని ఒక్కనిట్టూర్పు విడిచాడు మూర్కో.

"ఇది నీవు చాలగర్వించతగ్గ విషయం" అన్నాడు పార్టీ కేంద్రకమిటీసిబ్బందీశాఖ అధిపతి ఏషివ్. "కాని, చాలక్లిష్ట పరిస్థితిలలో పనిచెయ్య వలసి వుంటుంది."

"నా శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తాను". అన్నాడు మూర్కో ముక్తసరిగా.

"ఇక వాదించి ప్రయోజనం లే"దన్నాడు సోవియట్ దూరప్రాచ్యప్రాంతీయపార్టీకార్యదర్శి వావిలావ్. "జనాన్ని పెర్మస్కోకు తక్షణం పంపించి వెయ్యమని స్టాలిన్ ఉత్తరువులు. మొదటిజట్టు యేడువందలమంది వలసకునిన్ను పార్టీప్రతినిధిగా పంపదలచుకున్నాం, కామ్రేడ్ సురోవ్. నీకు తెలుసు యీరోజుల్లో అమూర్ నది చలికిగడ్డకట్టుకుపోతుందని. ఆగడ్డకట్టిన మంచుమీద నువ్వు 'స్లీ' బండ్లమీద, ట్రక్కులమీద ప్రయాణం చేసి పెర్మస్కో చేరవలసివుంటుంది. పెర్మస్కో అమూర్ నది ముఖద్వారంలో వుంది. మనం నిర్మించబోయే కొత్తపట్టణం యిక్కడే."

దూరప్రాచ్యంలో మూర్కోకు వప్పగించినపని యీకొత్త పట్టణ నిర్మాణానికి యేర్పాటు చెయ్యడం. ఇది దూరప్రాచ్యమైన ఖబరవస్కోకు కొన్ని వందలమైళ్ళ దూరంలో వుంది. తాను వచ్చిన తొలి యెనిమిదిమాసాలు యీ నగరంలోనే

గడిపాడు. కొత్తగా నిర్మింపబడనున్న పట్టణం, భారీయెత్తున యుద్ధసామగ్రిని, ఆయుధాలను, విమానాలను, బాంబరులను ఉత్పత్తి చెయ్యడానికి కీలకస్థానం కాబోతోంది.

ఈ పట్టణనిర్మాణ ప్రతిపాదనను మొదట ఊహించినవాడు వినగ్రిడోవ్. ఇతడు జార్ ప్రభుత్వంలో మిలటరీ యింజనీరుగా పనిచేసేనాడు. క్రొత్తగావచ్చిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేయబడ్డ కుట్రలో పాల్గొన్నాడనే నేరారోపణతో యీయనను చెరలో బెట్టారు, ఇతగాడు, పట్టణనిర్మాణానికి సంబంధించిన ప్లానులను తయారుచేశాడు. దూరప్రాచ్యంలో యీ పట్టణం యెందుకు నిర్మింపవలసివచ్చిందో రెండు కారణాలను ఉదహరించాడు వినగ్రిడోవ్. ఒకటి, యీ ప్రదేశం ముడియినుము విశేషంగా దొరికే ప్రాంతానికి గుండెకాయ వంటిది; రెండు, ఐరోపా దేశంలో యేశత్రు విమానాశ్రయాల నుండి బయలుదేరే యే బాపతు విమానాకీ అందని దూరంలోవుంది.

ఈ పథకాన్ని స్టాలిన్ ముందుపెట్టినప్పుడు ఆయన వినగ్రిడోవ్‌ను పిలిపించి అనేకప్రశ్న లడిగాడు. ప్రతి ప్రశ్నకూ సహేతుకమైన సమాధానం రావడంచేత పథకానికి ఆమోదాన్ని ప్రకటించాడు స్టాలిన్. ఈ నిర్మాణాన్నంతనూ స్వీయ పర్యవేక్షణక్రింద నడిపించడానికి వీలుగా వినగ్రిడోవ్‌ను వెంటనే చెరనుండి విడుదల చెయ్యవలసిందని ఆజ్ఞాపించాడు. తాను లేవబోతు కరచాలనానికి తనచేతిని ముందుకుచాచి స్టాలిన్ అన్నాడు;

"నువ్వు తయారుచేసిన పథకం చాలా బాగుంది వినగ్రిడోవ్ ; కాని, ఎస్టిమేట్లలో మాత్రం ఒక్క పొరపాటు దొర్లింది. దాన్ని సరిచెయ్యాలి"

"ఏమిటిది?"

"పట్టణమూ, యంత్రాలయాలూ కట్టడానికి యెనిమిది సంవత్సరాలు పడుతుం దన్నావు నువ్వు. కాని. ఆపని అంతా రెండు సంవత్సరాలలో పూర్తి కావాలి."

"అసంభవం."

"అసంభవం కాదు," అన్నాడు స్టాలిన్ దృఢవిశ్వాసంతో "మరొకింత పట్టుదల, త్యాగంచూపి, అవిశ్వాసాన్ని భయ సందేహాలను తగ్గించుటకంటె అసంభవంలా 'అ'హోతుంది.

వినగ్రడోవ్ ఖబ్రావస్క్‌కు వచ్చేటప్పటికి శీతకట్టు తిరిగింది. ఏ యేర్పాట్లు చేయబడకుండానే స్టాలిన్ దేశంలో ఉన్న యువకు లందరికీ ప్రకటనపూర్వకంగా పిలుపు నందచేశాడు. ఆమూర్ నదీముఖద్వారాన నిర్మింపబడనున్న పట్టణానికి దేశంలోని యువకులందరూ సిద్ధంకావాలి. ముందుకు రావాలి." అని పిల వగానే దేశం నలుమూలల నుండీ వాలంటీర్లు తండోపతం డాలుగా ఖబ్రావస్క్ ముఖం పట్టారు. వీరంతా ఖబ్రావస్క్ చేరుకునే టప్పటికి నిలవడానికి నీడకూడా వుండదనీ, ఆశ్ర యం దొరకదనీ, చలికి తట్టుకొనడానికి ఉన్నివస్తులు దొరక వనీ, ఆహార మలభ్యమనీ మాస్కోలోని స్టాలిన్, ఆయనసలహా దారులూ యెలా విస్మరించారు? ప్రథమంలో ఖబ్రివస్క్‌లో పరిస్థితు లేలా వుంటాయో ప్రభుత్వానికి తెలియకపోవచ్చు కాని, వినగ్రడోవ్, మార్క్ కూడా ఆ ప్రాంతానికి వెళ్ళి

అక్కడమంచు పడటం ప్రారంభమైందనీ, నివాస సౌకర్యా లెంతమాత్రం లేవనీ, ఆహార పానీయాలుకూడా లభ్యం కావడం లేదనీ, కాబట్టి వాలంటీరు ప్రవాహాన్ని, కనీసం, వసంత కాలం వరకైనా అరికట్టవలసిందనీ టెలిగ్రాములమీద టెలిగ్రాము లెన్ని కురిపించినా ప్రభుత్వానికి చీమ కుట్టకపోవ డం దేనికి? లేక, స్టాలిన్, అవిశ్వాసాన్ని భయసందేహాలను తగ్గించుకోవాలనడంలో అభిప్రాయం యిదె అయివుండదుకదా?

టెలిగ్రాములను పంపినా జనప్రవాహాన్ని అరికట్ట లేదు సరికదా "కష్టనష్టాలను లెక్కచెయ్యకుండా అంతవరకూ ఖబ్రావస్కలో నున్నవారి నందరిని వెంటనే పారిశ్రామిక నగర నిర్మాణస్థలమైన పెర్మస్కోకు తరలించ వలసిందిగా పట్టుపట్టాడు స్టాలిన్. కంసోమాలస్క్ పారిశ్రామిక నగ రంగా రూపొందవలసిన పెర్మోస్కాలో అప్పటికి డజను కొంపలైనా లేవు. ఈ కొంపలున్న నదిగట్టు మంచుక్రింద కప్పబడి వుంది. తలదాచుకొనడానికి అనువైన గోతులు త్రవ్వుకొనడానికి కూడా వీలులేనంత దట్టంగా కురిసిందిమంచు. తినడానికి స్థానికంగా తిండి యేమి లభించడంలేదు. రాకపోకల సౌకర్యాలు పూర్తిగా స్తంభించిపోవడం చేత, యంత్రపరి కరాలు, నిర్మాణసామగ్రి నిర్మాణస్థావరానికి చాలాకాలం వరకూ చేరే అవకాశం లేనందువల్లా వాలంటీర్లకు చెయ్య డానికి పని కనిపించడంలేదు. ఈ అనవసర త్యాగాలను. పనికి మాలిన బాధలను అరికట్టాలని మార్క్ యెంతకృషిచేసినా లాభం లేకపోయింది.

"యుక్తాయుక్తాలను విమర్శించడం అనవసరం, ఇవి స్టాలిన్ ఆజ్ఞలు." అన్నాడు వలిలావ్. దాంతో అన్ని వాదోప వాదాలు నిలచిపోయాయి.

ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయిన తరవాత పార్టీప్రధానకార్యాలయాన్ని వదలి వడివడిగా ముందుకు పోతున్నాడు మార్క్, నిర్జనంగా వున్న ఆ వీధి వెంట. పక్క వీధిలోకి మళ్ళి, పల్లంగా వున్న ఒక చిన్నయింటి కిటికీదగ్గర మూడుసార్లు తలుపు తట్టాడు. కిటికీలోంచి వెలుతురువస్తోంది. వెంటనే ఒకయువతి తలుపు తెరచింది. అతనిచేతినిపట్టుకుని చీకటిగావున్న హాల్లోంచి నడిపించుకుంటూ వెళ్ళింది. వీధికి ఆవలివైపున మంచుదిబ్బలా వున్న ఒక తెల్లనిస్వరూపం మనిషెత్తునా లేస్తూ పడుతూ వుంది. ఆ స్వరూపం ఒకమానవాకృతి; వంటినిండా తెల్లటి ఉన్నితో తయారుచేయబడ్డకోటునుకాబోలు ధరించివున్నాడు. ఇప్పుడావ్యక్తి వెలతురువచ్చే ఆకిటికీని నిటార్గానిల్చునిచూస్తున్నాడు. కొంతసేపటికి దీపపుకాంతి మాయమైన పిమ్మట ఆత డచ్చటనుండి వెడలిపోయాడు. తాను చూడ దలచుకున్న దంతా చూసేశాడు. ఇప్పుడిక తని నివేదిక నంపజెయ్యడమే తరవాయి.

ఆ చీకటి యింటిలో నుంచి రెండు మానవకంఠధ్వనులు వినిపిస్తున్నాయి

"ఓ పికిలిపిట్టా! నేనింతవర కెక్కడా నీవంటిసుందరాంగిని చూడలేదంటేనమ్ము." అంటూ ఆయువతిని తనకౌగిలిలోనికి తీసుకున్నాడు మార్క్.

ఒకప్పుడు, లీనా చాలా అందకత్తె అనుకున్నాడు మార్క్, అందులో పొరపాటేమీ లేదు. కాని, 'పికిలిపిట్ట' అని తాను ముద్దు ముద్దుగా పిల్చుకునే కాట్యాలో తనకంటికి పొడగట్టిన విశేషమేమిటి? లీనాలోకన్న కాట్యాలో ఎక్కువుంది ఘనత? బహుశః కొంత రష్యన్—కొంత జపనీస్ అయియుండడంవల్ల ఆమె స్వర్ణ కుంతలాలు, వాలుకన్నులూ ఆమె లావణ్యానికి వింత అందాన్ని చేకూర్చి ఉభయజాతుల సౌందర్యాన్నీ అక్కడ కుప్పవోసి వుండాలి.

ఆమె పేరు కాట్యా. మార్క్ ఆమెను 'పికిలిపిట్ట' అని ముద్దు పేరు పెట్టుకున్నాడు. దానికి మరొక కారణంకూడా వుంది. అతడు ఆమెను తొలిసారిగా కలుసుకున్నప్పుడు పికిలిపిట్ట ఆకారంలో మిలమిల మెరసిపోయే నీలపు బ్రోచ్ నొకదాన్ని ఆమె ధరించివుంది. దాన్ని చూచి మార్క్ సాంకేతికంగా ఆపేరుతో పిలవనారంభించాడు. శుభాన్ని అదృష్టాన్ని సూచించే పిట్ట అని కూడా అతడు చమత్కరించాడు; కాని, తన పికిలిపిట్ట మహాదురదృష్టవంతురాలన్న సంగతి, పాపం, అతనికి తెలియదు. పికిలిపిట్ట పంజరంలో చిక్కుకున్నదనీ అందులోనుండి బయటపడడం అంత సులభం కాదనీ అతనెరుగడు.

కాట్యా తండ్రి శ్వేతరష్యన్ సంజాతుడు. ఉక్రెయిన్‌లో జనరల్ ప్రొకొవిస్కీ సైన్యాలు ఓడింపబడిన తరువాత చైనీస్ మంచూరియాతీరాన వున్న హర్బిన్‌కు పారిపోయాడు. అక్కడ ఒక జపాన్ స్త్రీని పెళ్ళాడి చాలాకాలం జీవితం సాగించాడు. వారిరువురికి కలిగిన సంతానమె కాట్యా. కాని, కాట్యాకు పద్నాలుగోయేట కాట్యా తల్లి చనిపోయింది. ఇక

ఒంటరిగా యిక్కడవుండలేక స్వదేశానికి పోవాలనుకున్నాడు. ఈకోరిక ప్రబలమైనకొద్దీ, స్వదేశానికి పోతే యేర్పడే లాభ నష్టాలనుకూడా సమీక్షింప మొదలుపెట్టాడు. ఇంత కాలం అయినపిమ్మట తన నెవ్వరూ ఆనమాలు పట్టరనే అతడు రూఢి పరచుకున్నాడు. ఒకవేళపట్టినా, తన వెనకటి విప్లవ నిరోధక చర్యలను విస్మరించి, లేదా మన్నించి, క్షమించితీరుతారని భావించాడు. కాని, అతని వివేకం అతణ్ణి మోసగించింది. యోచనావటిమ అడుగంటింది. చివరకు, ఆయన దేశంలో అడుగు పెట్టిన వెంటనే గుర్తింప బడడమూ క్షమింప బడక పోవడమూ కూడా జరిగిపోయాయి.

కాట్యా తమ గూఢచారిగా వ్యవహరించడాని కంగీకరించి నంత కాలం, ఆమె తండ్రి స్వేచ్ఛకేమీ లోపం రాదన్నారు, పోలీసు వారు. అటువంటిపనికి కావలసిన యోగ్యతలన్నీ ఆమె కడవున్నాయి. చక్కదనం, నడవడిక, రష్యన్ చైనీస్, జపాన్ భాషలతో ఆమెకున్న పరిచయం, గూఢచారి ఉద్యోగానికి సరిగ్గా సరిపోయాయి. రహస్యపరిశోధక శాఖవారు ఆమెను యెలాగో మొదట జపాన్ రాయబార కార్యాలయంలో ఉద్యోగిగా దూర్చారు. తరవాత ఆఫీసు శ్రకటరీగా కుదిరింది. చిత్తు కాగితాల బుట్టలను వెదకుతూ, చెవులూ, కండ్లూ యెప్పటి అవసరాన్ని బట్టి, అప్పుడుపయోగిస్తూ అమూల్యవిషయాలను సేకరిస్తూవుండేది. రహస్యపత్రాలకు ఫోటోలను తీయడం కూడా ఆమె యిటీవల నేర్చుకుంది. తాను కూడని పనిని చేస్తున్నా ననే కించపడేదే కాని, అదెంత ప్రమాదకరమైనదో మాత్రం

గ్రహించలేదు. ఒకనాడు గాయబార కార్యాలయానికి జపనీస్ యువకుడొకడువచ్చాడు. కాట్యాను చూడగానే అతని మనస్సు ఆమెపై లగ్నమైంది. తనతండ్రి చెరసాల పాలు కాకుండా వుండాలంటే ఆజపనీస్ యువకుని కోర్కెల నామె మన్నించి తీరాలని కాట్యామీద ఒత్తిడి తెచ్చాడు. అది తొలిసారిగా మార్క్ కాట్యాను కలుసుకున్నప్పుడు జరిగిన సంఘటన.

ఆమె తన దీనచరిత్రను మార్క్ కు వినిపించినప్పుడు అదొక స్వల్పవిషయమన్నట్టు తేల్చేశాడు. తాను కాట్యాను పెళ్ళి చేసుకోబోతున్నానని అపరాధపరిశోధక శాఖవారితో చెప్ప గానే కాట్యాకు విమోచనం తథ్యమని పొరపడ్డాడు. కాని వారి ప్రత్యుత్తరం అతణ్ణి చకితుణ్ణిచేసింది. వీల్లేదన్నారు.

" 'కాట్యాఅంటినా'తో మీకున్న సంబంధం మాకు పూర్తిగా తెలుసు, ఆమె మా ఆజ్ఞలను పాటిస్తున్నంతవరకు మీ వ్యవహారాల్లో మేమెంతమాత్రం జోక్యం కలిగించుకోనం. ఆమె సహాయాన్ని యిప్పుడు మేము వదలుకోనడం కుదరదు. ప్రతిఘటించమని మీరామె నేమైనా ప్రోత్సహిస్తే మీరుచిక్కుల పాలౌతారు......తరవాత ఆమె తండ్రి...

మార్క్ కు యింకా ఆశ ఉడగలేదు. మరొక పందెం వెయ్యాలనుకున్నాడు, అంటే;పై వారికి అప్పీలు చేసుకోనడం మాస్కోల్లో సురోవ్ అంటె మంచిపలుకుబడి, గౌరవం ఉన్నాయి. ఆపలుకుబడినీ, గౌరవాన్ని యిప్పుడు వినియోగించదలచాడు మార్క్. కాని, దానికి వ్యవధికావాలి. వెం

టనే తేలా వ్యవహారం కాదది. ఇక్కడ చూస్తే పరిస్థితి మించి పోతోంది— —తక్షణం అతడు పెర్మాస్కోకు వెళ్ళితీరాలి. కన కనే, ఆ రాత్రి హృదయభారంతో, తన పికిలి పిట్ట దగ్గర శలవు తీసుకొనడానికి వచ్చాడు. మార్క్ మన్నాడు ఉదయం విడ లేక విడలేక పిడిచిపొయ్యాడు. తానెంత కాలందూరస్థుడై ఉండి పోవలసివస్తుందో గ్రహించలేని స్థితిలో వున్నాడు, మార్క్. ఆమె పరిస్థితిచూస్తే దుర్భరంగాను ప్రమాద భరితంగాను వుంది. తాను తిరిగి వచ్చేలోపున యేమికానున్నదో యెవరికి తెలుసు?

మార్క్ తన పనిమీద బయలుదేరినప్పట్నుంచి మరొకపని చూడడానికి గాని, ఆలోచించడానికిగాని తీరిక లేకుండా పోయింది. ఏడువందలమంది యువకులను సూర్యరశ్మి జొర నటువంటివీన్నీ యిదివరకెన్నడూ నరసంచారము నెరగనటువం టివీన్నీ, మంచుచే ఆవరింపబడినటువంటివీన్నీ దుర్గమారణ్యాలను జొచ్చి మంచుపేరుకుపోయిన అమూర్ నదిమీద ప్రయాణం చేసి, సురక్షితంగా పెర్మాస్కోకు చేర్చవలసివుంది. మార్గ మధ్యంలో యెక్కడాకూడా విశ్రమించ డానికైనా వీలులేనం తగా చలి యెముకలను కొరికివేస్తోంది; భోజనానికి, కార్లలో పెట్రోలు పోసుకొనడానికి తప్పితే, యెక్కడా ఆగకుండా పద కొండు పగళ్ళూ పదకొండు రాత్రుళ్ళూ ప్రయాణం సాగుతూ నేవుంది.

తరవాత యెన్నో సంవత్సరాలు యీసంఘటన నొకపాడు కలగా తలచుకొనేవాడు. తరచు కార్లయంత్రాలు పనిచెయ్యా డం మానివేసవి. వాటిని బాగుచేదామని యాత్రికులు ప్రయ

త్నించేవరకు వాటి లోహపు సామగ్రి, అత్యధిక శీతలం చేత వ్రేళ్ళపైనున్న చర్మాన్ని కాల్చేసేవి; అప్పుడప్పుడు హిమ శిలలు కరగి ప్రమాదములు సంభవించేవి కూడ. రెండు ట్రక్కు లావిధంగా ప్రమాదానికి లోనుకావడంచేత నలుగురు ప్రాణా లను సైతం గోల్పోయారు. ఆ కాళరాత్రులలో, కార్ల కమ ర్చబడివున్న అతిశక్తివంతమైన 'హెడ్ లాంప్స్' కూడా మంచు కురుస్తూండడంవల్ల మసకమసకగా కనపడేవి. నిరవధికంగా కదలిపోయే ట్రక్కుల కుదుపువల్లా, యింజన్ల హోరువల్లా, చోటు కుశలతవల్లా నిద్ర కనుచూపు మేరలో కూడ లేకుండా పోయింది; నది ఒడ్డుననున్న చెట్లు ఒకొక్కటి వెనకకు వెడు తున్నట్లు వినువుగొల్పేవి; వీటన్నిటిని మించిన భయం కొత్త చోటికి ప్రయాణం చెయ్యడం; పెర్మస్కోకు వెళ్ళిన తరువాత అక్కడ యెదుర్కొనవలసిన కష్టాలు; ఇవన్నీ కలసి, యేడు వందలమందిని నిస్పృహకులోను చేశాయి. వాళ్ళందరికి ధైర్యం చెప్పి, ఉత్సాహాన్ని రేకెత్తించాలనీ, ముందుకు నడిపించా లనీ మార్క్ ప్రయత్నించాడుకాని వాళ్ళుస్థాణువుల్లా ట్రక్కు లలో కూర్చుండి పోయేవారేకాని కదలేవారు కారు.

నాల్గవరోజున చిన్న సంఘటన జరిగింది. ఒక యువకుడు ట్రక్కులోనుండి క్రిందపడి అక్కడనున్న అడవిలోనికి పరుగు తీశాడు. ఇదిచూచిన మార్క్ కు ఒక చక్కని ఊహ తట్టింది. అతిగంభీరంగా కాగితాన్నొకదాన్ని తీసుకొని (దానిపై యేమి వ్రాసిలేదు) చదవడం ప్రారంభించాడు. స్పెషల్ ఫర్ యీా స్టరన్ ఆర్మీ కమాండర్-ఇన్-ఛీఫ్ యీ యాత్రను మిలిటరి

ప్రయాణంగా ప్రకటించారనీ కాబట్టి యువక కమ్యూనిస్టు లందరూ తాము సైనికులమని భావించి ఆయాజ్ఞలను పాటించవలెననీ మార్క్ చదివాడు. అటు తరవాత, యీ నెపంతో వాళ్ళను ప్రతిరోజు గంటలకొద్ది నడిపించేవాడు, లేదా పరిగెత్తించేవాడు; నది వొడ్డున శత్రుసైన్యాలున్నట్లుగా భావించుకుని కల్పితమైన దాడులను జరిపేవాడు; పాటలు పాడించేవాడు; ఉత్సాహంగాను, చైతన్యవంతంగాను ఉంచేందుకు అతను విశ్వప్రయత్నం చేసేవాడు.

చివరకు యెలాగైతేనేమి కొందరు దార్లో చనిపోయినా, మిగతా వారిని పెర్మసోక్కు చేర్చాడు.

ఇప్పుడన్నిటికన్నా పెద్దసమస్య అతణ్ణి యెదుర్కొన్నది, పశువుల మందికి మంచుతో కప్పబడివున్న ఆఅడవిలో తినడానికి తిండి, నిలవడానికి వసతి, కల్పించవలసివుంది. అసలు గడ్డు శీతాకాలం అంతా యింకా ముందేవుంది.

మంచుతో రాయిగా మారిపోయిన నేల, త్రవ్వడానికి తొక్కడా లొంగలేదు. అందుచేత, ఆమంచును కరగించడానికి పెద్దపెద్ద నెగళ్ళను అంటించమన్నాడు మార్క్. అంగుళం అంగుళం చొప్పున మంచును దొలిచి, గోతులను చేసి, ఒక్కొక్క గోతిలో నలుగు రేసి అయిదుగు రేసి చొప్పున అందరికీ ఆశ్రయాన్ని కలిగించారు. ఆ గోతులమీద. పొరలు పొరలుగా చెట్లకొమ్మలను పేర్చి వాటిమీదమన్ను పోసి మనిషి శరీరానికి సరిపడినంతదారిని మాత్రం ప్రతిగోతికి అట్టేబెట్టుకున్నారు. ప్రతిగోతి అట్టడుగు భాగాన్ని నెగడు వేసారు.

ఐతే, దీనివల్ల వేడితో పాటు పొగకూడా బయలు దేరింది. వేడికి గోతిగోడలు కరిగి బొట్లుబొట్లుగా నీళ్ళు రాలుతూండడంవల్ల తేమ యేర్పడింది. తేమ, పొగ, వేడి—మూడు ఒకదాన్ని ఒకటి విడవకుండా యెప్పుడూ బాధిస్తూండేవి. వీటిని సహించి "సమాధు"ల్లావున్న యీగోతుల్లోనే తలదాచుకోనడానికి చాల గుండెనిబ్బరంకావలసి వచ్చేది. ఈగోతుల్లో నివసించే వారు తరచు ఆరుబయటకు వస్తూ, చలి మళ్ళీ లోపలకు తరిమే వరకూ, తమ దురదృష్టానికి విలపిస్తూ, కళ్ళ వెంట కారేనీళ్ళను తుడుచుకుంటూ కూర్చునేవారు.

"మమ్మల్ని యిక్కడికెందుకు తీసుకువచ్చారు?" అని మార్క్‌ను పదేపదే నిలదీసి అడిగేవారు; "నూకలు చెల్లిపో బట్టే మేము మీ పాలబడ్డాం".

"ఆ సంగతి నాకూ తెలుసు. కాని, మిమ్మల్ని మోసం చెయ్యడం నా ఉద్దేశ్యంకాదు; ఉన్న శీతకాలమంతా ముందేవుంది; మనం ఓర్పు వహించక చేసేదేమిలేదు. కామ్రేడ్ స్టాలిన్ మిమ్మల్ని యిక్కడికేగదా ఆహ్వానించాడు...ఇది ఆయన ఆజ్ఞ దాన్ని మనం పాలించాం......ఇప్పుడు మనం ప్రాణాలకోసం పోరాడాలి..... పరస్పరం ఆదుకోవాలి."

తాము వెంట తెచ్చుకొన్న సామగ్రి చాలవరకై పోయింది. ఇప్పుడు తిండిసమస్యకూడా యేర్పడింది. కూడా తెచ్చుకున్న ఆహారంలో మిగిలినదల్లా అంబలి ఒక్కటె. దానికితోడు, పుష్టి కలిగించే ఆధరవు మరొక పదార్థమేదిలేదు. ప్రొద్దున్న, మధ్యా

హ్నం, రాత్రి—యెప్పుడుచూసినా అంబలితప్ప మరొకటిలేదు క్షుద్బాధ తీర్చుకోవడానికి.

ఎక్కడినుండి అయినా మాంసాహారం సేకరిస్తేకాని లాభం లేదనుకున్నాడు మార్క్. కమ్యూనిష్టు యువకులలో వేట చేతనైనవాడొక్కడూ లేడు. ఎటొచ్చీ, అడవిలో గుళ్ళుకట్టుకొని కాపురంవుంటున్న "నైసిట్స్" ఆటవికులను, యెలాగో మంచి చేసుకొని యెలుగుబంట్లను, జింకలను వేటాడించి వాటి మాంసాన్ని ఆహారంగా ఉపయోగించడమొక్కటే మార్గం. ఐతే, యీ ఆటవికులు, అడవి మొత్తంమీద, చెదరుగా అక్కడక్కడ నివసిస్తూండడంచేత వారిని కలుసుకోవటం అంత సులభసాధ్యం కాకపోయింది. కలుసుకున్నా, వారుజంతువుల నెప్పుడుపడితే అప్పుడు వేటాడరు. తమకు అవసరం పడినప్పుడే వేటాడతారు.

ఎవరైనా అడవిలోనికి వెళ్ళి 'నైసిట్స్' ఆటవికులను కలుసుకుని దేశంకోసం వారి వేటకౌశల్యాన్ని ప్రదర్శించవలసిందిగా అభ్యర్థించాలి. దాన్ని చెయ్యదలచుకున్నాడు మార్క్. జీవితమంతా అక్కడే గడుపుతోన్న ఒక వృద్ధుని సహాయంతో అతడు 'స్కీస్' మీద ప్రయాణం సాగించాడు. మొదటి వారంలో అతడు చేసిన కృషిఫలించడంచేత, తాను అడవిలోనే వుండిపోయి జంతు అన్వేషణ జరపాలనుకున్నాడు.

ఇట్టి కఠోరనిర్ణయాన్ని మార్క్ యిదివరకెన్నడూ చేసుకొని యెరుగడు. వాలంటీర్లు కొంచెం స్థిరపడగానే ఖబ్రావస్క్‌కు తిరిగి రావలసిందిగా మార్క్‌కు ఆదేశం అందింది.

'కాట్యా' భవితవ్యమూ, తమ కిరువురి మధ్యానున్న అనురాగ భవితవ్యమూ తాను కాలహరణం చెయ్యకుండా వెళ్ళడం మీద ఆధారపడి వుండడంచేత, యీ ఆజ్ఞలను శిరసావహించి పెర్మస్కోను వదలివెళ్ళినా అతణ్ణి నిందించేవా రుండరు. ఐతే, యేడువందలమంది యువక వాలంటీర్ల మాట ! వారి గతేం కాను ! తన కాట్యా తనకు దూరమైనా, ఆజ్ఞలను శిరసా వహించని అవిధేయతకు పార్టీ ఆంక్ష పెట్టినా సహించవచ్చు నేమో కాని, తనపై ఆధారపడిన యేడువందల నిండు ప్రాణాలను మృత్యుముఖానికి వప్పగించి తనదారి తాను చూచుకొనడానికి మార్క్ అంతరాత్మ అంగీకరిస్తుందా ! ఏదో విధంగా శీతకాలం గడచేవరకూ వారి ప్రాణాలను నిలబెట్టి వారి విశ్వాసం చలించకుండా చూడడం తనకర్తవ్యం అనుకున్నాడు, మార్క్.

ఈ విధంగా మార్క్ వారాల తరబడిని, అరణ్యమంతా గాలిస్తూ వచ్చాడు వన్యమృగాలకోసం. తనకు తోడు ఆముసలి ఆటవికు డొక్కడే. అప్పుడప్పుడు నైనిట్జ్ ఆటవికులెవరైనా కలిస్తే కాలక్షేపానికి పిచ్చాపాటి మాట్లాడేవాడు. ఒకముఠాని పెర్మస్కోకు, ఆహారం తీసుకువెళ్ళమని పంపి, తాను మరో చోటికి మృగయాన్వేషణకు బయలుదేరేవాడు. ఈ విధంగా నదీ తీరానికి చాలదూరంగా 'స్కీస్' మీదనే అతగాడు ప్రయాణం చేయవలసివచ్చేది. నెలల తరబడి చేస్తున్న యీ సంచారంలో బట్టలు ఉతుక్కోడానికి కూడా అవకాశం ఉండేది కాదు. మంచు తుపానుగాలులు వీస్తూండడంచేత, బయటకు రావడంకూడా అసాధ్యం అయినప్పుడు తన

డేరాలో వెల్లకిల పడుకుని యేదో ఆలోచిస్తూనో, కలలు కం టూనో వుండే వాడు.

చివరకు మంచుకరగడం ప్రారంభమైంది. చెట్ల కొమ్మల మీాదనున్న ఆకులు బయట పడ్డాయి. కష్టభూయిష్టమైన శీత కాలం గడచి పోయింది. వసంతోదయమైంది. సైమూర్ నది మీాద రాకపోకలు యథాప్రకారంగా సాగుతూ వచ్చాయి. ఇప్పుడు పర్మసోక్ వాలంటీర్లకు కావలసినంత ఆహారం లభి స్తోంది. మార్క్ పనికూడా పూర్తి అయింది. మెల్లమెల్లగా అడవినిదాటి, బీడుభూముల గడచి, నదీ తీరాన్ని చేరు కున్నాడు. తత్క్షణం ఖబ్రావస్కకు ప్రయాణమైనాడు. ఆరు వారాల కన్న యెక్కువకాలం కాట్యాను విడచివుండ నక్కర లేదనీ, యీా లోపుగానే ఖబ్రావస్కకు తిరిగి రావచ్చుననీ అనుకున్న మార్క్ కు ఆరు నెల లయిన ట్లనిపించింది. అనిపిం చడమేమిటి, నిజంగా, ఆరు మాసాలు అయింది.

ఖబ్రావస్క చేరగానే పార్టీ ప్రధాన కార్యాలయానికి వెళ్ళడానికి బదులు ప్రక్కవీధిలో వున్న పల్లపుయింటికి పట్టించ మన్నాడు కారును.

ఎవరో అపరిచితవ్యక్తి ఆతని పిలుపునకు సమాధానమిచ్చింది. వీధిలో కారుండటం చూసి ఆమె స్నేహపూర్వకంగా మంద హాసం చేసింది. భయకంపిత హృదయాన్ని చిక్కబట్టి మార్క్ ఆమె వైపు తేరిపార జూచాడు.

"మీాకేం కావాలి, కామ్రేడ్ ? లోపలకు దయచేయండి" అని ఆహ్వానించిందామె.

ఆమె వెంట కాట్యా గదిలోకి వెళ్ళా డతడు. ఆ గదిలో అడుగు పెట్టగానే అతడు గ్రహించాడు, అది కాట్యా గది కాదని. కాట్యా వాడే వస్తువు లేవీ అక్కడలేక పోవడమె అతని అనుమానానికి కారణం. అపరిచిత స్త్రీ వైపు తిరిగి కర్కశంగా అడిగాడు మార్క్:

"కాట్యా ఆంటినా యెక్కడ ? చెప్పు, నీకు పుణ్యముం టుంది; తొందరగా, చెప్పు!"

"నాకు తెలియదు" అని వెంటనే అనేసింది ఆమె. "మేము యిక్కడికి రాకపూర్వం యెవరో ఒక యువతి యిచ్చట ఉండేదట. ఆమె చైనా యువతో, రష్యన్ వనితో మాత్రం తెలియదు. ఇటీవల ఆమె యిక్కడినుండి వెళ్ళిపోయిందని విన్నాం. ఆమెనుగూర్చి నాకుమాత్రం యేమి తెలియదు"

మార్క్ తొందరతొందరగా వెలుపలకువచ్చి, మోట్లు దిగి ఒక్కవిసురులో కార్లోపడ్డాడు వెళ్ళి. "నేరపరిశోధన కార్యా లయం" అని డ్రైవరుకు సూచించాడు. కొద్ది నిముషాలలో కార్యాలయంలో తానిదివరకు కూర్చున్న గదిలోకే మళ్ళీ ప్రవేశపెట్టబడ్డాడు. అదేబల్లదగ్గర ఆనాటి ఉద్యోగస్తుడే కూర్చునివున్నాడు.

"ఆమె యెక్కడుంది?" అని అడిగాడు ఎలాగో మెల్లిగా.

"నిజం మీదగ్గర దాచిలాభంలేదు......ఆమె వెళ్ళిపో యింది, మళ్ళీవస్తుందనే ఆశకూడాలేదు" అంటూ గంభీరంగా జవాబుచెప్పడం ప్రారంభించాడు. ఆయుద్యోగి సమాధానమి చ్చాడు: "మిమ్మల్ని గురించి మాకు సర్వం తెలుసు, కామ్రేడ్

సురోవ్, మీమీద మాకు పరిపూర్ణవిశ్వాసం వుంది. మీకు తగిలినగాయం, ఆ గాయంవల్ల మీకుపడుతున్న బాధ ఉపశమింప చెయ్యడానికి మేమూ ప్రయత్నిస్తాం. కాని, ఆమెకు యేమి సంభవించినా దేశరక్షణ కర్తవ్యంలోనే సంభవించి వుంటుందని నమ్మండి. ఆమె సేవిస్తున్న దేశాన్నే మీరూసేవిస్తున్నారు. ఆమెకు జరిగినదానికి బాధ్యులు జపాన్ వారనిమాత్రం మేము రూఢిగాచెప్పగలం. ఒకనాటి ఉదయం యెవరోవచ్చి మూడు సార్లు తలుపుతట్టారు. ఎవరువచ్చి పిలచినా తలుపు తియ్యవద్దని మేము వారించినప్పటికీ వినక ఆమె తలుపు యెందుకు తెరిచిందో తెలియదు. ఇరుగుపొరుగువారికి యేడ్పు వినిపించిందట. వారు బయటకువచ్చి చూసేసరికి అక్కడ యెవరూ కనిపించలేదు. మేము ఆమెజాడలు తియ్యడానికి విశ్వప్రయత్నాలు చేశాం. కాని లాభం లేకపోయింది."

మార్క్ మెల్లగా తాను కూర్చున్న కుర్చీలోంచి లేచాడు, తీక్ష్ణమైన అతనిచూపులు ద్వేషానలాన్ని యెదురుగాఉన్న వ్యక్తిపై గుమ్మరిస్తున్నాయి.

"నన్ను నమ్ముతున్నానన్నారుకదూ మీరు?" మీనమ్మకం మీదగ్గరే వుంచుకోండి. మీరు వంచకులు; ఇతరుల మాన ప్రాణాలతో చెలగాటాలాడే జూదరులుమీరు. ఆమె తండ్రిని బెదిరించి ఆమెకిష్టంలేనివానికి ఆమెను ఒప్పించారు; పైగా, ఆమె తన దేశసేవచేసిందని చిలకపలుకులు పలుకుతున్నారు. దేశం యెలావుంటుందో, దేశసేవంటే యేమిటో యెరగనైనా యెరగదు ఆ అమాయిక. అట్టి వ్యక్తియెడ మీరు సిగ్గుచేటుగా ప్రవర్తించారు. ఎంతో ఆశావహమైన ఆమె జీవితానికి మీ

వల్ల ఆశ్వాసాంతం అయింది. మీ ప్రాణాలుమాత్రం నిరపాయంగా, భద్రంగా ఉన్నాయి."

క్రోధోద్రేకమానసుడై మార్క్ ప్రతిఉద్యోగిని కలుసుకున్నాడు, కాట్యాజాడ తెలుసుకుందామని; కనీసం, ఆమెకు యేదుర్గతిప్రాప్తమైందో తెలిపినా బాగుంటుందనుకున్నాడు; చివరకు, బ్లుచర్ నుకూడా కలుసుకున్నాడు. మార్క్ అంటె వారందరికి గాఢమైన అభిమానంవుండడంచేత అతని దీన చరిత్రను వారు సానుభూతితో, సావధానంగా, చెవియొగ్గి విన్నారు. కాని, యెవరిచ్చినా ఒకటే సమాధానం; ఎవరు పాడినా ఒకటేపాట. "ఇప్పుడు చెయ్యగలిగిందేమి లేదు. మీరు సాధ్యమైనంత త్వరలో ఆమెను మరచిపోవడం మంచిది. ఆమె వెళ్ళిపోయింది. ఇక మీరు జీవితంలో ఆమెను చూడలేరు."

ప్రతిరాత్రి తలగడ కరచిపట్టుకొని సంతతధారగా యేడ్చేవాడు మార్క్. తన యేడుపుధ్వని పైకివినపడకుండావుండడానికే మార్క్ ఆవిధంగా తలగడనడ్డంపెట్టుకునేవాడు. అర్ధరాత్రివేళల్లో ఆఫీసుకు వెళ్ళేవాడు. అప్పుడు వెలిగించినదీపం తెల్లవార్లూ అల్లా వెలుగుతూనేవుండేది. అదేపనిగా, పనిలో నిమగ్నుడై పోయి అప్పుడప్పుడు వంచినతలనెత్తి హృదయభారంతో "నన్ను క్షమించు పికిలిపిట్టా..... నిన్ను కాపాడలేకపోయినందుకు నన్ను క్షమించు" అని తనలోతనే గొణుక్కుంటూ వుండేవాడు. మళ్ళీ, ఒక్కొక్కప్పుడు, తనతో కూడా ఆగదిలోనే వున్నదనీ, తనవైపే చూస్తున్నదనీ, చుక్కలవలె ఆమెకండ్లు మిలమిల మెరుస్తున్నాయనీ, "నన్నొంటరిగా విడిచివెళ్ళకుమార్క్, నాకేమో భయంవేస్తోంది" అని

ఆమెచూపులు తనిని దీనంగా వేడుకుంటున్నాయనీ భ్రమించేవాడు. ఆమె తనవైపు చేతులుజాచేది; తాను లేచి ఆమెను జేరాలనుకునేవాడు; ఒకటి–రెండు–యిలాఅయిదడుగులు ముందుకు వేసేవాడు–చేతులుజాచేవాడు; కాని, ఆచేతులకు తగిలినది చల్లనిగోడ.

కొన్నివారాలఅనంతరం ఖబ్రవస్క్ స్థానికపాలకసంఘం యేర్పాటుచేసిన విందులో పాల్గొనవలసిందిగా మార్క్ కు ఆహ్వానంవచ్చింది. జపాన్ఆక్రమణనుండి దూరప్రాచ్య రష్యన్ స్థావరం విముక్తమైనందుకు సంతోషసూచకంగా యీ విందు యేర్పాటు చెయ్యబడింది. ఈవిందుకు ఆప్రాంతంలోవున్న రష్యన్ ఉన్నతాధికారులేకాక, అచ్చటి దౌత్యకార్యాలయాల విదేశ ప్రతినిధులూవిచ్చేశారు.

మార్క్ కూర్చున్న చోట యెదురుగా, కాకతాళీయంగా, జపాన్ కాన్సలేట్ ఉద్యోగి యొషిమా కూర్చున్నాడు. ఏపరిస్థితులలోను జపాన్ యువకుని కోర్కెలను తిరస్కరించరాదని యిదివరకు కాట్యాకుచేసిన హెచ్చరిక యీయువకుణ్ణిగురించే.

“దూరప్రాచ్యం చాలమంచి దేశం, ఏమంటారు?” అన్నాడు యొషీమా వినోదంగా ప్రసంగాన్ని ప్రారంభింపదలచినట్లు;

“నిజం, నిజం” అన్నాడుమార్క్, అనకతప్పదన్నట్లు, “అన్యదేశీయులకు దూరప్రాచ్యంఅంటె చాలయిష్టం.”

“సహజమే! జపాన్ వారికైనమాకు ప్రపంచదేశాలన్నింటి వలెనే యీప్రాంతాన్ని ఆర్థికంగా అభివృద్ధిలోకి తేవడమంటే చాలయిష్టం. రష్యనులనుగురించి తెలుసుకోవాలని మాఅభి

లాష. ఇచ్చట వాడుకలోనున్న భాషలలోకల్లా విశేషంగా ప్రజాదరణపొందిన భాష రష్యన్ భాష.

"చాల సంతోషం, కాని, జపాన్ భాషను చాలతక్కువ మంది అభ్యసిస్తారు."

రష్యన్‌లకు జపాన్ భాషనేర్చుకోనడం కష్టంకదూ? దాన్ని సరిగ్గా మాట్లాడేవారు చాల అరుదు."

"స్త్రీలలోకూడా అంతేనంటారా?"

యొషీమా ముఖం వివర్ణమైంది. చూపులు నిరుత్సాహాన్ని, అదలింపునూ వ్యక్తంచేస్తున్నాయి

"జపాను భాషను మాట్లాడే రష్యనులంటె నాకొక పికిలి పిట్ట స్ఫురణకు వస్తోంది, అన్నాడు యొషీమా.

మార్క్ పిడుగు మొత్తినట్లు వెల్లబోయాడు; పికిలిపిట్టలు అదృష్టజీవులంటారు కదండి" అన్నాడు మార్క్ ప్రశాంతంగా, నిర్లిప్త భావముతో.

"చచ్చిన పికిలిపిట్టలు అదృష్టజీవులని మా జపానువాళ్ళ నమ్మకం."

"చాల వింతనమ్మకం!" అన్నాడు మార్క్; "ప్రపంచ మతాలన్ని పక్షిసంతతిగా పుట్టాలంటె యెంతో అదృష్టం చేసుకోవాలని నమ్ముతున్నాయి, కాని, మీనమ్మకం చాలా అసాధారణంగా వుంది"

"ఎంతమాత్రంలేదు. మనుష్యసంతతి వలెనె పక్షిసంతతి కూడా అనేక జన్మలెత్తుతుందని మానమ్మకం. అందుచేత, యీలోకంలోంచి పరలోకానికి పక్షిని పంపించామంటె దానికి

వచ్చేనష్టమేమిలేదు. ఎప్పొచ్చి దాని తుదికోర్కెను మాత్రం తీర్చాలి, అంతే.

"నిజంగా?" అనివిస్తుపోయాడు, మార్క్.

"ఇమ్మాటికి అంతే"

అతిథులొక్కొక్కరె యెవరిదారినివారు నడుస్తున్నారు. మార్క్, లేచి కోటుతొడుక్కోబోతోంటె వెనుక యెుషీమా అంటున్నమాటలు చెవిని పడ్డాయి.

మార్క్ గిరుక్కున వెనకకు తిరిగాడు. గులాబిరంగు రిబ్బన్‌తో కట్టబడి వున్న చిన్న పెట్టెను అందిస్తూ "మన యీ సమావేశానికి జ్ఞాపకచిహ్నముగా దీనినిమీరు గ్రహించవలసిందని మిమ్మల్ని కోరుతున్నాను, ఇంతకూ, అంతవిలువయిన దేదీ యిందులో లేదనుకోండి. వట్టిజ్ఞాపక చిహ్నంమాత్రమే. శెలవు మిస్టర్ సురోవ్."

అతను నిష్క్రమించాక మార్క్ పెట్టె విప్పిచూశాడు. లోపల ఒక నీలపు రాయి, దానిమీద రెక్కలు విప్పుకొని వున్న ఒకమనిషి ఆకారం చిత్రించబడివుంది. అది కాట్యాను స్ఫురింప జేసే పికిలిపిట్ట; లేదా, మార్క్ దృష్టిలో చెదరిపోయిన మరొక అభాగ్యజీవి.



అధ్యాయం 5.

## కాగోచ-బొగ్గు ప్రవ్వకం

ఎంతటి దుఃఖాన్నైనా దిగ్రమింగి మనగల అనంతసహన శక్తి మానవ హృదయానికే గనక లేకపోతే, యుఫీమా, కాట్యాబ్రోచ్ నుబహూకరించిన నాటిరాత్రే మార్క్ హృదయం బ్రద్దలై వుండవలసింది. పైకితగిలిన గాయాలను మాన్పుకొనేశక్తి శరీరానికున్నట్లే మనస్సుకు తగిలిన గాయాలను మాన్పుకొనేశక్తి శరీరానికివుంది.

నిరాశా నిస్పృహలతో రోజులు నెలలుగాను, నెలలు సంవత్సరంగాను మారిపోయాయి. మార్క్ యింకా ఖబ్రొవస్క్ లోనే అదేకార్యాలయంలో పనిచేస్తున్నాడు. నిదుర నెరగని అతనికన్నులకు కాట్యాస్వరూపం గదిలో చీకటిగా వున్న ప్రాంతంనుండి తనవైపునను కదల్తుతున్నట్టనిపించేది. "ప్రియా, నన్ను క్షమించు, నిన్ను నేను కాపాడుకోలేకపోయాను," అనేవాడుమార్క్. గదిలో అంతానిశ్శబ్దం. కాని, అతని హృదయానికిమాత్రం తానన్నమాటలకు ప్రత్యుత్తరం వినవచ్చేది. "నీకోసం నేనెంతగా వేగిపోయానో తెలుసా, మార్క్; ఎంతగా భయపడి పోయానో!"

అనుక్షణమూ, తన్నుతానే దూషించుకొనేవాడు, పార్టీ ఆదేశాన్ని మన్నించి ఆనాడే ఖబ్రొవస్క్ వచ్చివుంటే, ఆమె తప్పకుండా బ్రతికివుండేది. ఆదరహాసవదనంతో, ఆ అపరూపలావణ్యంతో తొణికిసలాడిపోతూ కన్నుల పండువు చేసి వుండేది. తనగాఢ పరిష్వంగంలో మధురస్వప్నాలను కని వుండేది. అట్టి దానిని ఒక చిన్నసమిధగా ఆహుతి చెయ్యడానికి తన కేమి హక్కుంది? పదునందల వాలంటీర్లూ యెలాగో

శీతకాలాన్ని గడిపివుండేవారు, ఒకవేళ వారంతా మరణిస్తేమా త్రం? ఆమె అమూల్యజీనితంతో పోలిస్తే ఆక్షుద్రప్రాణా లేమంత విలువైనవి?

ఈ సంక్షోభానికి తాళలేక, అప్పుడప్పుడతడు అపుయార్ నదీ తీరానికి మనశ్శాంతి కోసం వెళ్ళుతూవుండేవాడు. ఆనిశ్శబ్ద నిశీధిలో– తాను నిర్ణయానికి వచ్చిన ఆ అటవీ ప్రదేశంలో, తన రక్షణకు వదలిపెట్టబడిన వారి నిరాశా దృక్కులు జ్ఞప్తికి వస్తాయనేమో. ఆ రోజులలో వారిని తిమతమ అదృష్టానికి వదలిపెట్టడం,అగ్గాకలికి గురిచెయ్యడం అమానుషం,అసంభవం అని తనచర్యను సమర్థించుకోనడమె ఔతుంది. ముమ్మాటికి వారియెడ తాను విధిని నిర్వహించడమె అతని ధ్యేయం.

ఈ విధంగా ఒకనాటిరాత్రి నదివద్దున నడయాడుతూం డగా, తన కిష్టం లేకపోయినా మరొక అభాగ్య సన్నివేశాన్ని పరికించాడు.దుఃఖాన్ని కొలవడానికి సాధన మేదైనావుండివుంటె అతని దుఃఖంకన్న, అతడు కనుగొన్న దుఃఖమే దుర్భరమైనె దని ఆ సాధనం నిరూపించియుండును. నదిమళ్ళుపుమాటున అతనికి రెండు అవ్యక్త కంఠధ్వనులు వినిపించాయి. తక్షణం వెనకడుగువేశాడు. ఒక చెట్టుచాటునుండి చూశాడు నది కభిముఖుడై నిల్చునివున్న పొడుగాటి యువకుణ్ణొకణ్ణి. అతని కౌగిటిలో ఒకయువతి పెనవేసుకుని వుంది. యువతి అంటోంది: "అలా అనకు పీటర్! నేను నిశ్చయానికి వచ్చేశాను. నీతో గాకమానను."

"నాతో రావడమంటె, కోరి, మృత్యుముఖంలో ప్రవేశిం చడమన్నమాట. చావు తధ్యం."

"నాకు తెలుసు ; అయినా, మృత్యుముఖం లోకి పోయే ముందు శాంతి, సుఖాల ననుభవించి నిశ్చింతగా, ఒకటిగా పోదాం. కొంత కాలమైనా యీ వియోగదుఃఖాన్ని మరచి అన్యోన్య సాహచర్యంలో ఆనందానుభూతి ననుభవించి మరీ కళ్ళు మూద్దాం, కనక నే, నీతో వచ్చేస్తా నంటున్నాను."

" తొందరపడకు, మేరియా, బాగా ఆలోచించు; నీవింకా చిన్నదానివి. అనుభవయోగ్యమైన భావిజీవితాన్ని కాలత్ర న్నకోకు . ."

"ప్రియతమా, దయచేసి, యిక నాతో వాదించకు. నిన్ను విడచి నేను బ్రతుకలేను. నీవులేని యీజీవితంనాకు దుర్భరం. నువ్విక్కడే వుండు; మూడుగంటలలో మళ్ళీ నేనిక్కడికి వస్తాను. ఒకనావలో మనం యీనదిని దాటేద్దాం. సముద్ర తీరానికి రైల్లో బయలుదేరదాం. అచ్చటినుండి ఆద్వీపాన్ని చేరుకుందాం. ప్రియతమా, పీటర్, మనకింక మూడుగంటలే యెడబాటు.అటుపిమ్మట జీవితాంతంవరకూ మనల నేశక్తీ విడదియ్యలేదు. జంటగా-విడిపోని జంటగా-వుండిపోతాం!

"సరే మేరియా, అలాగే, నీయిష్టం . . . ఆమరణాంతం."

వారిద్దరు గాఢంగా ముద్దుపెట్టుకున్నారు. ఆమె నావలో యెక్కి శక్తికొద్దీ తెడ్డువెయ్యడం ప్రారంభించింది. నీటిని చీల్చుకొంటూ ఆవలిఒడ్డుకు చేరువౌతోంది. పీటర్ చెట్లగుబురుల్లో నిశ్చేష్టుడై నిలచి. ఆమెను తేరి పారచూస్తూ అలాగే నిలబడిపోయాడు. ఉన్నట్టుండి, తనరెండుచేతులలోను తలను, పగిలిపోతుందేమోనన్నట్లు, గట్టిగా అదిమిపట్టుకొని నిరాశా పూరిత కంఠంతో "నావల్లకాదు ! నేచెయ్యను" అని విలపించాడు.

వెంటనే, ఆ వేశంతో. జేబులోంచి నోటుబుక్కు నొక దానిని తీసి, కొన్ని వాక్యాలను అట్టపై వ్రాసి, తామిరువురు నిలచిన చోటుకు దగ్గరగానున్న ఒక పొడుగాటి చెట్టుకు దాన్ని గృచ్చాడు. ఆ ఆవేశంతోటే, నదిగట్టు వెంబడి వడి వడిగా నడచి వెళ్ళిపోయాతు.

కనుచూపు మేర దాటి వెళ్ళేవరకూ మార్క్ నిదానించాడు. పీటర్ కనుమరుగవగానే. యేదో అసాధారణ శక్తి తనను ప్రేరేపిస్తున్నట్లు చెట్టుకు గ్రుచ్చిననోటు బుక్కును తీశాడు. అట్టమీద యిలా వ్రాసివుంది:

" నాప్రియమైన మేరియా! నేను ఒంటరిగానే వెళ్లుతున్నాను. నాదుర్వ్యాధిలో నిన్ను భాగస్వామిని చెయ్యడం నాకిష్టంలేదు. నిన్ను నేను విపరీతంగా ప్రేమిస్తున్నాను. అందుకనే నీజీవితాన్ని నాశనం చెయ్యడానికి అంగీంరించ లేకపోతున్నాను. ఆకుష్టురోగుల ద్వీపంలో, స్వల్పకాలమె అయినా, స్వేచ్ఛా జీవితం లభిస్తుంది నాకు. ఐతే, ఆ స్వేచ్ఛకు, నేను చెల్లించె మూల్యం' ఊహాతీతం. నువ్వులేకపోయినా, నిన్ను స్మరించుకొనడానికీ, నిన్ను భావంలో నిల్పుకొనడానికీ, ప్రేమించి, ప్రాధేయపడడానికీ, యెంతైనా తీరికవుంటుంది—నీ పీటర్"

మార్క్ నోటుబుక్కు తెరచాడు.. అందులో యేముందో భగవంతునికే యెరుక అనుకున్నాడతడు. అందులో వున్న దీవిధంగా చదివాడు, మార్క్.

♦ ♦ ♦ ♦

పీటర్ నొవికాఫ్ డైరి.

అమ్మా! నను కన్న తల్లీ! నేనొక మంచి నక్షత్రంలో పుట్టానని నువ్వన్న మాటలు, ముమ్మాటికి, నిజం. నేను భూగర్భంలో నున్న బొగ్గును శోధించాను! నిజమే. పీటర్ నొవికాఫ్ అన్న నేను లెనిన్‌గ్రాడ్ భూగర్భ పరిశోధనాలయం నుండి పట్టం పుచ్చుకున్న తరవాత, బొగ్గును శోధించి కనుగొన్నాను. అక్కడ బొగ్గు లభిస్తుందని కలలో కూడా యెవరు ఊహించలేదు. ఇప్పుడు నేను ఖబ్రావస్క్‌లో వున్నప్పటికీ, కీర్తి, ప్రతిష్ఠలను మూటకట్టుకొనడానికి నడక సాగిస్తున్నాను. అందుకని, యీ డైరీని, నీ కొరకూ, నీలాగే ప్రేమిస్తున్న మరొక స్త్రీ కోసం వ్రాసి పెట్టాలని భావించాను. సోవియట్ యూనియన్‌లో, ముందు ముందు, యీ ప్రాంతాన నడచే రైళ్ళకు కావలసివచ్చే బొగ్గుకొరత యింతటితో తీరిపోతుంది. నా పరిశోధనతో, యీ సమస్య పరిష్కారమై పోయింది. వేలాది కిలోమీటర్ల దూరంలో వున్న డాన్ బాస్ నుంచి బొగ్గును యీ ప్రాంతానికి చేర వెయ్యవలసిన అవసరం లేకుండా పోయింది.

నిన్నటిరోజున, సరాసరి మాస్కోతో మాట్లాడమని నన్ను టెలిగ్రాఫ్ ఆఫీసుకు పిలిపించారు, ఆర్డ్జొనికిజి. ఈయన ప్రజా ప్రభుత్వాధికారికి అసిస్టెంటు. బొగ్గునుగురించి నీవు తయారు చేసిన లెక్కలు సరియైనవేనా అని నిలదీసి ఆయన నన్నడిగాడు టెలిఫోన్‌లో. నేను జవాబు చెప్పబోతోంటె ఫోన్ డిస్‌కనెక్ట్ చేశారు. బహుశః సెన్సార్ అధికార్లు యీ పని చేసివుంటారన్నది మేరియా.

గత వారం రోజులలో వ్రాయతగ్గ దేమి లేదు. అందుచేత వ్రాయలేదు. నేను పూర్తిగా డస్సి పోయాను. నాచే శోధింప బడ్డ బొగ్గునుగురించి అలజడి యెక్కువైంది. దేశంలో వున్న ప్రతి సంస్థకు దీనితో సంబంధం వున్నట్లై తోచింది ఎవరు యెవరికి బాధ్యులో, బోధ పడడం లేదు. నాకు, ప్రప్రథమంలో, ప్రాంతీయ కార్య నిర్వాహక వర్గం నుండి హుకుం అందింది అటు తరవాత జి. పి. యు (రష్యన్ గూఢచారి శాఖ) వచ్చింది. చివరకు, యీ జి. పి. యు ఒక్కటె సర్వాధికారి అనీ, దాని మాట మాత్రమె చెల్లుబడి కాగలదనీ, తెలిందె. మరి, వారు పోలీసు శాఖకు సంబంధించిన వారు కదా, పోలీసు శాఖకు బొగ్గుకూ సంబంధం యేమిటి ? బొగ్గును గురించి వారికేం తెలుసు ?...యేమొ.

జి. పి. యు అసిస్టెంటు డైరెక్టరు బర్మన్ అప్పుడే మాస్కో నుండి వచ్చాడు. బొగ్గు విషయం ప్రస్తావిస్తూ బొగ్గు త్రవ్వడానికి సర్వప్రయత్నాలు జరగగలవన్నాడు. కాని, నేను బొగ్గును కనిపెట్టిన ప్రదేశం యిక్కడికీ, కగోచాకూ, నాలుగు వందల కిలోమీటర్లుంది. మా ప్రధాన కార్యాలయాలన్నీ కగోచాలోనే వున్నాయి. అచ్చటినుండి బొగ్గున్న ప్రదేశానికి రోడ్లు లేవు సరి కదా, కాలిబాటలు కూడా లేవు. అక్కడికి కార్మికులను, సప్లైలను యెలా చేరవేస్తారు ? త్రవ్విన బొగ్గును అచ్చటినుండి యెలా రవానా చేస్తారు ?

నన్నూ ప్రయాణానికి సిద్ధంగా వుండమన్నారు. కొన్ని వందలమంది జనంతో బయలుదేరి బొగ్గు త్రవ్వే ప్రదేశానికి వెళ్ళి అవసరం వున్నంతకాలం అక్కడ వుండాలి. ఇవి స్టేషం

బరు చివరిరోజులు. మేము మూడు నాలుగురోజులలో బయలు దేరి సుమారు అక్టోబరు యిరవై ఆ ప్రాంతాల్లో అక్కడికి చేరతాం.

నెలరోజులుగా ఒక్కమాటకూడా నేను వ్రాయలేదు. మేము సెప్టెంబరు యిరవై యెనిమిద, ఆప్రాంతాల్లో,కొగోచా నుండి బయలుదేరి సుమారు నవంబరు ఒకటవ తేదీకి బొగ్గు త్రివ్వే ప్రదేశానికి చేరుకున్నాం. మాలో పెక్కుమంది జి. పి. యు తాలూకు 'ఇంటీరియర్ మిలటరీఫోర్సు' లకుచెందినవారు. వీరు సుమారు నాలుగువందల మందివరకూ ఉండవచ్చు. ఇక నాబోటి పౌరజనం అరవై కిమించి ఉండరు. మాశకటాలసంగతి చూస్తే, ఆహారధాన్యాలు, యితర వస్తుసామగ్రి మోసుకు వస్తున్న అశ్వశకటాలు. ప్రతిబండిమీద ముళ్ళతీగవుంది. పోతే, బొగ్గుత్రవ్వకం ఖైదీలచేత చేయిస్తారని వినికిడి.

సైనికులలో కనీసం సగంమంది అయినా ఆముళ్ళతీగ నమర్చడంలో నిమగ్నులై వున్నారు. ఖైదీలను బొగ్గుత్రివ్వే పనికి యిక్కడికి తీసుకురాబోతున్నారంటె నాకు చాలా ఆశ్చర్యం వేసింది. వాళ్ళకు కనుపించేదల్లా విశాలమైన భూ ప్రదేశం ; దానిచుట్టూ ముళ్ళంకంచె; నాలుగుమూలలా నాలుగు గస్తీబురుజులు. ఒక్కొక్కప్పుడు నాలో నేను మధన పడే వాణ్ణి. నేనిక్కడ బొగ్గు కనిపెట్టడంవల్ల నే కదా, జన సామాన్యాన్ని యిక్కడకు తీసుకువచ్చి బొగ్గుత్రవ్వమని నిర్బంధం చేస్తున్నారు. ఈ తప్పంతా నాదికాక మరెవరిది?. . .కాని, మళ్ళీ, సమాధాన పరచుకొనేవాణ్ణి, యిక్కడకొచ్చె ప్రతి

వారిరాకకు ప్రబలకారణం మరొకటేదోవుండితీరుతుందని; అప్పుడప్పుడు ప్రజలను అనవసరంగా నిర్బంధంలోకి తీసుకుంటారని; కాని, నేనిదినమ్మను. ఏతప్పూచేయని వారిని, నిరపరాధులను, అకారణంగా, యెందుకు హింసిస్తారు? జెయిల్లో యెందుకు పెడతారు? తరవాత బాడచాకరీ యెందుకు చేయిస్తారు? భవనాలనిర్మాణం పూర్తి అయినట్లు విని నేనాశ్చర్యపోయాను. పౌరజనానికి, రక్షణసిబ్బందికి యేర్పాట్లైతే జరిగాయి. మాకు నిర్దేశింపబడిన భవనంలో మేము ప్రవేశించాం. మరి, ఖైదీలసంగతి? వాళ్ళూ, నేడో రేపో రాబోతున్నారుగా. నిన్న దళాధిపతియైన కామ్రేడ్ వెశిరోయాలీతో యీవిషయం ప్రస్తావించాను.సంభాషణానంతరం మాయిరువురి ధోరణులను సమీక్షించగా, ఆయన తూర్పార బట్టాడనే భావించాను. సూటిగా నాకళ్ళల్లోకి చూస్తూ వెరోశిలోవ్ అన్నాడు :

"మేము ఖైదీలకు వసతివాడలను కట్టించి పెడతామని మీరు నిజంగా నమ్ముతున్నారా? జి. పి. యు సభ్యులు యిలాంటి పనులు సాధారణంగా చెయ్యరన్న సంగతి మీకు తెలియదనుకుంటాను?"

"మరి, సీతకాలంవస్తే వాళ్ళ సంగతి?"

"వాళ్ళ అవస్థలేవో వాళ్ళు పడతారు. మనిషనే వాడు చాల మొరటు జంతువనీ, అవసరమైతే యెలాంటి కష్టాలనైనా సహించగలడనీ అచిరకాలంలో మీరే గ్రహించగలుగుతారు."

నిన్నటిరోజున మొదటిజట్టు— సుమారు ఆరువేలమంది— ఖైదీలు యిక్కడికి వచ్చారు. ఇచ్చటికి సుమారు నాలుగు వందల కిలోమీటర్ల దూరంలోవున్న కాగోచానుండి కాలి నడకన రప్పింపబడ్డారు వాళ్ళు, బడలికతో, చలితో, అర్ధాకలితో సగంచచ్చి, నెసిరోలీతో, ఆజట్టునాయకుడు చెప్తూ వున్న దాన్నిబట్టి, మార్గమధ్యంలో, సుమారు నూట యాభై మందివరకూ రాలిపోయారట. ఇక్కడికి చేరుకున్న ఖైదీ లందరూ ముళ్ళకంచెలున్న ఆవరణలోకి ప్రాకుతున్నట్లు దూరం నుండి నేను చూశాను. నెసిరోలి ఉత్తర్వులు చాలా ముక్తసరిగా వుంటాయి. చలిబాధనుండి తప్పించుకొనడానికి వీలుగా ఖైదీలు భూమిలో గోతులు త్రవ్వుకొనేందుకు రెండు రోజుల గడువు యివ్వబడింది. మూడవరోజున ప్రతివారూ బొగ్గు త్రవ్వకానికి హాజరై పని ప్రారంభించాలి.

ఖైదీలను కలుసుకొని, వారితో మాట్లాడినకొద్దీ నాకు ఆవేదన యెక్కువౌతూ వచ్చింది. ఇంతవరకు వీరిసంఖ్య యిరవైనాలుగువేలకు పెరిగింది.వీరు పౌరజీవితంలో,సామాన్య రైతు జనం; కాని, భూస్వాముల తరగతిలో చేర్చబడ్డారు. వాళ్ళుచేసిన నేరం సమిష్టి కమతాలలో చేరడానికి యిష్టపడక పోవడం; తమ పొలాలకు, యిల్లువాకిలికీ, పాడి పశువులకూ, స్వారిచేసే గుర్రాలకు తమకున్న హక్కుభుక్తాలను వదలుకొనడాన్ని ప్రతిఘటించడమే వారి మహాపచారం. సమిష్టికమిటీలలో చేరదలచుకున్న వారి నెవరినీ వారెన్నడూ అడ్డుపెట్టలేదు. మేం మాత్రం చేరదలచుకో లేదనేవారు. ఆ నేరాలకు సాయుధులు వారిళ్ళలో, చొరబడి, వారినీ, వారికుటుంబా

లనూ, పశువుల నెక్కించినట్లు, రైళ్ళలో యెక్కించి సైబీరియాకు తోలేశారు. వారిలో యెన్నో కుటుంబాలు విచ్ఛిన్నమైపోయాయి; యెంద రెందరో మరణించారు. మరణించిన వారి శవాలను రైలుకట్టప్రక్కకు దొర్లించేవారు. పోగా మిగిలినవారిని బొగ్గుత్రవ్వకాని కని యిక్కడకు చేర్చారు.

పై సంఘటనలు వ్రాసి యిప్పటికి ఆరువారా లైంది. ఇచ్చటి పరిస్థితులను గురించి వ్రాయడం అంత తేలికైన పని కాదు. కాని, యీవేళ ఒకమంచి సంఘటన జరిగింది.— ఈ ప్రాంతంలో నే నూహించినదానికన్న తక్కువబొగ్గు ఉన్నట్లు నిర్ధారణచేయ బడింది. నేను పరిశోధనచేసిన పదునాలుగు స్థావరాల్లోనే కాని వాటి మధ్యప్రదేశాలలో యెక్కడా బొగ్గు తగలలేదు. కాబట్టి, వేలాదిమందికి పనిలేకుండా పోయింది; వారి నిక్కడ నుండి తరలించడమె సముచితమని తోచింది. నాపరిశోధనవల్ల అనుకున్నంత బొగ్గు లభ్యం కాదని తేలినందున వారు నాపై ఆగ్రహించి న్యూనత పరచడానికి ప్రయత్నించినా ప్రయత్నించవచ్చు. అంతమాత్రంచేత నేను చలించేవాణ్ణి కాను. ఈ నిర్భాగ్యులందరూ నావల్ల కష్టాల పాలు కాకుండా వుంటే అదే పదివేలు. నాభావాలు అటు వంటివని మేరియాకు తెలుసు.

సీతకాలం వెనకబడుతోంది. మంచుకూడా క్రమంగా కరగడం ప్రారంభించింది. ఇదివరలో ప్రతిరోజూవచ్చే ఆహార వాహకశకటాలు యిప్పు డాలస్యంగా చేరుతున్నాయి. ఇవాళ కగోచానుండి సుమారు సగంవంతు ఆహార సరఫరా అందలేదు.

కారణం. కరగిపోతున్న మంచుమీద శకటాలను గుఱ్ఱాలు లాగలేక పోతున్నాయి.

మంచు కరుగుతూన్నందున నదులు గట్లను త్రెంచుకొని పొంగ నారంభించాయి. నది కిరువైపులా వున్న ప్రాంతాలు జలమయాలైనాయి మూడువారాలనుంచీ ఆహార సప్లై లనేవేవి లేవు. ఖైదీలకిచ్చే కొలబత్తెం ప్రాణాలూడి పోకుండా నిలబెట్టుకోడానికి మాత్రమే సరిపోయేవి. అదైనా మళ్ళీ సగానికి కుదించబడిది. ఇవాళ నేను యిక్కడి స్మశానాల ప్రక్కనుంచి పోతూంటే తొంభై ఆరు సమిష్టిగోరీలను చూశాను. ఒక్కొక్క గోతిలో యాభై య్యేసి శవాల చొప్పున పాతిపెట్టారు. అనగా, సుమారు అయిదు వేలమంది చనిపోయారన్న మాట. మావద్దనున్న ఆహారనిల్వలను బళ్ళ మీదవేసుకొని అక్కడనుంచి శిబిరంయెత్తివెయ్యడానికి నిర్ణ యింప బడినది. ఖైదీలుమాత్రం మృత్యుదేవత కరుణాకటాక్షాలకు వదలివేయబడ్డారు ఇం మందిని బలవన్మరణానికి వదలిలేచి రావడంకన్న మనోవ్యధ వేరొకటుండదు.కాని నాకుకూడా బ్రతుకుమీద ఆశ పోలేదు. నేనూ బయలుదేరాను. ఐతే, నాస్వార్థానికి మేరియా యేవగించి వైదొలగుతుందేమొ.?

ఆహార నిల్వలను బళ్ళకెక్కించి ప్రయాణాని కాయత్తమైన నాటి ఉదయంనుండి యిప్పటివరకు యెన్నిదినాలు గడిచాయో చెప్పలేను. విధివైపరీత్యంవల్ల, చూడగూడని దృశ్యాలనెన్నిటినో చూడక తప్పిందికాదు నాకు. దిగ్భ్రాంతితో చిత్తవైకల్యంతో దిమ్మరినై తిరుగుతూ వచ్చాను.

మెత్తని నేలమీద బళ్ళనులాగవలసివచ్చినప్పుడు గుర్రాలు కష్టపడేవి. ఆబళ్ళను త్రోస్తున్న మాకుకూడా అంతకంతకు శ్రమ హెచ్చుతూ వచ్చింది. చివరకు మాశిబిరంయిక పది కిలోమీటర్లున్నదనగా ఒక్కఅడుగుకూడా ముందుకుపడలేదు. మావెనకనుంచి ఖైదీల అరుపులు అంతకంతకు ఎక్కువౌతూ వచ్చాయి. ఆకలికి తాళలేక, మమ్మల్ని వెంబడించక తప్పింది కాదు వాళ్ళకి. రక్తదాహం, ప్రతీకారదాహం హెచ్చిపో తోందివారికి. అంతకంతకు మమ్మల్ని సమీపిస్తున్నారు.

వెళియోలీకి ఉన్నట్టుండి ఒక ఆలోచన తట్టింది.— ఖైదీలు బాగా సమీపించేవరకూ వూరుకొని, వచ్చినతర్వాత మర తుపాకులతో మట్టుపెట్టాలన్నారు. అంతా నేలకూలినతర్వాత శిబిరానికి తిరిగివచ్చి మరొకదిశగా ప్రయాణం సాగించా లన్నాడు. ఈపద్ధతి నాకెంతమాత్రం నచ్చలేదు. పైగా మేగియాకూడా సమయానికి జ్ఞప్తికివచ్చింది. ఏమైనాసరే, వాళ్ళమీదకు తుపాకీ యెత్తకూడ దనుకున్నాను. వెంటనె నాతుపాకీనితీసుకొని వాళ్ళల్లోంచి చెదిరిపోయి అడవినిపడ్డాను. అంతకన్న వేరొక ఉపాయం దొరకలేదు నాకు.

నేను పోయిపోయి తిన్నగాఒకకొండ నడిమిభాగం చేరు కున్నాను. క్రిందనుండి అరుపులూ, మూలుగులూ, హాహా కారాలు, తుపాకీకాల్పులూ వినిపిస్తూవచ్చాయి. వెళియోలి తనబలాన్ని అర్ధచంద్రాకారంగా యేర్పడమని ఆజ్ఞాపించాడు, ఎవరో మహాశత్రువు మీదకు యుద్ధసన్నద్ధడౌతున్నట్లు. ఖైదీలుచెట్లలో కనపడగానే మొదటికాల్పులు వారిగమ నాన్ని నిరోధించాయి. అది కొన్నిక్షణాలుమాత్రమే. మళ్ళీ

వాళ్ళు ముందడుగువేశారు. కాని, అడుగడుగునకూ నూరేసి మంది నేల పాలయ్యేవారు. కొద్దిసేపట్లో మానవ కంకాళాలతో నిర్మించబడిన రత్నకంబళం నేలపై పరచినట్లనిపించింది. కాని, ఆరత్నకంబళంమీదనుండే వెనకనున్నవారు వీరావేశంతో ముందుకు తోసుకు వస్తున్నారు. కొందరు తగిలిన గాయాలతో పడిపోయారు. కాని, మళ్ళీలేచి చేతులమీద, మాకాళ్ళమీద ఆహారశకటాలు తమరిని యీడ్చుకుపోతున్నట్లు ముందుకు సాగుతున్నారు. చావంటేవారికి భయం పూర్తిగాపోయింది. చివరకు వెళియోలీ అతని అనుచరులూ నిలుచున్న చోటికుదికి వారినీ, తుపాకులనూ తమపాదాలక్రింద అణచేశారు. కాల్పులాగిపోయాయి. క్షణంలో బళ్ళలోవున్న యావత్తు అహారసామగ్రి మటుమాయమైంది. వెనకనుండి మరోకొందరు ప్రాకుతూవచ్చి గుత్తాలనుపట్టి చేతులతో చీల్చి, ముక్కలుముక్కలక్రింద నమిలేస్తూ వచ్చారు.... నేను బీడు భూముల్లోకి అదృశ్యమైపోయాను.

పీటర్ నావికోఫ్ అనే నేను మరొకఅద్భుతాన్ని సాధించాను. చవిటినేలల్లో ప్రయాణంచేసి, చావకుండా బ్రతికేవుండడం సామాన్యమా? రేపటిరోజున నేను కాగోచాచేరి మేరియాను కలుసుకోవలసింది. కాని, కాగోచా యిక యిరవై కిలోమీటర్లకన్న హెచ్చుదూరం లేదనగా వ్యూదేహీ జాతివేటగాళ్ళను కలుసుకొనడం తటస్థించింది. వారు నన్ను పట్నంలోకి వెళ్ళవద్దని హెచ్చరించారు. బొగ్గుప్రదేశాన్నుండి వచ్చేవారినందరినీ— వారుఖైదీలైనాసరే, రక్షకభటులైనా

సర్జే యెవరైనా సరే—ప్రాణాలతో బయటపడకుండా తుడిచి వెయ్యాలని మాస్కో నుండి వుత్తరువులు వచ్చాయట.

ఆవేటగాళ్లలో ఒకడు కాగో చాలో వున్న మేరియాకు నాసం దేశాన్ని తీసుకువెళ్ళడాని కంగీకరించాడు. సాయంకాలా నికి ఆమె సమాధానాన్ని కూడా తీసుకువచ్చాడు.

మేరియా నిర్ణయించిన సాంకేతిక స్థలం చేరడానికి నాకు మూడు రోజులు పడుతుంది. కాని, సైబీరియా తీరానికి దూరంగా ఉన్న కుష్ఠురోగుల ద్వీపానికి వెళ్ళి జీవిత శేషం గడపదలచుకు న్నానని నేనామెతో యేవిధంగా చెప్పగలను? కాని, సత్యాం తరం లేదన్న సంగతి మేరియాకు మాత్రం తెలియదా? ఐతే వెశియోలిశిబిరంలో ముళ్ళకంచెలోనున్న వారి దుస్థితికి మాత్రం నే నెంతమాత్రం జారిపోను.

అమ్మా! ఇంతకన్న నన్నేంచెయ్యమన్నావు?. నువ్వూ, మేరియావున్న ప్రపంచానికీ నాకూ సంబంధం లేదింక.

* * * *

చదవడం ముగించిన తర్వాత చాలసేపటివరకు మార్క్ ఆలోచనా సముద్రంలో మునిగిపోయాడు. నదిలో నడుస్తున్న నావచేసే చిరుతధ్వనులకు అతనికి మళ్ళీ స్పృహవచ్చింది. తన పీటర్‌ను కలుసుకోనడానికి మేరియావస్తోంది.. మార్క్ తొందరగా నోటుబుక్కును చెట్టుకు పెట్టేసి, తను వెళ్ళి పక్క నున్న గుబురుల్లో పొంచివున్నాడు. మేరియా నావలోంచి దిగి మెల్లగా "పీటర్ . . .పీటర్, ఎక్కడున్నావు పీటర్?" అంటూ బెదరుచూపులతో పిలిచింది. జవాబు లేదు.

అధ్యాయం ౬

## "నేనురాను; నాస్థానం యిక్కడేవుంది!"

కమ్యూనిస్టుసూత్రాల ననుసరించడంలోనేమి, వాటిని అమలులో పెట్టడంలోనేమి నిర్లక్ష్యంగా ప్రవర్తించాడనే అంశ మార్క్ సురోవ్ పై వెయ్యడం యేమాత్రమూ సాధ్యపడేదికాదు. అతడు పటాలం పెంపుడుకొడుకు; కమ్యూనిస్టు సువార్తను బోధించిన ప్రబోధకుడు; పదమూడుసంవత్సరాల ప్రాయంలోనె మరణశయ్యపై నున్నవానికి కమ్యూనిస్టు బైబిల్ ను వినిపించాడు.

ఇంతచేసినా అంశ పడకపోలేదు. కమ్యూనిస్టు పార్టి దూరప్రాచ్య ప్రాంతీయకమిటి మార్క్-సురోవ్ ను మందలించింది. అది ఓటింగుకు సంబంధించిన విషయం.

ఎలా జరిగింది?

సోవియట్ రాజకీయ విధానంలో ఒకే ఒకపార్టీ కమ్యూనిస్టుపార్టి. అందువల్ల వ్యక్తికి యెన్నికలలో ఓటింగు హక్కువున్నదా లేదా అనే ప్రసక్తిలేదు. కాని, ఆ హక్కు మాత్రం చాలముఖ్యమైనహక్కు. దానిని వ్యక్తికి లేకుండాచేస్తే ఆ చేసినవాడు ప్రజాస్వామ్యానికి గర్భశత్రువుగా పరిగణింపబడతాడు. ఉన్నతపదవుల నందుకునే అవకాశాన్ని గోల్పోతాడు. తనకూ, తనకుటుంబానికీ చాలినంత ఆహారాన్నిపొందే హక్కునూ, పిల్లలను పాఠశాలకు పంపేహక్కునూ, యింకా యెన్నెన్నో హక్కులను గోల్పోతాడు. ఈహక్కుల నన్నింటినీ గోల్పోవడమే కాకుండా, ఒరులెవ్వరూ చెల్లించ నంతటి

అత్యధికపన్నులను చెల్లించాలి. ఒక్కొక్కప్పుడు, జైలుప్రవా
సం, నిర్బంధసేవ కూడా తప్పవు. అవి తప్పాలంటే తనదన్న
సర్వస్వాన్ని వదలుకోవలసి వుంటుంది.

ఈవిధంగా ప్రభుత్వం తనలక్ష్యాలలో రెండింటిని — ఒకటి, సమిష్టికమతాలలో చేరమని రైతాంగం మీద ఒత్తిడి తేవడం; రెండు, గనుల్లోంచి బొగ్గును త్రవ్వడానికీ, అడవులలో చెట్లను నరకడానికీ, రోడ్లను నిర్మించడానికీ కార్మికుల నేపేరుతో బానిసలను సమీకరించడం. ఈ రెంటి సముపార్జనను ఉపయోగించే ఆయుధాలలో ఓటింగు హక్కును యివ్వడంకాని, ఉపసంహరించడం కాని ఒకటి.

ఐతే, యీహక్కులను యిచ్చేవారు, యిచ్చినదాన్ని ఉపసంహరించేవాడు మాత్రం యెవరో బోధపడడంలేదు. ప్రభుత్వమా? పార్టీయా? ప్రభుత్వమైతే అందులో యేశాఖ యీ అధికారాలను చలాయిస్తున్నట్లు? కాదు, పార్టీ అనుకుంటే అందులో యేవిభాగం?

మార్క్ ఖబ్రావస్క్ వచ్చినప్పుడు అక్కడున్న ఒకటిన్నర మిలియను జనాభాలో అరమిలియను జనాభాను — అంటే మొత్తం జనాభాలో మూడింట ఒకవంతుమందికి ఓటింగు హక్కు లేకుండా చేశారు. అంటే, "ఓటరులు కానివారు" అన్న పట్టికలో చేర్చబడ్డారు.

పీటర్ నోవికోఫ్ డైరీ చదివిన అనంతరం కొత్త యెన్నికలు జరగబోయేముందు వోటింగు హక్కు యెవరికి లేకుండా చెయ్యబడిందో వారినిగురించి పైకి తెలియజెయ్యడానికి రీజినల్ కమిటి వారి అనుమతికి వ్రాసి సంపాదించుకున్నాడు మార్క్ సారోవ్.

తన నివేదికను పరిశీలిస్తున్న కమిటి యెదట మాట్లాడుతూ "కామ్రేడ్స్, మీసూచనలప్రకారం యెన్నికలహక్కు గోల్పోయినవారి పట్టికను నేను పరిశీలించాను . . .అటువంటి వారు అరమిలియనువరకూ వున్నారు. ఎవరైతే యీ పట్టికలో చేర్చబడ్డారో వారు ప్రజా శత్రువుగా పరిగణింప బడిపోతారుగదా! ఒకటిన్నర మిలియను జనాభాగల రాష్ట్రంలో అరమిలియన్ జనాభా ప్రజాశత్రువు లెలా కాగలరో నాకర్థం కావడంలేదు. ఇదిచాల అసంభవంగా నాకు తోస్తోంది. మనకు క్లిష్టసమస్యలేవైనా యెదురైనప్పుడు, కష్టకాలం దాపురించినప్పుడు ప్రజల నడగండి.వారి తెలివితేటల నుపయోగించుకోండి, వాటిపై ఆధారపడండి అని కామ్రేడ్ స్టాలిన్ మనకు బోధించాడు. కాబట్టి మనం సరాసరి కార్మికులనే అడుగుదాం, ఆ యా సంస్థలద్వారానే ఓటరుల జాబితాలను సవరించమని."

మార్క్స్ సూచనను కమిటీ వారంగీకరించారు. కార్మికులు స్వయంగా పట్టికలను పరిశీలించిన మీదట ఓటులేనివారి సంఖ్య అరమిలియనునుండి అరవైయేడువేల పేర్లకు కుదించ బడింది.

ఎన్నికలైన వెంటనే మార్క్సను కార్యాలయంలో ఒక వ్యక్తి కలుసుకున్నాడు. అతని పేరు కామ్రేడ్ యుర్ఘుని—జి. పి. యు ఉన్నతాధికారి.

"ఓటర్ల జాబితాను సవరించడాన్ని గురించి మళ్ళీ ప్రస్తావిస్తున్నాను" అన్నాడు యుర్ఘుని. "ఒక పెద్దపొరపాటు జరిగిపోయిందని మీరు భావించడంలేదా, కామ్రేడ్ సరోవ్?"

"లేదు, కామ్రేడ్ యుర్ఘుని; నేననుకోనడంలేదు. ప్రజలే స్వయంగా సంఖ్యను బాగాతగ్గించి ప్రభుత్వం చేసినపనినిచాల వరకు సవరించారన్న సంగతి మీకు తెలిసినదేకదా!"

"ప్రజలప్రస్తావన తెచ్చినంతమాత్రాన మీ బాధ్యత తీరిపోదు కామ్రేడ్ సురోవ్." అన్నాడు యుర్ఘుని "పార్టీ చేసినపనిని పరిష్కరించగల ప్రజలెవరో పరిశీలిద్దాం"

"పార్టీచేసినపనా" అని ఆశ్చర్యంగా అడిగాడు సురోవ్ మార్క్.

"మొదట తయారైన జాబితా ప్రభుత్వపరిపాలనా శాఖ వారిచే తయారు చేయబడిందికాని, పార్టీచేకాదు."

"కాని, ఆరెండింటికి భేదమేమిలేదు; ఎంతమాత్రంలేదు పార్టీ అంటే ప్రభుత్వం పార్టీఅంటే మేమే."

"నాకు తెలిసినంతవరకు మీరు జి. పి. యు. అంటే పార్టి లో ఒక ఉపాంగం."

యుర్ఘుని యేదో ఆలోచిస్తున్నట్టు ఒక్కక్షణం ఆగి, అసాధారణ సరళకంఠంతో అన్నాడు;

"సూత్రప్రాయంగా మీరన్నది నిజమేననుకోండి. జి.పి.యు అంటే పార్టీకాకపోయినా పార్టీచేతిలోని ఒక ఆయుధం. మీరుచేసినపనిని యీవిధంగా యెంతమాత్రం సమర్థించుకోలేరు"

"నాపనిని సమర్థించు కొనడానికి నేను ప్రయత్నించడం లేదు, పార్టీసూచనల ప్రకారమే నడచాను, నేను."

"ఆసూచనలు మారాలి"

"ఇంతవరకూ మారలేదు కాబట్టి ఉన్నవాటినే అనుసరించాను" అన్నాడు మార్క్. అంతటితో సంభాషణసమాప్తమైంది.

వారంరోజుల అనంతరం మార్క్ ప్రాంతీయకమిటికార్యదర్శి అయిన వావిలాల్‌ను చూడడానికి వెళ్ళాడు.

"పార్టీకమిటివారు నాపైని ఆంక్షవేసినట్లు యిప్పుడే విన్నాను. నిజమేనా?" అని అడిగాడు మార్క్.

"నిజమే"

మార్క్ ఆక్షేపణను పూర్తిగా, ప్రశాంతంగా, విన్న తరవాత, వావిలావ్, స్థానిక జి. పి. యు. నుండి తనకందిన ఒక జాబును పైకితీశాడు ఓటర్ల జాబితాను తయారు చేయడంలో, జి. పి. యు వారు తీసుకునేచర్యలలో జోక్యం కలిగించుకుంటున్నందుకు మార్క్ సురోవ్ శిక్షింపబడాలని ఆవుత్తరంలో వుంది. "పార్టీనుండి తొలగింపబడిన తరవాత అతడు తనవైఖరికి సంజాయిషీ చెప్పుకోవలసివచ్చేటట్టు జి. పి. యు చర్య తీసుకుంటుంది." అన్నవాక్యంతో ఆవుత్తరం సమాప్తమైంది. క్రింద యుర్యుని చేవ్రాలుంది.

ఆటుతరవాత మార్క్‌కు వావిలోవ్ మరొకలేఖ నందించాడు.— అది కమిటీవారిచ్చిన సమాధానం. "మార్క్ సురోవ్ పార్టీలో అతిపిన్నవయస్కుడు, అన్నవంశాన్ని పురస్కరించుకొని......పార్టీఅనుభవం తగినంత లేనందువల్ల యీపొరపాటు జరిగివుంటుందని భావించి, అతనిపై శిక్షను పార్టీ ఆంక్షకు పరిమితం చెయ్యడానికి ప్రాంతీయపార్టీకమిటి నిర్ణయించింది."

"చూడు, మార్క్, మేమీచర్యను తీసుకొనివుండకపోతే వ్యవహారాన్నంతనూ యురుషుని స్వయంగా పరిష్కరించుకుని వుండేవాడు. అప్పుడు పరిస్థితులు నీపట్ల మరీ ప్రతికూలంగా పరిణమించియుండేవి. మేము చేయగలిగినంత మేలును నీకు చేశాం, దాన్నలా వుంచు. ఈరోజుల్లో మనం సమయాసమయాలను బట్టి మసలకపోతే చిక్కులకు లోనుకావలసి వస్తుంది. ఎప్పుడూ, ముక్కుసూటిగా వెళ్ళి లాభంలేదు. సూటిగా వెళ్ళడానికి వీల్లేనప్పుడు అవసరాన్నిబట్టి మళుపులు కూడా తిరిగి వెళ్ళవలసి వుంటుంది. అర్థమైందా మార్క్? నేను యేనాడో గ్రహించాను, నువ్వు చాల అభిమానవంతుడవనీ, ఉన్నది ఉన్నట్టుగా దాపరికం లేకుండా పైకి అనేసేవాడివనీని. నీకు ఎదురు బెదురుఅనేవి లేవని నాకు బాగా తెలుసు."

"నా దేశంలో నాకు బెదురెందుకు?"

"నిజమేననుకో. కాని, మన దేశం వెనక కాళ్ళమీద లేచే గుర్రంవంటిది. అది తన్నేటప్పుడు తనపిల్లలున్నా గమనించదు. నేనుమాత్రం పరాయి దేశంలో వున్నానా? లేకపోతే మాత్రం? నేనెంతో భయపడుతూంటాను..." తాను చాల మితిమీరి చర్చలోకి దిగినట్లు గ్రహించాడు, వావిలోవ్; నోటినిమూసుకుని తలవూపాడు. "శలవు" అన్నట్టుగా గొణిగాడు వావిలోవ్. మార్క్ నిష్క్రమించాడు.

ఒకనాటిరాత్రి చాల ప్రొద్దుపోయాక వావిలోవ్ కార్యాలయంనుండి మార్క్‌కు పిలుపువచ్చింది. అప్పుడు వావిలోవ్ జి. పి. యు దూరప్రాచ్య ప్రధానప్రతినిధితో మాట్లాడుతున్నాడు. స్టాలిన్ ఆజ్ఞలమేరకు రైతాంగాన్ని యేవన్నందిని

సమిష్టివ్యవసాయ కమతాలల్లోకి తోలడానికి యితడు నియమింపబడ్డాడు. ఈయనపాలన క్రిందనున్న ప్రాంతీయ రైతాంగాన్నుండి నూటికి తొంభై యేడుమందిని సమిష్టివ్యవసాయ కమతాల్లో చేరడానికి ఒప్పించబడ్డారని మూస్కోకు తెలియచెయ్యవచ్చునని అంటున్నాడు వావిలోవ్.

డోరినాన్ మార్కొవైపు తిరిగి :

"నిన్ను జి. నదీ మండలానికి, కామ్రేడ్ బయూంకో సహాయానికి పంపవలసిందిగా కామ్రేడ్ వావిలావ్‌ను అడుగుతున్నాను.. ఎగుమతికి కలపను సిద్ధం చెయ్యవలసిందిగా కామ్రేడ్ స్టాలిన్ కామ్రేడ్ బయూంకోకు స్వయంగా ఆజ్ఞాపించాడు. కొంతకాలంపాటు ఆయనకు నీ సహాయం చాలా అవసరమని మేము భావిస్తున్నాం; అదీసంగతి."

మార్కొను జీ నదీజిల్లాకు తీసుకునివెళ్ళుతున్న ట్రక్కు అతణ్ణి ఖొలొర్ని దగ్గర దింపింది. అక్కడ చిన్న బంగారు కేంద్రం నిర్వహింప బడుతున్నది. ఆ గని డైరెక్టరు సురోవ్ కోసం యెదురుచూస్తున్నాడు. "కామ్రేడ్ సురోవ్!" అని సంబోధించాడాయన "మీరిలా వెడతారనీ యీ రాత్రికి యిక్కడ గడపుతారనీ నాకు వార్త అందింది. మిమ్మల్ని అతిథిగా గౌరవించడం నాకు చాలా ఆనందంగా వుంది. కామ్రేడ్ బయూంకో యిక్కడికి పదిహేనుమైళ్ళ దూరంలో వున్న కలప డిపోల కేంద్ర కార్యాలయానికి వెళ్ళారు. మిమ్మల్ని రేపటిరోజున అక్కడికి తీసుకువెడతాం. ఇచ్చటిపరిస్థితు లంత బాగా లేవు." అంటూ సంభాషణ సాగించాడాయన. "గని

త్రవ్వకం ఖైదీలతో చేయిస్తున్నందున మా కుటుంబాల నన్నింటిని యిక్కడినుండి పంపించివేశాం. గనిని చూస్తారా?"

మార్క్ డైరక్టరు వెంట బయలుదేరాడు శిబిరంచూడడానికి. తన అనుభవంలో యిదె ప్రథమం, మార్క్ ఆడఖైదీలు శరీరకష్టం చేస్తూంటే చూడడం. ఆ పనిచేసేవారిలో ఒక్క రైతుజనమూ, పాటకప్రజనమే కాదు, మధ్యతరగతి జనం కూడా వున్నారు. ఉపాధ్యాయులు, డాక్టర్లు మొదలైన పట్నవాసులూ ఉన్నారు. ఒకప్పుడు మాస్కో విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేసిన బొరొడిన్ కూడా వున్నాడు.

తిరిగివచ్చేటప్పుడు డైరెక్టర్ మార్క్‌తో "ఎవరైనా బొగ్గుగనుల ప్రాంతంలో సంచరించారంటె, నిబంధనలననుసరించి, స్థానిక జి.పి.యు అధికారి రజీన్ అనుమతి పొందడం అవసరం, కాని, అది లాంఛనప్రాయమె లెండి" అన్నాడు డైరెక్టరు. కామ్రేడ్ రజీన్ మిమ్మల్ని ట్రక్కులో యిక్కడికి తీసుకు రమ్మనమని ఆజ్ఞాపించినందున మీరు వచ్చినట్లు ఆయనకు తెలియడం అవసరం. అయినా, ఆచారాన్ని పాటించాలిగా."

డైరెక్టరు తిన్నగా తనకార్యాలయానికి వెళ్ళిపోయాడు. మార్క్ రజీన్ గృహాభిముఖుడయ్యాడు.—ఖైదీల బారకీసులకు అనతిదూరములో, చూడటానికి అందముగావున్న చిన్నయిల్లు రజీన్ నివాసం. లోపల అంతా నిశ్శబ్దంగావుంది. ఎవరూవున్న సందడిలేదు. సింహద్వారం తెరచి పిలిచాడు.

"ఎవరు లోపల?"

లోపలనుండి ఒక స్త్రీ కంఠం జవాబిచ్చింది

"రండి...క్రామేడ్ సురోవ్"

కంఠం ఆశ్చర్యాన్ని కలిగించేటంత పరిచితముగావుంది; కాని, యెవరో చూడటానికి వీల్లేనంత చీకటిగా కూడావుంది ఆప్రాంగణం. ఆ స్త్రీ వ్యక్తి వెంట ఆప్రాంగణంగడచి అంతకన్న విశాలంగావున్న మరొక గదిలో ప్రవేశించాడతను. పలచని దేహం, కృశించిపోయిన ముఖంగల ఒక స్త్రీమూర్తి అతనికి కనుపించింది. రక్తవిహీనమూ, కళావిహీనమూ అయిన ఆమెపెదవులు అతికష్టంమీద చిన్నచిరునవ్వుగా మెలికలు తిరిగాయి; తెల్లకలువలవలె విశాలంగా నున్న ఆమెకన్నులు అతనిపై దృష్టిని కేంద్రీకరించాయి. ఆచూపులు అతనినేదో ప్రశ్నిస్తున్నట్లనిపించింది.

"వీనా!"

ఒకళ్ళనొకళ్ళు నిశ్చేష్టులై చూసుకుంటూ నిలబడిపోయారు. సంభాషణను యేవిధంగా ప్రారంభించాలో, యెవరుముందు ప్రారంభించాలో వారికి తోచడంలేదు. ఆమె నల్లటిదుస్తులను ధరించి పొట్టిజాకెట్టుతో దుక్కనివుంది, దేశవాళి పాదరక్షలు మాత్రం ఆమెపాదాలను కప్పివున్నాయి. కుదురుగా, బిగుతుగా, నిండుగా. ఒకప్పుడున్న ఆమెవక్షోజాలు యిప్పుడు యెందరో పిల్లలనుగన్న తల్లిపక్షోజాలవలె సడలివున్నాయి. కన్నులలో నీరు నిండుతోంది. ఏదో మాటాడడానికుద్దేశిస్తున్నట్లుగా ఆమెపెదవులు స్పందిస్తున్నాయి. ఎంతో కష్టంమీద మాటలు బయటపడుతున్నాయి.

"ఔను...నేనే...ఎరుగుదును .. నువ్వొస్తున్నావని . నీ కొరకె యెదురు చూస్తున్నాను మార్క్ సురోవ్."

"వాళ్ళేంతపనిచేశారు, నీకు" అని భోరున యేడ్వసాగాడు మార్క్; "లీనా, యిక్కడ యేంచేస్తున్నావు, నువ్వు?"

"రెండు సంవత్సరాలు కాన్‌సన్‌ట్రేషన్ కాంపుల్లోగడిపాను"......నన్ను గుర్తించి పలకరించడం నీకిష్టం లేదనుకున్నాను......"

ఈసారి ఆమె యేడ్వడం ప్రారంభించింది. సోఫా అంచున కూర్చొని బరువెక్కిన ఆమెతలను అతని గుండెలమీద ప్రేలాడుతోంది. మార్క్ ఆమెప్రక్కన కూర్చొని ఆమెమోకాలిమీద తనచేతినాని "చెప్పులీనా, యిక్కడికి నువ్వెలావచ్చావు? అదియెలా తటస్థపడింది?" అని ప్రశించాడు.

చివరకు యెలాగో ఉన్నదుఃఖాన్ని మ్రింగి లేని నవ్వు తెచ్చిపెట్టుకొంది. "అంతా యెలావచ్చారో నేనూ అలాగే వచ్చాను అన్నదామె. తనసోదరుడైన ఒకపూర్వ కాలపు బోల్షివిక్ విప్లవకారుడు యేవిధంగా అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయ్యాడో, చివరకు యేవిధంగాపట్టుబడి కాల్చివెయ్యబడ్డాడో మొదలైన యెన్నెన్నో విషయాలను వినిపించింది లీనా. అట్టి పరిస్థితులలో ఆకుటుంబంలోనున్న వారందరిమీద అనుమానం కలగడం ఆశ్చర్యంలేదు. లీనాను సైబీరియాకు పంపేశారు. ఈగనికిరావడం ఆమె జెయిలుయాత్రలలో అయిదవమజిలి అన్నమాట. ఆమెను సరిగ్గావిచారించిందీలేదు, ఇంతకాలమూ శిక్ష అని నిర్ణయించిందీలేదు.

"ఈశిబిరంలో బ్రతికేవుండాలంటే, జీవితంకోసం తెగించి పోరాడాలి" అన్నది లీనా; అది స్త్రీకి సాధ్యంకానిపని. అందుచే, స్త్రీలు యెవరికిష్టమైనవారినివారు తమరరక్షణకు

యెంచుకున్నారు. ఏ స్త్రీకైనా రక్షకుడనేవాడు — అత డొక ఆఫీసరైనాసరే, చివరకు వంటలవాడైనాసరే—దొరకక పోతే, ఆ స్త్రీకి కఠినమైన పనులుచెప్పి, హిమప్రదేశాలకు చాకి రీకివంపేస్తారు. అందుచే, స్త్రీలు, నువ్వా, నువ్వా, అని ప్రతి పురుషుణ్ణి రక్షణనర్థిస్తారు. ప్రేమబిక్షకు దేవిరిస్తారు. వీనా కూడా అదేమార్గాన్ని అనుసరించింది.

"రజీన్ నాకు యీశవవాడు" అన్నది ఆమె, ఆమాటవిని భయంతో కొంచెంమెడంగా తొలగిన మార్క్, ఆమె కన్ను లలోనుండి వెలువడుతున్న నిర్లక్ష్యపుచూపులు పూర్వంవలెనె సవాల్ చేస్తున్నాయి, ఏంచెయ్యమన్నావు? అన్నట్టుగా. "నాకు తెలుసు అదెంతభయానకమైనపరిస్థితో; నన్ను కాని, నా తోటి స్త్రీలనుకాని అందుకునిందించి యేమిప్రయోజనం? మాకూ బ్రతకాలనేవుంది."

ఎవరో లోనికివస్తున్నట్లు అలికిడిఅయింది. వెంటనే లీనా లేచినిలుచుని "రజీన్‌వస్తున్నాడు, అతనికి నేనిక్కడ కనబడ కూడదు; కాని, విను మార్క్, ఒక్కపనిచేస్తానని నాకు వాగ్దానంచెయ్యి. రాత్రి యిక్కడకాని, డైరెక్టర్‌తోగాని గడపకు. ప్రక్కగ్రామానికి వెళ్ళు. ఎడమవైపున మూడో గుమ్మాన్నితట్టు. ఖాలిన్ యెక్కడఅని అడుగు. వాళ్ళు నీకోసం నిరీక్షిస్తూవుంటారు"

"ఎవరు నిరీక్షిస్తూవుంటారు?"

ఇక ఆమెమాట్లాడలేదు, తొందరగా గదినివిడిచి వెళ్ళి పోయింది. బయట హాల్లో రజీన్ తనదుస్తులను తీసివేస్తున్న

ధ్వని వినిపించింది. "లీనా, యెక్కడవున్నావు?" అన్నమాటలు మొరటుగా మార్క్ చెవినిపడ్డాయి.

తలుపు తెరుచుకొని రజీన్ లోనప్రవేశించాడు. అతడుదీర్ఘకాయుడు, సుమారు నలభై సంవత్సరాల వయస్సుంటుంది. ఆయన నోరు స్టాలిన్ మీసాల అడుగున మరుగుపడివుంది. నల్ల వెంట్రుకల మధ్యనుండి అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు మాకుకూడ స్థానంవుందన్నట్టుగా తొంగి చూస్తున్నాయి. ముక్కుకు ఒకవంపు అనేది లేకుండా బల్లపరుపుగా వుండిపోయింది. అతణ్ణి కలుసుకొనడానికని మార్క్ లేవగానే రజీన్ అతణ్ణి క్రీగంట తీక్షణంగా చూశాడు.

"నాకోసం మీరు స్టేషనుకు ట్రక్కు పంపించినందుకు కృతజ్ఞత తెలుపుదామని యిప్పుడేవచ్చాను." అన్నాడుమార్క్.

ఆమాత్రానికి కృతజ్ఞత తెలపడం దేనికి? అని ఒక్క ఉరుము ఉరిమాడు రజీన్. "మీ అధికారి క్రామేడ్ బయూంకో పంపించమన్నాడు; పంపించాను."

"క్రామేడ్ బయూంకోను కలుసుకొనడానికి నేను రేపు యెలా వెళ్ళాలో చెప్పగలరా?"

"అదేమంత కష్టంకాదు; నేనొక కారు యేర్పాటుచేస్తాను. ఇప్పటికి నీదుస్తులు తీసెయ్యి. కొంచెం ఆహారం తీసుకొందువుగాని."

"మీ ఆదరణకు అనేక ధన్యవాదాలు. కాని, ప్రక్కవూళ్ళో నాకు కొంచెం పనివుంది; తొందరగా వెళ్ళాలి. మీ కభ్యంతరం లేకపోతే, ఆకారును రేపు తెల్లవారుఝామున ఆ

గ్రామానికి పంపిస్తారా, అక్కడనుండి ప్రయాణం సాగించేందుకు?"

"తప్పకుండా," అన్నాడు రజీన్. "కాని, ఆ గ్రామం వెళ్ళాలంటే చాలదూరం నడవాలి. అప్పుడే చీకటికూడా పడుతోంది. మా డ్రైవరును పిలుస్తానుండు కారుతీసుకురమ్మనమని" అంటూ డ్రైవరుకు కబురుచేశాడు.

ఊరి పొలిమేరలను జేరుకోనగానే మార్క్ కారును ఆపి, తాను దిగి, కారును వెనక్కు వెళ్ళిపొమ్మన్నాడు. అప్పటికి బాగా చీకటిపడింది. కొన్ని గవాక్షాలనుండి సన్నని వెలుతురు బయటకు వస్తోంది. ఎడమవైపున మూడవగుమ్మం—ఒక చిన్న పూరిల్లు. దానికి రెండేరెండు కిటికీలున్నాయి. ఆ రెండు కిటికీల తలుపులూ మూయబడేఉన్నాయి. అతనింకా పిలుద్దామని అనుకుంటూవుండగానే, తలుపు తెరచుకుంది.

"లోపలికిరా" అనిపిలచింది ఒక కంఠం.

"ఖానిన్ యిల్లుయిదేనా?" అని అడిగాడు మార్క్.

"నేనేఖాసిన్" అన్నదావ్యక్తి "లోపలికిరా!" ఇంకెవరు మార్క్ ముందుకు సాగడానికి దారియిస్తారీ విధంగా?

అపరిచితగృహంలోకి, నిర్జనప్రదేశములో, తెలియనివూళ్లో, రాత్రివేళ, ఆవిధంగాప్రవేశించడం యెంతప్రమాదమో మార్క్ కు తెలియకపోలేదు. ఐతే, లీనాలో అతనికి పరిపూర్ణమైన విశ్వాసంవుండడంచేతనే అతనా యింటిలో నిర్భయంగా ప్రవేశించాడు. మోటుగానున్న ఒకబల్లదగ్గర తనవయసువాడే ఒక యువకుడు కూర్చొని వుండడంచూశాడతడు.

"నన్ను గుర్తించావా, కామ్రేడ్ సురోవ్?"

మార్క్ అలాగే విగ్రహంలా నిల్చుండిపోయాడు. ఆశ్చర్యచకితుడై తానెక్కడున్నదీ, యేమిచూస్తున్నదీ గ్రహింపలేని స్థితిలో ఉండిపోయాడు.

"అలెగ్జాండర్!"

"ఐతే, నువ్వునన్ను గుర్తించావన్నమాట!"

అలెగ్జాండర్ ముఖంలో మందహాస రేఖలు గోచరించాయి, మార్క్ అతణ్ణి భుజాలపై అదిమిపట్టి "నువ్విక్కడికెలావచ్చావు? అసలు నువ్వేనా అని నాసందేహం!"

మార్క్ మాస్కో విశ్వవిద్యాలయములో చదువుతున్నప్పుడు అలెగ్జాండర్ అక్కడ చదువుతూండేవాడు. మార్క్ కంటె అతడు రాజకీయాల్లో తక్కువ శ్రద్ధానక్తులు కనబరచేవాడు. దానికికారణం వేరేవుంది. అతనికి సాహిత్యం మీద అభిమానం మెండు. అందులోనూ, పద్య కావ్యాలంటే చెవి కోసుకునేవాడు. స్వతఃగ శాంతిప్రియుడు కావడంచేత యూరా మార్క్ లిరువురు వాగ్యుద్ధంలోకి దిగితే తాను పరిహాసంలోకి దింపి నవ్వించేవాడు. అప్పట్లో, ఉన్నట్లుండి, అలెగ్జాండర్ హఠాత్తుగా మాయమయ్యాడు. విశ్వవిద్యాలయ జీవితాన్ని గురించి యెంతో ముచ్చటపడే కథానికారచనకు పోటీ యేర్పాటు చేశాడతడు. ఎందరో విద్యార్థులు పోటీలో పాల్గొన్నారు. కాని, అతడేప్రథమునుగా నిర్ణయింప బడ్డాడు. ఏమైతేనేమి, అతను వ్రాసిన వ్యంగ్యకథానిక ప్రభుత్వాన్ని అపహాస్యం పాలుచేస్తోందని ఉన్నతాధికారులు భావించారు. అతణ్ణి బందీగా తీసుకొని కాన్సన్ట్రేషన్ క్యాంపుకు పంపించారు.

వేళ్ళు చెదరకుండా కత్తెలనుకొట్టడం సాధ్యపడదనే తత్వాం కనిపెట్టి జాననిపించుకుంటున్న మార్క్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ వద్దకువెళ్ళి అలెగ్జాండర్ విషయం పునరాలోచించవలసిందిగా ప్రాధేయపడ్డాడు. కాని, లాభం లేకపోయింది.

"నేను సుఖంగా నేవున్నాను" అంటూనవ్వాడు అలెగ్జాండర్. తన పూర్వపువిశ్వాపిద్యాలయ సాహాథ్యాయున్ని పట్టులోంచి విడిపించుకొనడానికి అతడేమి ప్రయత్నించలేదు. "కాని నీ ఆవేశంలోమాత్రం అప్పటికీ యిప్పటికీ మార్పేమిలేదు, మార్క్. పిపిల్ చెట్టునున్న పండ్లను దులుపుతున్నట్టు దులిపేస్తున్నావు, నన్ను."

మార్క్ పట్టువదిలేశాడు. కాని, అలెగ్జాండర్ ఆతనిచేతిని దొరకపుచ్చుకొని పైకీక్రిందతూ ఊపుతూ "కొండను కొండ యెప్పటికీ సమీపించలేదు. కాని ఎప్పటికైనా మనిషిని సమీపించగలిగేది మనిషే."

"ఔనౌను, ఒకళ్ళనొకళ్ళు హింసించుకొనడానికి."

"కాని, మన యిద్దరికి సంబంధించినంతవరకు ఆపరిస్థితి యింతట్లోరాదు. నేనివాళ లీనాను కలుసుకున్నాను. ఆమెతో రజీన్ చెప్పాడట, క్రామేడ్ సురోవ్ అనే వాడెవరోవస్తున్నాడనీ అతణ్ణికలుసుకోవలసిందని వుత్తరువులువచ్చాయనీ. ఆమె నువ్వేననుకుందికాని మీరు అన్నదమ్ములెందరో తెలియకపోవడంచేత మళ్ళీ నువ్వు ఔనోకాదోఅని మాకు అనుమానం కలిగింది. నువ్వుచాలా పెద్దవాడవైనావనీ, ఉన్నతాధికారులలో ఒకడవైనావనీ, యీప్రాంతాల్లోనే యెక్కడో పనిచేస్తున్నావనీవిన్నాం. "బహుశః, నువ్వు కోపగించుకోవనుకుంటాను,

మార్క్" అంటూ తాపీగా ప్రారంభించాడు. "నిన్ను నమ్మవచ్చునో నమ్మకూడదో తెలియని పరిస్థితిలో వున్నాం. లీనా నీతో మాట్లాడిన తరువాత మేమిద్దరం కలుసుకున్నాం. నువ్వు పార్టీ మనిషివే అయినా, వెనకటికీ యిప్పటికీను వేమీ మార్పు లేదనీ, కించిదభిప్రాయభేదాలున్నా మనపూర్వస్నేహం వర్ధిల్లడానికి అభ్యంతరం వుండదని లీనా భావిస్తోంది. నాకూ అలాగే తోస్తోంది. కాని, నువ్వేమంటావు?

అలగ్జాండర్ మాట్లాడుతూంటే మార్క్ శాంతంగా వింటూ కూర్చున్నాడు. అతను మాట్లాడుతున్న కొద్దీ మార్క్ తల వ్రేలవెయ్యడం ప్రారంభించాడు. తదేకదృష్టితో బల్లపై చూడ్కులు నిగుడ్చాడు. తనమిత్రుడు మాట్లాడిన ధోరణినిబట్టి తననేదో అవమానించడానికే ఉద్దేశించినట్లు భావించాడు. కాని, అతడేమి అడ్డుచెప్పలేదు. భయంఅనేది మస్తిష్కంలోకి ప్రవేశిస్తే పిరికిపందలనుచేస్తుంది. ఒకణ్ణిచూసిఒకడు భయపడతారని మానవుని అభిప్రాయం. ఒకడుమరొకనికి ప్రమాదకరంగా పరిణమిస్తాడని మరొకఅభిప్రాయం. అందుకని, యెవరికివారే దూరదూరంగా వైదొలగిపోతారు. అలెగ్జాండర్ ప్రసంగం ముగించినతరువాత నిశ్శబ్దం ఏర్పడింది. చివరకు మార్క్ తేరుకొని "ఔను! నన్ను అనుమానించడంలో మీరుపూర్తిగా అన్యాయంగా ప్రవర్తించారని నేననలేను. ఐనప్పటికీ యెట్టి పరిస్థితులలోను మనమైత్రి భగ్నంకాదనీ, ఆమైత్రినిమనం యెన్నటికీనీ మరచిపోలేమనీ అంగీకరిద్దాం."

"అదె నీ అభిప్రాయమైతే"...... అని ఊరుకున్నాడు. అలెగ్జాండరు. ఎవరో యింటినిశమీపిస్తున్న సవ్వడివినవచ్చింది. ఎవరో తలుపుతట్టి. రెండుసార్లు బరికి మళ్ళీతట్టారు.అలెగ్జాండర్ తలుపుదగ్గరకు వెళ్ళాడు. తిరిగివచ్చి:

"మాట్లాడకు, మార్క్, ఉశ్వాసనిశ్వాసలు కూడా గట్టిగా రానివ్వకు. ఇదివరకు నీవారికడ్డువచ్చిన పశువొకడు మళ్ళీ యిప్పుడు సిద్ధమయ్యాడు" అని వెళ్ళి మళ్ళీవచ్చాడు.

ఈసారి అతనితో కూడా గొఱ్ఱెచర్మాన్ని దట్టంగా కప్పుకొన్నవ్యక్తి లోన ప్రవేశించాడు. అతను చాలపొడగరి కావడంచేత సింహద్వారం దగ్గర వంగి మరీలోనికి రావలసి వచ్చింది. ప్రవేశించినవ్యక్తి టోపి తియ్యగానె మార్క్ అతడిముఖాన్ని చూడగలిగాడు. కోలనైనముఖం, పొడుగ్గా, సూదిగాఉన్న ముక్కు; ప్రశాంతముగా పర్యాలోకించే నేత్రాలు యేదో పూర్వస్మృతిని జ్ఞాపకం చేస్తున్నాయి. ఎక్కడో, ఎప్పుడో మాత్రం స్ఫురణకు రావడంలేదు.

"ఒస్తాప్!" అంటూ వెనకాముందూ ఆలోచించకుండా అతణ్ణి ప్రత్యుద్ధానం చెయ్యడానికి ముందుకు అడుగు పెట్టాడు మార్క్. ఇతడికె ఒకప్పుడు మార్క్ తనగుర్రాన్ని బహూకరించాడు. వారిరువురు ఒక్కసారిగా గాఢాలింగనంలో వాల్తుకుపోయారు. అలెగ్జాండర్ వారి సరసను నిలుచుని యిరువురిని చేరి ఒకసారి వీపుపై తట్టుతూ సంతోషముతో

"స్నేహితుల పునస్సమాగమం అన్నమాట; అంతకన్న యేమని వర్ణించగలం దీన్ని!" అంటూ ఆనందభరితు డయ్యాడు.

ఈలోగా, వృద్ధుడైన ఖానిన్, వేగినమాంసాన్ని బల్లమీద వుంచాడు. ఒక గిన్నెలో రొట్టెలను కోసి ముక్కలుంచాడు. చిగురికి, ముసలితనముతో మూలుగుతూ. తన తలగడ క్రింద నుండి 'వోడ్కా' సీసానొకదాన్ని పైకి తీశాడు.

గంటలు ఒకటితరువాత ఒకటిగా కాలగర్భంలో కలసి పోతున్నాయి. అయినా, యెడమప్రక్క మూడవ యింటిలో దీపం యింకా వెలుగుతూనే వుంది మొదట ఒస్టాప్ తన ఆత్మకథను ప్రారంభించాడు 'ఆమ్నెస్టీ' అయిన అయిదు సంవత్సరాల అనంతరం ప్రభుత్వం తనవాగ్దానాలను నిలబెట్టుకోలేక అన్నమాటను త్రోసి రాజని గ్రామపెద్దలను యేవిధంగా కాల్చి చంపారో, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేరడానికి నిరాకరించిన వారినందరినీ ఓడల్లోయెక్కించి సైబీరియలో కాన్‌సన్ట్రేషన్ క్యాంపుకు యెలాచేర్చారో పూసగ్రుచ్చినట్లుగా యేకరువు పెట్టాడు. ఒస్టాప్ పలాయనానికి అలెగ్జాండర్ తోడ్పడ్డాడు. అప్పటినుండి వారు విడవకుండా కలిసేవుంటున్నారు, అంతావిన్నతరువాత ఘూర్క అన్నాడు :

"ఇప్పుడు నాకర్థమైంది నన్ను నమ్మడానికి మీరెందుకు భయపడుతున్నారో ... కాని, అన్నిటినీమించి మనం స్నేహితులం కదా! యిప్పటికె చాల క్లేశాలనుభవించడం . . . ఎక్కడపడితె అక్కడ రక్తం కాలువలు కట్టడం జరిగింది".

"అలాంటప్పుడు కమ్యూనిస్టు ఉద్యోగిగామాత్రం యెలా వుండగలవు?" అని నిలదీసి అడిగాడు ఒస్టాప్.

"నీకూ, అలగ్జాండరుకూ లేనాకు, మీబోటి లక్షోపలక్షల మందికీ అన్యాయం జరిగినంతమాత్రాన కమ్యూనిజం తప్పని

కాని, మా విశ్వాసం చెడ్డదనికాని, అనుకోనడానికి వీల్లేదు. మనం గ్రహించవలసింది, మనం రాజమార్గాన్ని వదలి దారీ తెన్నూ లేని అడవినిపడ్డాం, ఎక్కడచూచినా గాఢాంధకారమె అలముకొనివుంది. తప్పుదారిపట్టడం, తప్పులుచేస్తూండడం, పడుతూండడం అలవాటైపోయింది. అయినా, మనం పురోగమించక తప్పదు. దేవతలు మనకు దారిచూపించరు. వారు మాట్లాడడంలేదు. కాబట్టి మనిషే తనదారి తానుచూచుకోవాలి. మీరు మనదేశంలో జరిగేదాన్ని ద్వేషిస్తున్నారే కాని, దాన్ని భగ్నంచేసిన తరువాత దానిస్థానంలో దేన్ని సృష్టించుకోవాలో మాత్రం మీకు తెలియదు."

"ప్రతిదాన్ని సమర్థించుకోనడానికి ప్రయత్నించను; అలా అని ప్రతిదాన్నీ అంగీకరించనూ లేవు" అన్నాడు ఒస్టాప్ విచారంగా, "ప్రజలపై నెరపిన హింసాకాండను నీవుసమర్థిస్తావా? కాన్‌సన్‌ట్రేషన్ క్యాంపులు సమర్థనీయమంటావా? స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు గోరీకట్టారు; ఉచ్ఛ్వాస నిశ్వాసలకేనా స్వతంత్రంలేకుండా పోయింది మనిషికి, యీ దేశంలో.

"పొరపాటు" అన్నాడు మార్క్; నువ్వు చెప్పేదాంట్లో నేను అంగీకరించలేనిది చాలావుంది. అధికారలాలసత్వం ప్రజల తలకాయల్లో స్థానం యేర్పరచుకుంది; రంకెలువేసే పోట్ల గొడ్లుల్లా తయారై, తమకడ్డువచ్చిన వారినందరినీ కాళ్ళక్రింద తొక్కివేయ్యడం ప్రారంభించారు. హింసాకాండదినచర్యలో అంతర్భాగమైపోయింది; అత్యాచారాలు మితిమీరిపోయాయి;

ఇదంతా చేసింది కమ్యూనిజంకాదు; ప్రజలే. ప్రజలు బానిస వృత్తికి దిగజారిపోయారు. బానిసల నిఘంటువులో స్వతంత్రానికర్థం యితరులమీద అధికారం చలాయించడం. ఇంను మించు, మనమంతా బానిసలమే అనుకో.... నేనిదంతా చెబుతున్నానంటె సమర్థించడాని కనుకోకు. నేనూ బాధపడుతూనే వున్నాను. ఐతే, కమ్యూనిస్టు సిద్ధాంతంలో విశ్వాసమె లేకపోతే జీవితం యింకా దుర్భరమై వుండేది.

"అదేనీనమ్మకమైతే, మార్క్ " అని అందుకున్నాడు, అలెగ్జాండర్, "నీవిశ్వాసం నీకు యెంతేనా బలంయిస్తోంది, అపచారాన్ని సమర్థించుకోనడానికి కాని...ఏమనుకోకు...నీవిశ్వాసంమాత్రం అచంచలమైనదని నేననుకోను. నీలోనీవె యేదో మథనపడుతున్నట్టూ, తర్కించుకొంటున్నట్టూ కనిపిస్తున్నావు. నీలో తత్వం జీర్ణించిపోయింది; తత్వం నిన్ను జీర్ణించుకుంది. ఇప్పుడు నువ్వువేరు, తత్వంవేరుగా ఉండటం కష్టంగావుంది. కాని, ఉన్నసందేహాల నన్నింటిని పూర్తిగా నివృత్తిచేసుకునే శక్తి నీకులేదన్నమాట ముమ్మాటికి నిజం. నీభవిష్యత్తు బహు కష్టభూయిష్టమైనదని గ్రహించు. ...కాని, దేశములోజరిగే దాన్నంతనూ పట్టించుకోకుండా యెవరైనా తప్పుకొని తిరుగుతున్నాడనుకో. అతణ్ణిగురించినీ అభిప్రాయమేమిటి? అతణ్ణిగర్హిస్తావా? మాటవరసకు, అతడు రష్యానువదలి పారిపోయాడే అనుకో?"

"తన తండ్రి, తాత, ముత్తాతలు తనకప్పగించిన మాతృదేశాన్ని విడచి, బాధ్యతారహితంగా పారిపోయిన వాడెవరై

నాసరే, యుద్ధరంగంలోంచి వెన్నిచ్చి పారిపోయిన దేశద్రోహి గానే నేను భావిస్తాను.”

అంతవరకూ, వినోదంగా చేతిలోఆడిస్తున్న 'ఫోర్కు'ను కోపంతో బల్లమీద బలంగా వేసి కొట్టాడు. “అదిబాగానే ఉంది కాని,అతని మాతృభూమిని అతనినుండి బలాత్కారంగా లాగేసుకున్నారనుకో; ఆ దేశముకోసం పోరాడడానికి అతణ్ణి అక్కడ వుండకుండా చేశారనుకో. అప్పుడు గత్యంతరం లేక దేశం వదలిపెట్టవలసివచ్చినవాణ్ణి యెలా భావిస్తారు?”

“అయినా, వాడు దేశద్రోహే నంటాను నేను......ఇంతకూ, ప్రజలు నూతనవిధానాల నర్థం చేసుకొనడానికి ప్రయత్నిస్తున్నారు. మొన్ననే విన్నాను యీప్రాంతపు రైతాంగంలో 100 కి 97 వంతులు సమిష్టి కమతాలలో చేరడానికి అంగీకరించారని.”

“మరే. అంగీకరించారు!” అని రెట్టించాడు ఒస్టాప్. “యీాణ్ని తన జి. పి. యు దండును రావించి యీప్రాంతాన్నంతనూ రక్తపు వెల్లువలలో ముంచడానికి సిద్ధపడినందున రైతులు ప్రతిఘటించలేదు. పాపం! అతనికి పనీ తగలలేదు. అయినా. యీ దుర్నయాలను అంగీకరించే మనోబలం కాని, వేచివుండడానికి ఓర్మికాని లేనివారినీ, ప్రతిఘటించిన వారినీ కాల్చి చంపేశాడు.”

“వేచివుండడం దేనికి?”

“మనిషి అన్న ప్రతివాడు దేనికో దానికి యెవ్వడూ నిరీక్షిస్తూనేవుంటాడు.” అన్నాడు ఒస్టాప్ ఆదొకమో స్తరుగా.

కొంతదూరంలో ఏదో హారన్ చప్పుడు వినపడింది, అది మార్క్ కోసం పంపబడిన కారుహారన్. తనకోటును తొడుక్కుంటూ, "మీరు లీనాకు చెయ్యగలిగినంత సహాయాన్ని చెయ్యండి. నేను మళ్ళీ వచ్చినప్పుడు ఆమెను యెలా విడిపించాలో మాట్లాడుకుందాం.

"ఆమెను విడిపించడం చాలా ముఖ్యం" అన్నాడు అలెగ్జాండర్ ఆలోచనాపరంగా, "ఇకెంతో కాలం వుండలేదు. ఇక్కడికి స్వల్పదూరంలోనే వుంది, దోషులనుకున్నవారి నందరిని కాల్చి చంపేప్రదేశం. అక్కడే వున్నాడు రజిన్ నిన్న రోజంతా. రజిన్ ఎక్కడికి వెళ్ళాడో యేమి చేస్తున్నాడో అంతా లీనాకు తెలుసు. కాని, అతడు యింటికి తిరిగివచ్చిన తరువాత అతనితో నిద్దర చెయ్యక తప్పడంలేదు లీనాకు. మనం లీనా విముక్తిని సాధించితీరాలి. దాన్నిగురించి ఆందోళన చెందనక్కరలేదు."

మార్క్ అలెగ్జాండరుతోటి, ఒస్టాప్‌తోటి కరచాలనం చేసి "కొద్దిరోజుల్లోనే మళ్ళీ కలుసుకుందాం" అన్నాడు మార్క్, కారుదగ్గరకు వెళ్ళుతూ, మంద్రస్వనంతో. కాని, మనం యింక కలుసుకోవడం కల్ల అన్న ఒస్టాప్ మాటలు మార్క్ చెవిని పడ్డట్టు లేదు.

సోవియట్ రష్యాకు, చైనావారి మంగోలియాకు సరిహద్దు రేఖకుసమీపాన వున్న 'లంబర్ క్యాంప్' దగ్గరవున్న పెద్ద పెద్ద వృక్షాలను ఖైదీలేకాక, సమిష్టిక్షేత్రాలలో బలవంతంగా చేర్చబడ్డ రైతాంగంకూడా నరకాలని నిర్బంధించారు. తనకు కావలసిన వస్తుసామగ్రిని దిగుమతీ చేసుకొనడానికి పరిశ్రా

న్యాయంగా యెగుమతీ చెయ్యదగినవాటిల్లో కలపవొకటికా బట్టి స్టాలిన్ దానివృత్పత్తికి విపుల సన్నాహాలు చేసి, బయూంకో వంటిముఖ్యులకు ఆపనిని వప్పగించాడు. బయూంకోతో కలిసివచ్చిన మార్క్ ఆప్రదేశాన్నంతనూ పర్యవేక్షణచేసి ఖైదీలకంటె యేవిధంగానూ గౌరవప్రదంగా రైతాంగం చూడబడనట్టు కనుగొన్నాడు. కొన్ని కారణాలవల్ల వారికివ్వబడే ఆహారాన్ని కూడా ఆపుచేశారు. ఎందుకాపుచేశారని అడిగితే క్యాంప్ డైరెక్టరు వారినందరినీ ఒక పెద్ద ఆవరణలోకి తోలుకు వెళ్ళాడు. అక్కడ ఒక పెద్ద కొండవలె కలప పడివుంది.

మొదట చూసినప్పుడు బయట గుట్టపెట్టబడివున్న కలపకూ, దీనికీ భేదం యేమి కాన్పించలేదు. కాని, బాగా పరిశీలించిచూస్తే ప్రతిదుంగమధ్యనూ గుంట చెయ్యబడి. అక్షరాలు చెక్కబడివున్నాయి. ఒక దానిమీద యిలావుంది: ఈ కలపను బానిసలమైన మేము నరికాం. ఇప్పుడు మృత్యుముఖంలో వున్నాం. లక్షలాది మావంటివాళ్ళు రష్యావారి కాన్సన్ ట్రేషన్ క్యాంపులలో మగ్గిపోతున్నారు.రక్షించండి!" మరొక దానిమీద "మీరీ కలపను కొంటున్నారంటే మా రక్తాన్ని కొంటున్నారన్నమాట." ఈమాటలు వీళ్ళు రహస్యంగా చెక్కారు కాబట్టి వీళ్ళకు యివేళ రొట్టెయివ్వడం మానేశాం" అన్నాడు డైరెక్టరు. "ఇది యెవరు చేశారో బయట పడినప్పుడు. అని యింకా వాక్యం పూర్తి చెయ్యనే లేదు.

బయూంకో, మార్క్ లంబర్ కాంపులో నిద్రిస్తున్న రాత్రి, అలెగ్జాండరును, ఒస్టాప్ ను మార్క్ కలుసుకున్న

యింట్లో మరొక సంఘటన జరుగుతోంది. ఒకరివెంట ఒకరు మొరటురై తాంగం ఆగదిలో ప్రవేశించారు. వాళ్ళగడ్డాలు వత్తుగా పెరిగి అనాగరికులవలె ఉన్నారు.

అంతా సమావేశమైన పిమ్మట ఒస్టాప్ గంభీరంగా ప్రకటించాడు: "ఇవేళ బుధవారం; శనివారంరాత్రి యెనిమిదిగంటలకు కార్యాచరణ ప్రారంభ మౌతుంది. ఇందుకు సంబంధించిన సూచనలను అలెగ్జాండర్ మరొకమాటు చదువుతాడు."

అలెగ్జాండర్, సూచనలను చదవడం ప్రారంభించాడు: పొలిమేరలలో వున్న క్రమరొవా గ్రామస్థులు మొట్టమొదట తరలడం ప్రారంభిస్తారు. రాత్రి సరిగా తొమ్మిదిగంటల నలభై అయిదు నిమిషములకు మనలో నలభైఅయిదుమంది సాయుధులు సరిహద్దు చౌకి అయిన బొల్షాయమీయాకపై దాడి చేస్తారు. అక్కడున్న ఇరవైమంది చౌకీదారులను వధించిన తరవాత వాళ్ళు రెండుజట్లుగా చీలిపోతారు; ఒకజట్టు కుడివైపుగా నడచి బాటానీగ్రామం ప్రవేశిస్తుంది; రెండవజట్టు ఎడమదిశగా నడచి గ్రిమెఖిసెటిల్మెంటును జేరుకొంటుంది. ఈరెండుచోట్లా కూడా కాపలావారు వధింపబడతారు. మూడుమైళ్ళ పొడవునావున్న సరిహద్దును తమయిష్టం వచ్చినచోట దాటి మంచూరియాలోకి పోవచ్చును అని అక్కడి ప్రజలకు తెలియజెయ్య బడుతుంది. చైనా సరిహద్దుకు చాలవరకు కాపలా లేదు. ఒక వేళ మనలను నిరోధించడానికి చైనీయు లెవరైనా నిరోధిస్తే వాళ్ళని బంధించాలి, లేదా, తరిమికొట్టాలి.

"గనిలోనుండి విముక్తిని సంపాదించిన ఖైదీలు రామిన్స్, రైబాచిగ్రామాలమీదుగా ప్రయాణంచేస్తారు, అర్థమైందా?"

"పూర్తిగా అర్థమైంది."

అడవిలో చెట్లను నరికి సాయంకాలం యిండ్లకుపోయిన సమిష్టివ్యవసాయదారులు విశ్రాంతి తీసుకొనడానికి అప్పుడే సిద్ధపడుతూండగా సాయుధులు ప్రతికిటికీని సమీపించి "సిద్ధపడండి! మేము ముందుకు పోతున్నాం."

"ఎక్కడికి? ఏమిటి విశేషం?"

"మేము మంచూరియాకు పోతున్నాం. స్టాలిన్‌కు చేసిన సేవ చాలు."

ఈలోగా స్థానికపార్టీ కార్యాలయంలోకి సాయుధులు ప్రవేశించి సోవియట్ అధ్యక్షకార్యదర్శులను పట్టుకొని, బయటికీడ్చి అవహేళన చేశారు. దుర్భాషలాడారు; తమరిని ఆదుస్థితికి తెచ్చిన సోవియట్ యుద్యోగులు ద్వేషింప బడుతూండడం చూసి రైతాంగం వారిమీద విరుచుకుపడ్డారు. గుంపులు చెదరిపోయిన తరవాత మానవ కంకాళాలు మాత్రం అక్కడ పడివున్నాయి. జరిగినదానికి తలలూపి, యివ్వాళు మంచూరియాకు తరలిపోవడం తప్ప గత్యంతరం లేదనుకున్నారు. ఆదరా బాదరాదగా తమతమ యిండ్లకుపోయి, పెట్టె, బేడ బళ్ళమీద వేసుకొని, సమిష్టిక్షేత్రాల గుఱ్ఱాలశాలలో వున్న తమతమ గుర్రాలను తీసుకొని, వాడిపశువులను బళ్ళకు వెనకాల కట్టుకొని, సామానులమీద పిల్లలను, వృద్ధులను, వికలాంగులను కూర్చోబెట్టి తమతమ కమతాలలోంచి బయటకు వచ్చేశారు. పలాయనానికి సంసిద్ధులై.

ఇక్కడ యిలా జరుగుతూంటే, అరవై నలుగురు సాయుధులు పొలిమేరగా పరిగణింపబడుచున్న నది ఒడ్డుకువచ్చి అక్కడ కాపలా కాస్తున్న రక్షకభటులను ఒక్కొక్కరినే చుట్టుముట్టి హతమార్చారు. తరవాత వారు రెండుజట్లుగా చీలిపోయి, ఆజ్ఞానుసారం సగంమంది ఎడమకూ, సగంమంది కుడికీ సాగిపోయారు.

ఖొలొడ్నిగని కేంద్రింవంలో యిద్దరు వ్యక్తులు, యింతకుపూర్వం, లీనాను మార్క్ కలుసుకున్నయింటిలో ప్రవేశించారు; రజీన్ బల్లదగ్గర కూర్చొని తుపాకి తుడుచుకుంటున్నాడు. తలయెత్తిచూసే సరికి పిస్టల్ ఒకటి తనపై గురిపెట్టబడివుంది. అదిచూచి భయకంపితుడై చేతిలోనున్న తుపాకీని జారవిడచి రక్షించమని బ్రతిమాలుకున్నాడు. ఒస్టాప్ దెబ్బకు రజీన్ నేలకొరిగాడు. కదలిక లేకుండా పడివున్న ఆ కళేబరాన్ని అక్కడేవదలి ఓస్టాప్ బయటికి వచ్చేశాడు. లీనా వచ్చి వారిని కలుసుకుంది. వారు అలా ఆ యింటిని వదలిపోతుంటే, ఆకాశం రక్తారుణకాంతితో ప్రకాశిస్తోంది. డైరెక్టరుయింటినుండి మంటలు నాలుకలుచాచుకొని విజృంభించసాగాయి. బారక్స్, రక్షకభటుల నివాసాలు కూడా ఆకాశాన్నంటే ఆమంటలలో హతమై పోతున్నాయి. శిబిరం యావత్తూ అగ్నిదేవునికి ఆరగింపై పోతోంది.

"నేను స్త్రీలున్న ప్రాంతానికి వెడుతున్నాను" అన్నది లీనా.

"ఔను, లీనా, అలాచెయ్యి" అని తన ఆమోదాన్ని ప్రకటించాడు ఒస్టాప్.

ఆ శనివారం రాత్రే బయాంకో, మార్క్ లంబర్ క్యాంపునకు కొన్ని కిలోమీటర్ల దూరంలో వున్న ఒకానొక గ్రామంలో నిద్రపోతున్నారు. సుమారు అర్ధరాత్రివేళ డైరెక్టరు తాలూకు రక్షకభటులు వచ్చి అతణ్ణి నిద్రనుండి లేపారు.

"ఏమిటి సంగతి?" అని అడిగాడు మొదట లేచినమార్క్.

ఖాలొడ్ని గని కేంద్రంలోను, ఆ పరిసర గ్రామాలలోను తిరుగుబాటు ప్రారంభమైంది. కాంప్ డైరెక్టర్ మమ్మల్ని మీరక్షణకని పంపించారు."

కొన్ని నిముషాల అనంతరం వారచ్చటనుండి కారులో ప్రయాణం సాగిస్తున్నారు. రక్షణోద్యోగిని తన ప్రక్కన కూర్చోబెట్టుకుని పట్టుబట్టాడు బియాంకో. కారులో యిద్దరికి మాత్రమే స్థలం వుండడంచేత మార్క్ రక్షణ యుద్యోగి గుర్రమెక్కాడు. గుర్రంమీద స్వారి చేస్తున్నంతసేపు అతని భావాలు గనిలోవున్నవారి మీదకు, తాను ఒస్ట్రాప్‌ను అలెగ్జాండరును కలుసుకున్న గ్రామంమీదకు పరుగెడుతూవచ్చాయి. వాళ్ళు లీనాకు సహాయపడగలిగి వుంటారా? ఏమో! మార్క్ ప్రక్కన మరొక రక్షకభటుడు స్వారీచేస్తున్నాడు.

"గని కేంద్రం యిక్కడికి కెంతదూరం ఉంటుంది?" అని ప్రశ్నించాడు మార్క్.

"సుమారు పదిహేను మైళ్ళు; కాని, తిన్నగాపోతే రమారమి పన్నెండు మైళ్ళలోపు" అని జవాబిచ్చాడు. ఆదారి వెంబడిపోతే, గనికిపోయే రాజమార్గాన్ని చేరవచ్చు.

మార్క్ 'టాయిగా' ద్వారా రాజమార్గాన్ని అందుకున్నాడు. దూరాన ఆకాశం యెర్రనై ప్రకాశిస్తోంది. శిబిరం

తగలబడిపోతోందనీ, ఆ వెలుగే ఆకాశాన్ని ఆవరించిందనీ అతని కర్థమై పోయింది.

గుర్రాన్ని చబుకుతో కొడుతూ, శిబిరం త్వరగా చేరడానికి వేగిరపడుతున్నాడన్న మాటేకాని, చేరినతరవాత యేమి చెయ్యాలో అతనికితోచలేదు. అతనికొంతసేపు లీనా పాలిపోయిన ముఖమే భావఫలకంమీద నడయాడుతోంది. ఆ చిత్రమే అతణ్ణి యిలా ముందుకు నెట్టుకు పోతోంది.

హఠాత్తుగా అతని గుర్రం వెనకకాళ్ళమీద నిలబడిపోయింది. 'ఆగు' అన్నకంఠం యెదో అతణ్ణి శాసించింది. మార్క్ తనరివాల్వరును తీసేలోపుగా యెవరో అతని నడుమును ఒడిసి పట్టి, జీనునుండి క్రిందకులాగేశారు. ప్రతిఘటించడానికి ప్రయత్నించాడుకాని పెక్కుమంది పట్టుకొనివున్నందున లొంగిపోక తప్పిందికాదు. క్షణంలో అతని రెండు చేతులూ వెనకవైపున బంధింపబడ్డాయి. ఒక చెట్టు దగ్గరకు అతన్ని నెట్టుకుపోయ్యారు. ముగ్గురువ్యక్తులు బరువుగా ఉశ్వాసనిశ్వాసలను పీలుస్తూ విడుస్తూ, విషంగ్రక్కే చూపులతో అతని కళ్ళల్లోకి చూశారు. ఒకడు అతని జేబులను వెతికి పిస్టల్‌కుతోడు, కొన్నిపత్రాలను కూడా లాగేసుకున్నాడు. అగ్గిపుల్ల వెలిగించి మెల్లగా చదివాడు. "పార్టీకార్డు నెంబరు—— మార్క్ సురోవ్ కమ్యూనిస్టు పార్టీసభ్యుడు" అన్న అంకెలు అక్షరాలు అతనికంట బడ్డాయి.

మార్క్ ముఖంమీద నాట్యమాడుతున్న అగ్ని శిఖల కాంతిలో మందహాస రేఖలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. బందీగా తీసుకున్నవారిలో ఒకడు క్రోధావేశంతో గర్జించాడు.

ఒరె, కమ్యూనిస్టువెలకా! యేంచూసుకుని గా ఆ కులుకు? మేము నిన్ను కొద్దిసేపటిలో చంపెయ్యబోతున్నాం. పాపం! నీ కా సంగతి తెలియక నవ్వుకొంటున్నావు"! అలా యెకసక్కేమాడుతున్నా మార్క్ ముఖంమీద చిరునవ్వు అలాగే వుంది. దాంతో ఆర్రైతుకు కోపం మితిమీరిపోయి చేతిలోనున్న తుపాకీని పైకెత్తి మార్క్ నెత్తిమీద బలంగా ఒక్క పెట్టుపెట్టాడు; మార్క్ చెట్టు మొదటిలోకి కుప్పన కూలిపోయినట్లు చలనం లేకుండా పడివున్నాడు.

అతనికి స్పృహవచ్చి కండ్లువిప్పి చూసేసరికి తన ముఖం మీద ఒక స్త్రీముఖం— అతిపరిచితమైన ముఖం— ఆ మంటల వెలుగులో గోచరించింది. "ఇతడు కళ్లు తెరుస్తున్నాడు" అన్నది అమె. ఆమె చల్లని చెయ్యి అతని చెంప పై కారే రక్తాన్ని తుడుస్తోంది.

"నేనెక్కడున్నాను?" అన్నాడు భారంగా, మార్క్.

« నేను వెళ్ళేటప్పటికి వాళ్ళు యితణ్ణి ఉరి తియ్యడానికి యేర్పాట్లు చేస్తున్నారు," అన్న కంఠధ్వని వినిపించింది. 'వెంటనే నాగుర్రంమీద యెక్కించుకొని యిలా తీసుకు వచ్చేశాను."

ఒస్టాప్ కంఠంతాపీగా, ముక్తసరిగా, వినిపించింది. « ఇతని తలచితక గొట్టిబడిందా?"

'అని నేననుకోను' అంటూ సమాధానమిచ్చాడు అలెగ్జాండర్.

స్త్రీ భుజాన్ని ఆనుకుని మార్క్ మెల్లగా లేచి కూర్చున్నాడు. ఇప్పటికి గ్రహించాడు మార్క్ ఆమె లీనా అని.

ఒరే, కమ్యూనిస్టువెలకా! యేంచూసుకుని గా ఆ కులుకు? మేము నిన్ను కొద్దిసేపటిలో చంపెయ్యబోతున్నాం. పాపం! నీ కా సంగతి తెలియక నవ్వుకొంటున్నావు”! అలా యెకసక్కెమాడుతున్నా మార్క్ ముఖంమీద చిరునవ్వు అలాగే వుంది. దాంతో ఆరైతుకు కోపం మితిమీరిపోయి చేతిలోనున్న తుపాకీని పైకెత్తి మార్క్ నెత్తిమీద బలంగా ఒక్క పెట్టుపెట్టాడు; మార్క్ చెట్టు మొదటిలోకి కుప్పున కూలిపోయినట్లు చలనం లేకుండా పడివున్నాడు.

అతనికి స్పృహవచ్చి కండ్లువిప్పి చూసేసరికి తన ముఖం మీద ఒక స్త్రీముఖం— అతిపరిచితమైన ముఖం— ఆ మంటల వెలుగులో గోచరించింది. “ఇతడు కళ్లు తెరుస్తున్నాడు” అన్నది ఆమె. ఆమె చల్లని చెయ్యి అతని చెంపపై కారే రక్తాన్ని తుడుస్తోంది.

“నేనెక్కడున్నాను?” అన్నాడు భారంగా, మార్క్.

“నేను వెళ్ళేటప్పటికి వాళ్ళు యితణ్ణి ఉరి తియ్యడానికి యేర్పాట్లు చేస్తున్నారు,” అన్న కంఠధ్వని వినిపించింది. ‘వెంటనే నాగుర్రంమీద యెక్కించుకొని యిలా తీసుకు వచ్చేశాను.”

ఒస్టాప్ కంఠంతాపీగా, ముక్తసరిగా, వినిపించింది. “ఇతని తలచితక గొట్టిబడిందా?”

‘అని నేననుకోను’ అంటూ సమాధానమిచ్చాడు అలెగ్జాండర్.

స్త్రీ భుజాన్ని ఆనుకుని మార్క్ మెల్లగా లేచి కూర్చున్నాడు. ఇప్పటికి గ్రహించాడు మార్క్ ఆమె లీనా అని.

ఆమె వెనక, ఒస్టాప్, అలెగ్జాండర్ నిల్చుని వుండడం చూసి అంతా అర్థం చేసుకున్నాడు. మరోకసారి అప్రయత్నంగా, అనుకోకుండా, చిన్ననవ్వు అతని ముఖంమీద చిందులాడింది. 'మళ్ళీ మనమంతా కలుసుకున్నాంకదూ?' అన్నాడతడు. 'నన్ను మీరు ఉరితీస్తారా? సైనికుణ్ణి కనక కాలుస్తారా?' అని అడిగాడు వికటంగా.

ఒస్టాప్ అతణ్ణిసమీపించి కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. "నవ్వకు, మార్క్. నవ్వడానికి సమయంకాదిది. నిన్ను మేము చంపబోవడంలేదు. దానికికూడా అర్హత ఉండాలికదా."

మార్క్ ముఖం వెలవెలబోయింది, దిగులుతో. ఆమె తనముఖంపై వ్రాలి దుఃఖిస్తూ, కారుతున్న రక్తాన్ని తుడవడం గమనించాడు.

"మీరు నన్ను చంపనంటారా?" అని మళ్ళీఅడిగాడతడు.

"నీకేమికావాలో కోరుకో." అన్నాడు అలెగ్జాండర్. ఇక్కడ వుండిపోయినా సరే, లేదా, మాతోవచ్చినా సరే. ఇప్పుడు జరిగినదంతా నీకు తెలిసేవుంది. సరిహద్దుగ్రామాలన్నీ నది కావలివైపుననున్న మంచూరియాలో కలసిపోతున్నాయి. హింసకు, రైతాంగం యిచ్చేసమాధానం యిది. ప్రజలుస్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కావాలంటున్నారు. ఆస్వేచ్ఛా స్వాతంత్ర్యాలు జపించుకొంటూ వారు స్వదేశాన్ని వదలి వెళ్ళిపోతున్నారు. నువ్వుకూడా మాతో వొచ్చెయ్యి, మార్క్".

"ఊఁహూఁ! నేనుమీతో రాను. అన్నాడు మార్క్ నెమ్మదిగా, 'నాస్థానం యిక్కడేవుంది; యీగడ్డమీదనే...'

మార్క్ కంఠం శోకంతో గద్గదికమౌతున్నట్లు అలెగ్జాండర్ గ్రహించాడు. తన చిరమిత్రునిచూస్తే అతనికి మెక్కడలేని జాలి అంతఃకరణాలు ముప్పిరిగొన్నాయి. శాంతి, కరుణరసాలు వెల్లివిరసిన కంఠంతో అన్నాడతడు 'నువ్వుమాతో గావన్న సంగతి మాకు తెలుసు, మార్క్. అయినా, విడిపోవడమైనా ఆప్తమిత్రులవలె విడిపోదాం, ఒకసంగతిచెప్పు, అది తెలుసు కుని వెళ్ళిపోతాం. ఇప్పుడూ, యింతక్రితమూ, రోడ్డుమీద వాళ్ళదగ్గరా నువ్వేందుకునవ్వావు?'

మార్క్ లీనాచేతినింకా పట్టుకొనే వున్నాడు. అతడప్పుడు ఒక్కలీనానె సంబోధిస్తునట్లు మాట్లాడుతున్నాడు, 'నాకవసాన మొచ్చిందను కొన్నాను. దాంతో సర్వం తీరిపోతుందను కున్నాను. మార్క్ సురోవ్ బ్రతికినన్నాళ్ళు సోవియట్ ప్రభుత్వంకొరకె పోరాడాడు; దానికొరకే అతడు ప్రాణాలనర్పిం చాడు' అన్నకీర్తి నిలచి పోతుందనుకున్నాను. అంతకన్న కావల సిందేమిటి? అంతకన్న నేచెప్పగలిగిందేమిటి? విన్నావా, లీనా?'

'అర్థమైంది, మార్క్' అన్నట్లు మెల్లగా తలపంకించింది లీనా, 'నీకునమ్మకంలేని భవిష్యత్తుతో సంబంధం విడగొట్టు కుంటావనుకున్నావు నువ్వు. పట్టినబాట యికముందుకుపోదనీ' చావు ఒక్కటే దీనికి విమ్కృతి అనీ అంగీకరించడానికి నువ్వు భయపడుతున్నావు. పార్టీ శత్రువుల చేతుల్లో చావుకొరికితే తండ్రికితగ్గ కొడుకుననిపించు కుంటావనీ, యతాసిథారం ధరించి నందుకు అట్టివారి పరువు ప్రతిష్టలను నిలబెట్ట గలిగాననీ ఆశించావు, కాని, నువ్వు చాలాఘోరపడుతున్నావు. అది సామా

న్యమైన పొరపాటుకాదు, మార్క్ దిద్దుకొనడానికి సాధ్యపడ నంత మహోపచారం.'

"జరిగినదేదో యిదివరకే జరిగిపోయింది, లీనా" అన్నాడు ప్రశాంతంగా, తనచెంపను ఆమెచేతికి నొక్కుతూ.

"మాతో రా" అని బ్రతిమాలిందామె. "నిన్నెప్పుడూ ప్రేమిస్తూనే వుంటాను, మార్క్."

తనదృష్టిని మంటలలో ఆహుతి అయిపోతున్న శిబిరంమీదకూ, 'టాయ్‌గా' మీదకూ, నిప్పురవ్వల్లా మెరుస్తున్న నక్షత్రాలమీదకూ, అచ్చటనుండి మళ్ళించి ఓస్టాప్ మీదకూ, అలగ్జాండర్ మీదకూ ప్రసరింప జేశాడు, లీనావైపు చూస్తూ కటువుగానవ్వి 'ఊఁహుఁ, నాస్థానం యిక్కడేవుంది'



7వ అధ్యాయం.

## ఎక్సీ మాస్కోకు

ఖోలోడ్నిలో జరిగిన సంఘటనలు మాస్కో జీవితాన్నే మార్చేశాయి, తరువాత సంభవించినపరిస్థితులలో, ముఖ్యంగా ముందుచెప్పుకోతగినది అతని దృక్పథంలోనే, యోచనాపథం లోనే. యేర్పడిన పెద్దమార్పు.

'జరిగినదేదో యిదివలకే జరిగిపోయింది' అన్నాడతడు. మనిషిలో భావవైక్లబ్యం కలిగినప్పుడు, అంతవరకూ ప్రదర్శిం చిన నటనలన్నీ దూరమై పోతాయి, అప్పుడు ఆత్మవంచనకు తావుండదు;అనుభవానికొచ్చినకొద్దీ, మాటలు అప్రయత్నంగా అతని నోటనుండి రాలుతున్నాయి. మొదటి అనుభవం తిరు గుబాటు. అది, ప్రజానీకానికి, సోవియట్ ప్రభుత్వమంటే యెంత ద్వేషమొ ప్రకటించింది; రెండవది, తనమిత్రులే ఆ తిరుగు బాటుకు నాయకత్వం వహించడం; మూడవది, లీనాప్రాణాలు, అలెగ్జాండర్, ఒస్టాప్ప్రాణాలు దక్కాలంటే తిరుగుబాటున డవడం అనివార్యంకావడం.

సరిగ్గాఆలోచిస్తే తానుచేసిన తప్పేమిటి? పేళ్ళుచెదరకుండా కలపను నరకలేకపోవడమేనా? పేళ్ళు చెదరిపోక తప్పదని అంగీ కరించే సమాజంలో అధర్మానికీ, రక్తపాతానికీ, అవధి వుండ దనే సత్యాన్ని అతడు గుర్తింపసాగాడు. ప్రతీవ్యక్తీ, ప్రతిజాతీ సంస్కారం అనే కలపను నరకవలసివుంటుంది. అలా నరికే టప్పుడు పీటర్, లీనావంటి పేళ్ళు చెదరిపోక తప్పదని సమర్థించు కుంటె పది, నూరు, వెయ్యీ, లక్ష, పదిలక్షలు మాత్రం యెందుకు చెదరగూడదు? ఈ చెదరడానికి హద్దెక్కడ?

"దేవతలు మాట్లాడనప్పుడు మనిషి తనదారిని తానే చూచుకోవాలి, అలా అనుకోడం కూడా తప్పేనా? దేవతలు నిజంగా మౌనం వహించారా? కారల్ మార్క్స్, లెనిన్ విధానం తప్పితే మరోమార్గమే లేదా? మానవ చరిత్రలో, ఉన్నత పథంలో జీవితాలను సాగించడానికి యింతకన్న తక్కువ రక్తపాతాన్ని హెచ్చుకారణాన్ని ప్రదర్శించే మార్గాన్ని సూచించిన నాయకమన్యులు మరెవరూ లేకపోయ్యారా?

తాను తప్పుచేసినట్టు వప్పుకున్నా, పార్టీలో వుండడంమంచి పనేననీ, తన స్నేహితులు పార్టీవిధానంలోంచి బయట పడటానికి యెలాస్వేచ్ఛాస్వాతంత్రాలను కలిగివున్నారో అలాగే పార్టీని మార్చడానికి తనకూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలున్నంతవరకు తాను చేసినదీ మంచిపనే ననీ భావించాడు. ఐతే, పార్టీవిధానాలను మార్చడం తనకు చేతనయ్యేపనా? చావునే కోరుకున్న తనకు అటువంటి ఆశ లేదని స్పష్టం కావడంలేదా? ఈప్రశ్నలకు సమాధానాలు లేవు.

ఖలోడ్ని సంఘటనల తరవాత కొన్ని వారాలపాటు అతనికి లభించిన తీరికవల్ల సమాధానాలు దొరకని ప్రశ్నలను గురించి ఆలోచించడానికి వీలుకలిగింది. వావిలావ్ అతణ్ణి మంచూరియా తీరస్థప్రదేశమైన శాఖలిన్ దీవికి యేదో పనిమీద పంపించాడు. వ్లాడివాస్టక్ నుండి శాఖలిన్ దీవికి రేవుస్టీమర్ లో ప్రయాణం చేసేటప్పుడూ, శాఖలిన్ దీవిలో వున్నరోజుల్లోనూ కూడా యీ ప్రశ్నలనుగురించే ఆలోచించేవాడు. అయినా, అతనికి సమాధానం దొరకలేదు. ఐతే తిరుగుబాటు ప్రయాణంలో ఒక చిన్న సంఘటన జరిగింది.

స్టీమరు, ప్రయాణంలో అనేక చోట్ల ప్రయాణీకులను, సరుకులను యెక్కించుకొనడానికి ఆగుతూ వచ్చేది; ఒకానొక రేవులో వయసుమళ్ళిన ఒకపురుషుడూ, అతని కుమార్తెరూ ఆమె పసిపిల్ల యెక్కారు. ఆమెను యిదివరకెప్పుడో, యెక్కడో చూసినట్లు జ్ఞాపకం వుంది. కాని యెక్కడ ? యెప్పుడు? అన్నది, ఆమె తనకు చేరువగా, కటకటాలు పట్టుకుని బిడ్డతో నిలుచున్నప్పుడుకాని పూర్తిగా గ్రాహ్యం కాలేదు. దూరంగా కనపడీ కనపడకుండా వున్న లంకతీరాన్ని తదేకదృష్టితో చూస్తూ నిలుచుంది ఆమె.

'ఆలంకనుచూశారా?' అన్నాడు నావికుల్లో ఒకడు మార్క్‌తో. కుష్ఠురోగులంతా వుండే లంక అది. ప్రపంచంలో యెక్కడెక్కడి కుష్ఠురోగులు అక్కడ చేరతారట. నా అదృష్టం వల్ల నాకా దురవస్థ సంభవించలేదు......అబ్బ!

'ఆమె యెవరోకాదు, మేరియా. విచారం ఆమెను యెంతగా కృంగతీసింది' మళ్ళీ తనభావనేత్రంతో ఆనదిగట్టును తిలకించాడు మార్క్ పీటర్ నోవికోఫ్‌డైరి; కన్నీళ్ళు కాలువలై ప్రవహిస్తూంటే నదిలో ఆయువతి నావ తేలిపోతూ వుండడం కళ్ళకు కట్టిన దృశ్యాలు, మార్క్ యింకా ఆమెవైపునకు దృష్టిమళ్ళించాడో లేదో ఆమె సత్తువ సన్నగిల్లి పోతున్నట్లు కృంగిపోతోంది. మార్క్ ముందుకురికి, ఆమెచేతులలోంచి జారిపోతున్న ఆపసికందును అందుకొనకపోతే ఆమె తప్పకుండా బిడ్డను జారవిడిచే వుండును.

మార్క్ ఆమెను క్రిందనున్న తనగదిలోనికి తీసుకుని వెళ్ళి పక్కమీద పడుకో పెట్టాడు. అలసివున్నందున ఆమె వెంటనె

నిద్రలో మునిగిపోయింది. బిడ్డ ప్రక్కలో పడుకునివుంది. మార్క్ మళ్ళీ ఓడ పైభాగానికి వెళ్ళి పచారు చేస్తున్నాడు. ఆమె దుస్థితికి జాలిపడుతూ, అనతిదూరంలో—కొన్ని కిలోమీటర్ల కావల—పీటర్ వున్న లంకవుంది; ఈపాటికి ఆవ్యాధికి అతడు కూడా గురియై కృశించిపోతూనైనావుంటాడు. లేదా, యీ లోకాన్ని వదలిపెట్టి అయినా వుంటాడు. క్రింద కేబిన్ లో తాను ప్రేమించిన యువతి—తనను వివాహ మాడదలచిన ప్రేయసి—తాచూడని బిడ్డతో పడుకునివుంది. ఈ దుస్థితికి యెవరు బాధ్యులు? అలా యెందుకు యెడబాయవలసి వచ్చింది? బాగ్గును కనిపెట్టిన నేరానికేనా? ఏపాపం యెరగని యేనేరమూ చెయ్యని పేళ్ళను కాల్చి వెయ్యడం సహించక పోబట్టేనా? దుస్సహమూ, ఘోరాతిఘోరమూ, దురూహ్యమూ అయినవాటిని తాను చూడలేక పోవడమేనా?

కొంతసేపటికి మార్క్ తనగదిలోకి వెళ్ళి చూడగా ఆమె మెళకువతో కూర్చొనివుంది.

'మనం వ్లాడివాస్టవ్ ను సమీపించామా?' అని అడిగిందామె.

'ఔను, మేరియా. హార్బర్ ప్రవేశిస్తున్నాం' అంటూ తన సామాను సర్దుకుంటున్నాడు.

'నా పేరు మీ కేలా తెలుసు?' అని ఆశ్చర్యంతో ప్రశ్నించింది మేరియా.

'ఒక విచిత్రసంఘటనవల్ల......ఆనాడు నేను ఖబ్రావస్క్ లోనే వున్నాను...ఆపదివోడ్డున ...పీటర్ వెళ్ళిపోయిన రాత్రి నిన్ను విడచి వెళ్ళినతరవాత నువ్వుపడవలో వెళ్ళుతూ ..

'మీరక్కడవున్నారా?' అన్నప్రశ్న వెంబడి నాటిరాత్రి విషాదపూరిత ఘట్టాలన్నీ మరొకసారి ఆమె స్మృతిపథంలో నడయాడాయి. 'ప్రభూ!" అంటూ తన తలనుచేతులలో వ్రాల్చేసిందామె.

'ఔను మేరియా' అన్నాడుమార్కు సానుభూతితో. అది నీకు దుర్భరమైన అనుభవం. కాని, పీటర్ చెయ్యావలసిన పని చేశాడనే నా అభిప్రాయం. అతడక్కడికి వెళ్ళదలచు కున్నప్పుడు నిన్నుకూడా తీసుకువెళ్ళే హక్కు అతనికి లేదు.'

ఆమె ముఖం త్రిప్పేసుకుంది.

కొద్ది సేపటికి స్టీమరులోంచి దిగడానికి సిద్ధపడే సమయంలో తనతండ్రికి మార్కును పరిచయం చేసింది మేరియా. ప్రొఫెసరు జాంకిన్ అనే ఆయన ఒక "సర్వే" దళానికి పెద్ద.

".మీరు వ్లాడివాస్టల్ నుండి యీవాళే వెళ్ళిపోతున్నారా?' అని ఆమె మార్కును ప్రశ్నించింది. ఆమెచూపుల్లో 'బహుశః వెళ్ళరనుకుంటాను.' అనె ఆశ మెదులుతున్నట్లు ఊహించాడు, మార్కు, తాను వెంటనే వెళ్ళిపో దలచినప్పటికీ "లేదు, ఇవేళవుండి రేపో, యెల్లుండో వెడదామనుకుంటు న్నాను" అన్నాడు, తనసమాధానానికి తానే ఆశ్చర్యపోతూ!

"దిగదలచిన బస యేదీ యిదివరకె నిర్ణయం కాకపోతే, మాతో వుండవచ్చును. మాకిక్కడ బస యేర్పాటైంది. వస్తేమీకూ మాబసలో స్థలం వుంటుంది.ఏమంటారు నాన్న?"

జాంకిన్ మేరియావైపు అనునయంగా చూస్తూ "ఆహా తప్పకుండా వుండవచ్చు. నేను వెంటనే యీప్రాంతంలో

పర్యటించడానికి మెల్లాగా వెళ్ళుతున్నాను గదా! ఆయన నాగదిలో వుండవచ్చును".

పూర్బమునుండి వారు సరాసరి మేరియా బనకు ప్రయాణ మైనారు. చంటిపిల్లసంగతి కొంచెం చూశాక ఆమె 'టీ' తయారుచేసింది. చీకటి పడుతూంటే మేరియా, మార్కా టీబల్లదగ్గర కూర్చున్నారు. ఆమె ముఖం విచారంతోటి, వికలత్వంతోటి వైవర్ణ్యం చెందివుంది.

మేరియా ఒక్కర్తేకాదు. మార్క్ కూడా ఏకాకి జీవితాన్నే సాగిస్తున్నాడు. అతడూ రెక్కలూడినపక్షిలా విలపిస్తున్నాడు. మార్క్ బల్లదగ్గరనుండి లేచి తనచేతులను ఆమె భుజాలమీాద వుంచాడు. అలాచేసే టప్పటికి ఆమె గాలితాకుడు తీవలా వొణికిపోతున్నట్లనిపించింది మార్క్‌కు. ఆమె తలనెత్తి అతని ముఖంలోకి చూసింది. అలా వారిరువురు అన్యోన్యం ఒకరికళ్ళల్లోకి ఒకరు చూస్తూంటే, ఆమె కళ్ళల్లో యేదో అనిర్వచనీయమైన చిరునవ్వు ప్రకాశించి ముఖమంతా ఆవరించింది. అతడామెను పైకి లేవనెత్తి సందిటిలోకి తీసుకున్నాడు. మేరియా మార్క్‌పై వ్రాలిపోయింది; ముఖంమీాద, కంఠంమీాద ముద్దులు కురిపించింది. స్త్రీ ప్రదర్శిస్తున్న మోహావేశానికి ఆత్మసుఖలాలసత్వం తోడుకాగా వివశుడై ఆమెను గాఢంగా తనశరీరానికి హత్తుకున్నాడు. అగాధ పరిష్వంగంలోనె ఆమెను శయ్యకు చేర్చాడు కూడ. ఈలోపున, ఆమె అతనిని తనివిదీర ముద్దులలో ముంచేసింది. ఆమెపై వ్రేలాడుతూ, అపూర్వానుభూతికిలోనై ఆనందపారవశ్యంలో మునిగిపోయాడతడు. కాట్యాయే తన ఆలింగనంలో వున్నట్లనిపిం

చిందతనికి. ఆ స్నిగ్ధావస్థలో తన్నుదా నేమరచి, రసాత్మక ప్రపంచంతప్ప బాహ్యప్రపంచదృష్టే లేని, ఆరసపిపాసికి, అదే అవస్థలో నున్న మేరియా పలవరింతలు చెవికిసోకాయి.

"ప్రియతమా, పీటర్!"

అతని కల కరగిపోయింది. ఆమె కూడా తనవలెనే రసాత్మక ప్రపంచంలో విహరిస్తోందన్న సంగతిని గుర్తించాడు కూడా. సకలేంద్రియ సంతృప్తమైన మేరియా అతనిపరిష్వంగంలో అలాగే సుషుప్తి నొందింది. కాని, మార్క్ మెళుకువగానే వున్నాడు.

"రేపటిమాటేమిటి?" అని ఆలోచింపసాగాడు మార్క్, ఆమె ప్రక్కనే పడుకుని, తెల్లవారగానే తెలుసుకుంటుం దామె నేను పీటర్‌ను కాదని; అతనిసొత్తు నెవరో ఆగంతకులు దోచుకు పొయ్యారని; ఆ ఆగంతకునికి తాను జ్ఞప్తిలోనే వుండదని; ఈ పరిస్థితిని ఆమె సరిగ్గా అర్థం చేసుకుంటుందా? క్షమిస్తుందా ?

తొందరతొందరగా దుస్తులను ధరించుకుని వెన్నెలవెలుగులో ఒక చిన్నచీటి వ్రాశాడు.

"నాదికానిదానిని దేన్నో నేనుదోచుకున్న దోషిగా భావిస్తున్నాను. నాకు యీరాత్రిలభించిన దంతా వేరొకరిది. అయినా, సుఖంనాకు దక్కింది. కృతజ్ఞుణ్ణి.

"నీకు నా పేరు తెలుసు; ఖ్రబావస్కలో నన్నెక్కడకలుసుకోవాలో తెలుసు. నేను నిన్నిప్పుడేమి అడగడానికి సాహసించలేను. కాని, నువ్వేగనక నన్ను భర్తగా స్వీకరించడానికి అంగీకరిస్తే నీకు విశ్వాసపాత్రుడైన భర్తను కాగలననీ,

చిన్నారిపీటర్ కు తండ్రి లేనిలోటు తీర్చగలనని వాగ్దానం చేస్తున్నాను. నీ ప్రేమను అర్థించేహక్కు నాకు లేదని నేనెరుగుదును. కాని, మనమిద్దరమూ కూడ ఒంటరిజీవితాలనే గడపుతున్నాం. మనమిరువురం దాంపత్యజీవనం సాగిస్తే మన నాశ్రయించిన ఒంటరితనం దూరంగా వైదొలగిపోతుంది. నేను నిరీక్షిస్తూంటాను....

మెల్లగా ఆ యింట్లోంచి బయలుపడినతరవాత, ఒకగంటకు ఖబ్రవస్క్ కు వెళ్ళుతున్నరైల్లో ప్రయాణం చేస్తున్నాడు మార్క్. ఖబ్రవస్క్ చేరుకోగానే, వావిలావ్ అతనికి కబురంపించాడు,తక్షణంమాస్కోకు రావలసిందిగా మార్క్ కు వుత్తరువులు వచ్చినట్లు చెప్పడానికి. ఖొలొమ్నికి వచ్చిన తరవాత యిది మూడవపరిణామం మార్క్ కు.

"నాలాగే నీకూ తెలుసుకదా." అనిప్రారంభించాడు వావిలావ్ "తిరుగుబాటుకు కారణం యేమిటో. అయినా, జి. పి. యు తమ కేమిసంబంధం లేనట్టు దూరదూరంగా వుంటూ, దానంతటికీ నేనే బాధ్యుడనైనట్టు నాతలకుకట్టజూస్తున్నారు. ఒకవేళ నేను డిస్మిస్ అయినా కావచ్చును. అప్పుడు, నాస్థానేవచ్చే అధికారి నిన్ను ముప్పుతిప్పలా పెట్టకమానడు. ఆపరిస్థితి కలుగకుండా నిన్నిక్కడనుండి తప్పించడానికి నే నేర్పాటు చేశాను. మాస్కోలో నీకొకవుద్యోగం చూశాను. క్రెమ్లిన్ లో కేంద్రప్రభుత్వశాఖలలో యెందులోనైనా పనిచెయ్య వలసివుంటుంది. వాల్కొవ్ ఎదో ఒకశాఖకు అధిపతి, అతడు కొంతకాలంగా నిన్ను తనకిమ్మని అడుగు

తున్నాడు. ఆ ఉద్యోగమైనా నీకేమంత సంతోషకరంగా ఉంటుందని నే ననుకోను. కాని,..."

మార్క్ యేమి మాట్లాడలేదు. సందేహాస్పదమే అయినా మేరియా, ఎప్పుడో ఒకప్పుడు, తన జాబుకు సమాధానం యివ్వకమానదనీ, తనకు కనుపించకనూ మానదనీ యింత వరకూ ఆశిస్తూవచ్చాడు. కాని, తాను కొన్ని వేల కిలోమీటర్ల దూరంలో వున్న మాస్కో నగరానికి వెళ్ళినతరవాత ఆ అవకాశంకూడా దూరమైనట్లే. అదిఅలావుండగా, వావిలావ్ చెప్పినదాంట్లోకూటా సత్యంలేకపోలేదు. వావిలావ్ స్థానే కొత్తకార్యదర్శివస్తే తనకు తిప్పలు తప్పవు. చివరకు వావిలావ్ నుద్దేశించి మార్క్ అన్నాడు ;

" నా స్వంతవ్యవహారాలను చక్కబెట్టుకొనడానికి నాకు కనీసం ఒకవారంరోజులైనా వ్యవధికావాలి."

వావిలావ్ కరుగ్గా చూశాడతనివైపు.

'అదికూడా ప్రమాదమే అనుకుంటాను. కాని, అడిగావు కనుక, ఒక్క వారంమాత్రమె వ్యవధి యిస్తున్నాను, అంతే.'

తరవాత వావిలావ్ శాంతవదనుడై, ఆప్యాయంతో అన్నాడు

'మరి మనం విడిపోతున్నాం మార్క్. నిన్ను నేనెంతగానో అభినందిస్తున్నాను; నీవు మంచిపనివంతుడవె కాక విశ్వాసపాత్రుడవుకూడా'.

'నేను నాయోపిన మేరకు విధినిర్వాహణను చేస్తూ వచ్చాను, కాని, ప్రతీది అనుకునట్లు అవడంలేదనికూడ తెలుసు, అయినా . . .'

'నాకు తెలియకపోలేదు, మార్క్. ఐతే, కృషి చెయ్యాడమె నీవంతు కాని, దాని పర్యవసానానికి నీవు బాధ్యుడవు కాదు. కాబట్టి. అనుకున్నట్లు కాని దానికి నీవు బాధ్యుడవు కాదు. ఈరోజుల్లో యెంతమంచిపనిచేసినా, పరిణామం యెలావుంటుందో చెప్పడం కష్టం. అదీ రోజులమహిమ!'

"రోజుల మహిమ?" ఆశ్చర్యంతో ఉటంకించాడు మార్క్. రోజులేమిచేశాయి? మనిషే రోజులపరిస్థితులకు కారకుడౌతాడు; అతడు రోజులను శాసించగలవాడే, కాని, శాసించ బడేవాడు కాదు."

"రాజకీయాలకు సంబంధించినంతవరకు మనిషి కాలపరిస్థితులకు లొంగివుంటాడు. ఎక్కడో కాని, నిర్భయంగా, నిశ్చితంగా యెదురీతకు సాహసించరు. మరి, అలాంటివాళ్ళెందరుంటారంటావు?"

తనకుర్చీలోంచి లేచి బల్లకు ఎదురుగా కూర్చున్న మార్క్ దగ్గరకు చుట్టివచ్చి "మనం మళ్ళీ కలుసుకుంటామని ఆశిస్తున్నాను" అన్నాడతడు, "ఈలోపుగా ప్రభుత్వవిధానం మనలో యెవరినో ఒకరిని అణచివెయ్యకుండావుంటె. నువ్వుమాత్రం దానిక్రింద నలిగిపోకుండా చూసుకో..." అంటూ మార్క్ తో కరచాలనం చేశాడు.

నాటిరాత్రి బాగాప్రొద్దుపోయింది. మార్క్ టెలిగ్రాఫ్ ఆఫీసులో కూర్చొనివున్నాడు, తనకూతురు మేరియాటార్పితా యెక్కడవున్నదీ తెలుపవలసిందిగా ప్రొఫెసర్ జాంకిన్ కు యిచ్చిన టెలిగ్రాంకు సమాధానంకోస.

సమాధానంవచ్చింది. "మూడురోజులక్రితం తుర్కిస్తాన్‌లో తన క్రొత్త ఉద్యోగస్వీకారానికి వెళ్ళింది, ఈపాటికింకా ప్రయాణంలోనే వుండవచ్చు."

మరొక ఆశాభంగం. తాను ఖబ్రొవస్కిలో వున్నప్పుడే మేరియా అప్పారిమీదుగా రైలులో ప్రయాణంచేసివుండాలి. అయినా, ఆమె తనను చూడదలచలేదన్నసంగతి గ్రాహ్యమైనప్పుడు, అతడు తన ఒంటరితనాన్ని దూషించుకుంటూ అణగారిపోయాడు. రెండురోజులఅనంతరం మార్క్ నగరాన్ని దూరప్రాచ్యాన్నికూడావిడిచి మాస్కో వెళ్ళిపోయాడు.

మాస్కో స్టేషన్ ప్లాట్‌ఫారంమీదకు రైలు వచ్చేటప్పటికి మార్క్ కిటికీలోంచి బయటకుచూశాడు. నల్లగా పీలగావున్న తనతల్లి తనకోసం నిరీక్షిస్తోంది. క్రొత్త తన ఉన్నతోద్యోగాన్ని పలుకుబడిని పురస్కరించుకొని మార్క్ ఉండడానికి యోగ్యమైన వసతి సిద్ధంగా ఉంచాడు. ప్రశాంతంగా వున్న ఒకానొక వెనకవీధిలో ఒక యింటివద్దకు మార్క్ తల్లి మార్క్‌ను తీసుకువెళ్ళింది. తలుపు తెరచి లోనికి వెళ్ళగా అందులో రెండుగదులకన్న యెక్కువలేవు. జనసంకీర్ణమైన ఆ మహానగరంలో— ఆమాత్రం వసతి లభ్యమైనా—యేదో సామ్రాజ్యం లభించినట్లై.

తరవాత రెండువారాలు అతనికి స్థిమితపడటానికి క్రొత్త చోటు క్రొత్తఉద్యోగాన్ని క్రొత్తజనాన్ని అర్థంచేసుకొనడానికి సరిపోయింది. నగరమధ్యంలోను, క్రెమ్లిన్‌లోను ఉన్న పార్టీసెంట్రల్ కమిటీ ఆఫీసుల్లో అతను పనిచెయ్యవలసివచ్చేది. ఆ రెండువారాల్లోను, యిదివరకు తనజీవితంలో వ్రాయనన్ని

'పటాలం పెంపుడుకొడుకు' అని నిన్ను మేం పిలిచే రోజుల్లో యెంతదురుసుగా వుండేవాడవో యిప్పుడూ అలాగేవున్నావు. ఇప్పుడు సరిగ్గా నీవయస్సెంత, నాయనా?

"ఓ, యిప్పుడు నేను పెద్దవాణ్ణయ్యాను, ఇరవై ఆరు. కాని మిమ్మల్ని నే నిక్కడ చూస్తానని యెంతమాత్రం అనుకో లేదు. మీ పేరు పరెస్సిటావ్ అనే తెలుసు కాని వాల్కోవ్ అని పిలుస్తారన్న సంగతి తెలియదు.

"ఏ పేరైతేనేమి, నాయనా; అప్పుడొక పేరుతో వ్యవహరించేవాణ్ణి; యిప్పుడు మరొక పేరుతో వ్యవహరిస్తున్నాను. వాల్కోవ్ అన్నదికూడా నా అసలు పేరుకాదు. యుద్ధానికి పూర్వం మేం రహస్యంగా పనిచెయ్యవలసివచ్చినప్పుడు మా అసలుపేర్లు అడుగున పడిపోయ్యాయి. అప్పటినుండీ అవిమళ్ళీ పైకి రాలేదు.

"మిమ్మల్ని గురించి నేను అప్పుడప్పు డనుకునేవాణ్ణి," అన్నాడు మార్క్. "మీ యోగక్షేమాలను గురించికూడా అడుగుతుండేవాణ్ణి. కాని, పెరెస్సిటావ్ అంటె ప్రతివారు, మాకు తెలియదంటె, మాకు తెలియదనేవారు."

"అందులో వింతయేమిలేదు, మార్క్. కాని, అదేమిటి అలా నిల్చునే మాట్లాడుతున్నావు? కూర్చో. మనంమాట్లాడు కోవడం అయిన తరవాత నువ్వు నాతో మాయింటికి రావాలి."

మార్క్ తనకథనంతనూ వోల్కోవ్‌కు వెళ్ళబోశాడు—తాను విశ్వవిద్యాలయంలో యెలా చనువుకున్నదీ, యెలా

పనిచేసినదీ, యేమేమి చూసినదీ యేమేమి ఊహించినదీని. మొదట యెక్కడ యెలా ప్రారంభించాలో తెలియక కొంత కళవళపడ్డాడు కాని, ప్రారంభించాక ప్రవాహంలా చెప్పుకు పోతున్నాడు, మార్క్. ఆమ్మాటల తాకిడికి తట్టుకోడానికా అన్నట్లు వాల్కోవ్ తనరెండుచేతులనూ తలకుఆనుకున్నాడు. ఈ ప్రపంచంలో తన ఆత్మకథను వినిపించుకొనడానికి దొరికిన వాడు పెరెస్వెటావ్ ఒక్కడే.

తనప్రసంగం ముగించగానే, వృద్ధుడు అసలు ప్రస్తావనకు వచ్చి సూటిగా అడిగాడు :

"ఇంతకూ, మనసిద్ధాంతంలో నీకు గట్టినమ్మకం కుదిరిందా లేదా చెప్పు."

మార్క్ తల గుండెలమీద వ్రాలిపోయింది. చాలసేపటి వరకూ ఆలోచనా సముద్రంలో మునిగిపొయ్యాడు. కొంత సేపటికి, తెప్పరిల్లి, సావధానంగా అన్నాడు, "నాకింకా నమ్మకం వున్నదా? ఏమో. చెప్పలేను. ఇప్పటికి నాకొక్కటె కానవస్తోంది. ఎటుచూసినా చెరుపే. అర్థరహితమైనట్టిన్నీ హానికరమైనట్టిన్నీ చెరుపు నా విశ్వాసాన్ని కృంగదీస్తోంది. కాని నేనా చెరుపును గుర్తించను. ఆ చెరుపు అనివార్యమని నేను భావించనుకూడ. అందరిలాగే నేనూ అనుకునేవాణ్ణి కలపను కొట్టేటప్పుడు కొన్ని పేళ్ళు చెదిరిపోకమానవని. కాని, నాకు యీ కమ్యూనిస్టు కలపంటే అన్ని చెదిరిపోయే పేళ్ళే కాని మిగిలేకలప కనిపించడం లేదు. పేళ్ళు నిర్మాణానికి పనికి రావు. ఒకప్పుడు నేను పార్టినుండి పైదొలగినా కాలాన్ని,

శక్తిని, స్వేచ్ఛను సిద్ధాంతల మనుగడకూ, పరిరక్షణకు వినియోగిస్తా మనుకున్నాను. వాటిని మనం రక్షించుకొనక పోతే, కొంతకాలానికి సిద్ధాంతాలే అడుగున పడిపోతాయి. అవే అడుగున పడినప్పుడు బ్రతుకే అంధకార బంధురమై పోతుంది....

వాలొస్కావ్ లేచాడు. మార్క్ చెవిలో యేదో గొణిగి భయపడుతూ, భయపడుతూ యిలాఅన్నాడు:

"నాకర్థమైంది మార్క్; నిన్ను గురించి నీకన్నాకూడా నాకు బాగాఅర్థమైంది. నీకూ, నీతరంవారికీ, మేమూ, మాతరం వారమూ ప్రచారంచేశాం; సిద్ధాంతాన్ని గురించి బోధించామే కాని, దాన్ని పరిరక్షించుకునేమార్గం నేర్పలేదు. మేము... అన్నిటికన్న భయంకరమైనది మాముసలివాళ్ళం—యేదో నేర్పామే కాని, అదేమిటంటే, చెప్పలేకుండావున్నాం...ఇది మాత్రం జ్ఞాపకంవుంచుకో, నాయనా. పార్టీని విసర్జించేవాళ్ళు యెవరికీలేరు; అలాప్రతీవారు పార్టీనుండివైదొలగిపోతూంటె, దుర్మార్గులూ, స్వలాభపరాయణులూ, దురాశాపరులూమిగిలి పోతారు. ఇంతకన్న యిప్పుడేమిచెప్పలేను. ఇప్పటికే చాలా ప్రసంగించాను. కాని, నువ్వుమాత్రం పార్టీనివిడిచి వెళ్ళడానికి వీల్లేదు. ఏవిధంగాచూసినా, నీవు పూర్వానికీ, యిప్పటికీ ఒక లాగేవున్నావు. ఎటొచ్చి ఇప్పుడున్న సందేహాలప్పుడుండేవికావు. అంతే భేదం, సంతోషం....ఐతే, ఇప్పుడు నీవిధులేమిటో నీకు చెప్పవలసివుంది"

వోలొస్కోవ్ చెప్పినదానినిబట్టి మార్క్ చెయ్యవలసిన విధులేమో బాగాఅర్థమయ్యాయి. సోవియట్ యూనియన్‌లో

వున్న వెర్వేరు 'రిపబ్లిక్'లు ప్రతీనెలా తమతమ కార్యనివేదిక లను కేంద్రప్రభుత్వానికి పంపిస్తూవుంటారు. మార్క్ వీటిని జాగ్రత్తగా పరిశీలించినమీదట క్రోడీకరించి, సమీక్ష నొక దానిని రూపొందించి. కేంద్రప్రభుత్వ పరిపాలనావిధానాల స్థానికప్రభుత్వాలమీద యెటువంటి ప్రభావంకలిగివుంటాయో యోచించాలి. దీనికితోడు, ప్రత్యేక కార్యక్రమాలు వప్పగించ బడుతూంటాయి.

క్రెమ్లిన్ రక్షణాధికారి ఒకడు గదిలోకి తొంగిచూసి తనతో కూడ రమ్మన్నాడు మార్క్‌ను. "బహుశః ప్రధమశాఖాధి పతి నీతో మాట్లాడదలచాడనుకుంటాను." అన్నాడు వాల్కోవ్ రక్షణాధికారి బయటకువెళ్ళగానే "క్రెమ్లిన్‌లో యుద్యోగిగా యెలామసులుకోవాలో మొదటిపాఠాలు అక్కడ నేర్చుకుంటా వన్నమాట. నిజమె వోల్కోవ్ ఊహించింది. మార్క్ తిన్నగా ప్రధమశాఖాధిపతి కార్యాలయానికి తీసుకుపోబడ్డాడు.

"ఇప్పుడుచెప్పబడే సూచనలను బాగావిని నువ్వు వాటిని కంఠస్తంచేసుకోవాలి," అన్నమాటలు మార్క్ విన్నాడు. ఈ మేడ పై అంతస్థుమీద నువ్వునడచేటప్పుడు యెప్పుడూ కుడివైపుకు మళ్ళాలేకాని, యెడమవైపునకు మళ్ళకూడదు. ఎడమవైపున కామ్రేడ్ స్టాలిన్ స్వంతకార్యాలయాలున్నాయి. క్రెమ్లిన్‌లో యెక్కడ ఏయేగదులున్నాయని యెవరినీ, యెప్పుడూ అడిగి తెలుసుకొనడానికి ప్రయత్నించకూడదు. నాయకుల ఆంతరంగిక జీవితవిశేషాలనుగురించి తెలుసుకొనడానకికాని, వాటిప్రసక్తి తేవడానికిగాని నీవు యెట్టిప్రయత్నమూ చెయ్య

కూడదు; అథవా, తెలిసినా, ఆ సమాచారాన్ని మరొకరికి అందించకూడదు. ఎక్కడా యెవరితోనూ మాట్లాడకూడదు. ఈకూడనిపనులు చెయ్యడానికి సాహసించినవో చిక్కులలో పడ్డావన్నమాటే. పనిగంటలలో నీవు క్రెమ్లిన్ విడిచి యెక్కడకూ వెళ్ళకూడదు; తప్పనిసరిగా వెళ్ళవలసివస్తే ఫలానా టెలిఫోను నెంబరుకు ఆసంగతి తెలియచేసి మరీ వెళ్ళాలి. పని వేళల్లో క్రెమ్లిన్ ప్రైవేట్ ఎక్స్ఛేంజినిమాత్రమే వాడుకుంటూ వుండాలి; పై నెంబరు యేదైనా కావలసివస్తే ఫలానా నెంబరు యిమ్మని ప్రయివేట్ ఎక్స్ఛేంజిని అడగాలి. నేచెప్పినదంతా అర్థమయిందా, యిప్పుడు?" అనిప్రశ్నించాడు ఆఅధికారి.

"అయింది" అన్నాడు మార్క్. తాను తెలుసుకొనవలసిన దంతా అయినట్లు, కాని, యింకావుంది.

"సరే, తనువాతవిషయం. నీవు నీవ్యక్తిగతజీవితం విషయంలో చాలా జాగ్రత్తగావుండాలి...కామ్రేడ్ సురోవ్! స్త్రీలు అనేకఅనర్థాలకు కారణంబోతూంటారు. నేనిప్పుడు, ఒకపురుషుడు వేరొక పురుషునితో మాట్లాడుతున్నట్లుగా నే మాట్లాడుతున్నాను. నీయీవయస్సులో ఆడవాని సాంగత్యం సాహచర్యం చాలా అవసరం. అంటె, నువ్వు పెళ్ళిచేసుకొనడం చాలామంచిది. నీదృష్టిలో యెవరైనా యీపాటికి వుండే వుంటారు?"

"ఊఁహుఁ, ఎవ్వరూలేరు". అని ముక్తసరిగా తేల్చేశాడు మార్క్.

"ఎంతవిచారకరం" అని నిట్టూర్పువిడిచాడు అధికారి. "పెళ్ళి చేసుకొనకపోతే, నీవు ఆడవాళ్ళతో యెలామసలగలవు? నాకు

తెలిసినంతవరకు, నీకు చిలిపిచేష్టలంటేకిట్టవు. ఆసంగతి, ఖబ్రావస్క్‌లో జపాన్‌వాళ్ళు ఆపిల్లను తీసుకుపోయినప్పుడు నీవు పడినబాధనుబట్టే అర్థమైంది. కాని, చిలిపిచేష్టలవల్లకూడా కొన్నిలాభాలు లేకపోలేదు. నీఅభిమానాన్ని చూరగొనని యువతి, యెంతసేపూ నువ్వుచెప్పినంతవరకే వింటుంది. కాని, తనకు కావలసినసంగతులను నీవద్దనుండి రాబట్టలేదు. చిలిపిచేష్టలు నీకు కిట్టవంటే నీవుసాధారణుడవుకావనీ, ప్రమాదస్థుడవనీ మేం అర్థంచేసుకోవలసివుంటుంది. ఎందుకంటే, నీలాంటివాళ్ళు ప్రేమించడంజరిగితే, ఆప్రేమకలాపంలో యెంతవరకైనా వెడతారు. నీకునచ్చినయువతి మాఅంగీకారానికికూడా గురిఅయినదీ, విశ్వాసాన్ని చూరగొన్నదీ అయితేసరి, ప్రమాదంలేదు; కాని, ఆయువతి నీకుతగినదికాదనితోస్తే అప్పుడొస్తాయిచిక్కులు. కథ అడ్డంతిరుగుతుంది; అసలుకే మోసం వస్తుంది. సుఖాంతంగానడవదువ్యవహారం."

"ఇదంతా అనవసర సంభాషణేమో నని నాఅభిప్రాయం" అన్నాడుమార్క్ తొణుకుబెణుకులేకుండా. "నేను ప్రేమకలాపంలో దిగుతాననుకోవడం నిరాధారం, అసంభవం; కాబట్టి మీరు భయపడ నక్కర లేదు.''

"రాగల ప్రమాదాలను ఊహించి వాటిని, సాధ్యమైతే, నివారించడమె నాపని, కామ్రేడ్‌సురోవ్. నువ్వు పెళ్ళిచేసుకునేవరకూ నీతీరికవేళల్లో, యెక్కడెక్కడ, ఉంటూంటావో, యెవరెవరితో మసలుతూవుంటావో మాకు తెలియాలి; ఇతరులతో, కలసివుంటూంటే, ఆకూటంలో యేమేమి జరుగుతూవుంటుందో మాకు తేలుస్తూవుండాలి; నీయింటికెవరైనావస్తే

మాకు వెంటనే తెలియజెయ్యాలి; ఆసంగతిని యిప్పుడు నీకిచ్చిన టెలిఫోన్ నెంబరుకు వెంటనే తెలియజెయ్యాలి; నీ యింటికివచ్చే అతిథుల్లో ప్రతిసారి నీ కపరిచితమైన వ్యక్తి ఒకరు ఉంటూవుంటారు. కాని, వారినికూడా నువ్వామన్నించి, గౌరవించాలి. ఇప్పటికీపాఠాలు చాలు."

క్రెమ్లిన్‌లో పని ప్రారంభించి యెంతో కాలం కాకపోయినా, అతనికి జీవితమంతా దుర్భరంగా తోచింది. నిరాశ, నిస్పృహ నానాటికీ హెచ్చుతూ వచ్చాయి. తానుచేసినపని యెంత మాత్రం సహేతుకంగా తోచలేదతనికి. ఏదో మహోన్నత పర్వతశిఖరానికి తీసుకుపోబడుతున్నవాడిలా తోచిందతనికి. క్రిందిస్థాయిలో వ్రజానీకంలో సంక్షోభం, సంకులసమరం జరుగు తోంది. తానున్న శిఖాగ్రంమీదమాత్రం ప్రశాంతత ఆవ రించింది. యుద్ధఘోషకాని, గాలితాకిడికాని తనను జేరటం లేదు. అదొక మృత్యుదేవత సామ్రాజ్యంలా వున్న దతనికి. కాని, తానుమాత్రం, నిజంగా, ఆమృత్యులోకానికి చెందనని అతనివిశ్వాసం. తనప్రపంచం అడుగునవుంది. ఎక్కడప్రజలు, నిర్మిస్తూ, పాడుచేస్తూ, పాడుచేస్తూ, నిర్మిస్తూ దుర్భరక్లేశాల ననుభవిస్తున్నారో ఆదిగువప్రపంచమె అతనిది. వాల్కోవ్ ఆట్టే మాట్లాడలేదుకాని, ఆయన దయార్ద్రకరుణాకటాక్షాలలో "చూచి గ్రహించునాయనా," అన్న ఆజ్ఞ, స్పష్టంగా గోచ రిస్తోం దతనికి.

"క్రెమ్లిన్ విడిచి వెళ్ళిపోవాలని వుందినాకు" అన్నాడు ఒక నాడు మార్క్ ఆయనతో. "ఇలాంటిపనికి నేను తగినవాణ్ణి

కాను. ప్రతిరోజు నేనేదో మహాపరాధం చేస్తున్నట్టనిపిస్తోంది నాకు. ఈప్రపంచంతో సంబంధంలేనివాడిలా బ్రతుకుతున్నాను నేను.... ఇది నేనింక భరించలేను. నాకు విముక్తి కలిగే మార్గం దయచేసి తెలపివ్వండి."

"ఎక్కడికి?" అని అడిగాడు వాల్కోవ్, "ఎక్కడికి వెళ్ళ దలచావు, మార్క్?"

"నాకుప్రజలలో కలసిపోవాలని వుంది. నాజీవితంకూడా వారిజీవితాలలో కలిపెయ్యాలని వేగిరపడుతున్నాను.

"ఆసంగతి నాకేనాడో తెలుసు" అన్నాడు వాల్కోవ్. కాని, క్రెమ్లిన్ నుండి బయటపడడానికి నీకు నేను సహాయం చెయ్యలేను. ఒకవేళ, సహాయం చెయ్యగలిగినా, చెయ్యను కూడా. ఏకొద్దిమందికోగాని, లభ్యంకాని మహదవకాశం నీకు లభ్యమైంది. ఇక్కడ నీకు లభించే అనుభవం యింకెక్కడా దొరకదు. అది ముందుముందునీకు చాల ఉపకరిస్తుంది. ప్రజలుదగ్గర విషయాలనే చూడగలరు; కాని, కొన్నికొన్ని విషయాలను దూరంనుండి కూడ చూడవలసిన ఆవసరం యేర్పడుతుంది. అదిచెయ్యడ మెలాగో చూసి నేర్చుకో.

అలాగేమార్క్ చూస్తూ, నేర్చుకుంటూ వుండేవాడు. అతడు నేర్చుకున్నదల్లా ప్రభుత్వం అనిచెప్పదగినదిమాస్కోలోలేదని. వార్తాపత్రికలలో తరచు నాయకులని దొడ్డనామం డేపేర్లుగలవారు ప్రభుత్వంగా పరిగణింపబడుతూన్నా, ప్రభుత్వంమాత్రం కాదు. వారు సభలుచేస్తూంటారు; చూడవచ్చిన వారికి దర్శనమిస్తూవుంటారు. కాని, వారికీతెలుసు, వారి దర్శనానికి వచ్చినవారికీ తెలుసు, అదంతా ఒకపెద్దనటన అని.

నిర్ణయాలేమీ వారివల్లకావు. ప్రధాన నిర్ణయాలన్నీ స్టాలిన్ కార్యాలయంలోనే అయిపోతూ వుంటాయి. అక్కడ నుండి ప్రవహిస్తూంటాయి. ప్రజాజీవితం మెలానడవాలో శాసించే విధానాలు, ఉద్యోగాలు, బహుమానాలు, శిక్షలు—స్టాలిన్ ముద్రపడకుండా యేపనీ జరుగదు. ఆగదు.

ఆనాడు మార్క్ ఇరవైయేడవ పుట్టినరోజు. మనస్థిమితం లేకపోవడంవల్ల, పనిలోకి వెళ్ళకుండా యింటివద్దనే వుండిపోవడానికి శెలవుతీసుకున్నాడు. తల్లిమొక్కడకో వెళ్ళడంవల్ల ఒక్కడూ ఉండలేక వాల్కోవ్ దగ్గరకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. వాల్కోవ్ అంతకు కొన్నాళ్ళకు పూర్వం జబ్బుపడి అక్కడికి రెండుగంటల కారుప్రయాణ దూరంలో వున్న ఒక ఆస్పత్రిలో చికిత్సపొందుతున్నాడు. వెళ్ళేముందు, తనకు తెలిసినవున్నవాళ్ళ నెందరినో విందుకు టెలిఫోన్‌లో ఆహ్వానించాడు. సిసలైన స్నేహితు డనేవా డెవడూ లేరతనికి.

వాల్కోవ్ బాగా అస్వస్థతగా వున్నట్లు గ్రహించాడు మార్క్. జబ్బుచేసినప్పటినుండి మరీ ముసలివాడులా కనిపిస్తున్నాడు. అస్థిపంజరానికి చర్మం తొడిగినట్లుగా వుంది ఆయనవాలకం. కళా విహీనమైన అయనముఖం యెంతగా పాలిపోయి శుష్కించి పోయిందో, అతని శిరోజములూ, గడ్డమూకూడ అంతగా తెల్లబడ్డాయి. ఐతే, నీలాలవంటిఅతని కండ్లు శుష్కించిపోయిన చెక్కిళ్ళ ముందర మరీ పెద్దవిగా కనుపిస్తున్నప్పటికీ, ఆరనిజ్యోతులవలె ప్రకాశిస్తున్నాయి.

ఇద్దరూ కలసి హాస్పటల్ చుట్టూవున్న చెట్లగుబురులలోకి వాహ్యాళికి బయలుదేరారు. అదివర్షాకాలం; నీటిబిందువులలో తడిసిన ఆకులయొక్కయూ, గుల్మములయొక్కయూ వాసనతో మిశ్రమమైనగాలి మరింత నిరుత్సాహకరంగా వుంది.

"వర్షాకాలంఅంటె నాకిష్టంలేదు" అన్నాడు వృద్ధుడు.

"దాన్నితలుచుకుంటె నాకు మృత్యువే ప్రత్యక్షమై పరిహసిస్తున్నట్లుంటుంది, నాజీవితంలో యీదశవర్షకాలసదృశం అని పిస్తూవుంటుంది. ఇన్నాళ్లైనతరవాత, సక్రమపంథానుపట్టడం సాధ్యమయ్యేపనికాదు. కాని, నువ్వుదాన్నిగురించి అన్వేషిస్తూవుండాలని నాకోరిక. నీవింకాతరుణుడివి; ధైర్యసాహసాలుకలవాడివి. కనక, నీకాసక్రమపంథా దొరికితీరుతుంది."

అలామాట్లాడుతున్నకొద్దీ ఆయాసంయెక్కువైంది. పెద్దపెద్దలఘర్మబిందువులతని నుదుటిమీాదనిలచివున్నాయి.

"అదేమో నాకుతోచకుండావుంది." అన్నాడు మార్కు మథనపడుతున్న కంఠంతో, "దానికొరకు అన్వేషించడం మంచిదో, లేకపరిపాలనావిధానంతో రాజీచేసుకొని, స్టాలిన్‌ను పొగిడి పెండ్లిచేసుకొని విశేషసంతతినికని, జీవితాన్ని సుఖవంతం చేసుకొనడం మంచిదోకూడా నేనునిర్ణయించుకోలేక పోతున్నాను. ఇంతకూ. స్వవిషయాన్నిమాత్రమే పట్టించుకుని,అందుకొరకు పాటుపడేవాళ్ళే, సంఘంకోసం పాటుపడుతున్నామనేవాళ్ళకన్న సుఖంగావున్నారనడం యదార్థంకాదా?"

"మనుష్యులలో యెన్నిరకాలవాళ్ళున్నారో, సుఖాలలో కూడా అన్నిరకాల సుఖాలున్నాయి." అన్నాడు వాల్కోవ్

చికాకుగా. "కాని, యేకార్యం చెయ్యడంవల్ల అనుకూలంగా నీకృషి చిర స్థాయి అయిపోతుందో, లేక, యేకార్యం చెయ్యడంవల్ల లోకం ఉత్తమవస్థతులలో నడుస్తుందో ఆకార్యాచరణలో నీకుకలిగే ఆనందమే ఆనందం, ఆసుఖమేసుఖం. నీవు ఇరవై అయిదు సంవత్సరాలకుపూర్వం పుట్టివుంటె నీవూ మాలాగే—మాతరం వాళ్ళలాగే—విప్లవసంఘాలలో చేరడం బ్రహ్మానందంగా భావించి వుండేవాడివి. నీవు ఆతరవాత యీలోకంలో అడుగుపెట్టావు. అందుచేత మాకాలంలో జరిగిన నేరాల ఫలితాలను దిద్దడానికి నీకు అవకాశంవుంది. ఔను, అదినిజంగా నేరమే——సందేహం లేదు. నేరాలుచేస్తూ, ఈలోకంలో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను నెలకొల్పాలనుకున్నాం. అవే అధికార ఆరోహణానికి సోపానా లనుకున్నాం, కాని నేరంనుండి నేరమే ఉద్భవిస్తోంది. అంటె దేశంలో యీనాడు యెక్కడచూచినా మాబోటివాళ్ళే వున్నారు. ఏమిచెయ్యాలో, మనలనందరినీ పీడించె యీదుష్ట శక్తులనుండి యెలావిముక్తిపొందాలో, చివరకు ఆదుష్టశక్తుల స్థానంలో దేన్ని నెలకొల్పు కోవాలో తెలియక కొట్టుమిట్టా డుతున్నాం. ఈపరిస్థితి తలచుకొన్న కొద్దీ నాకు భయం వేస్తోంది. నేనా పెద్దవాణ్ణి అయిపోవడంవల్ల సంస్కరించేశక్తి సన్నగిల్లింది. పోయేటప్పుడు, చెవులు బ్రద్దలయేటంత చప్పు డుతో తలుపులుమూసి నేను వెళ్ళిపోతాను. నీకూ యిది భయంకర పరిస్థితేకాని నువ్వింకా చిన్నవాడవు. ద్వేషించడం నీకీపాటికి తెలిసివుంటే అన్వేషణ చేస్తూవుండు. ద్వేషించడం ప్రారంభించావు కదూ?

మార్క్ మాట్లాడలేదు. స్టాలిన్ విధానాన్ని, చివరకు స్టాలిన్‌ను కూడా, ద్వేషిస్తున్నట్లు వొప్పుకోవడంకూడా ప్రమాదమేనని అతడు భయపడ్డాడు.

తనప్రశ్నకు సమాధానం యేమి వస్తుందో తెలుసుకోవాలనే కుతూహలం వాల్కోవ్‌లో లేదుకూడ.

'మరి యీ చెట్ల గుబురుల్లో యిలాతిరుగాడుతూ వుండిపోయావేమిటిమార్క్' అన్నాడు ఉన్నట్లుండి మందహాసంచేస్తూ 'ఈపాటికినువ్వు మాస్కోకు వెళ్ళి వుండవలసింది. ఈ రాత్రి నువ్వు చెయ్యాదలచిన విందు సంగతి మరిచావా? ఆ సంగతిని ఫస్టుడిపార్టుమెంటు రిజిస్టర్లలో నమోదు చెయ్యడం మాత్రం మరచిపోకుసుమీ! తరవాత బాధ పడవలసి వస్తుంది.'

వాల్కోవ్ చెప్పినవిషయాల నన్నింటిని మననం చేసుకుంటూ మార్క్ అన్నాడు. 'ఒకవేళ, యెక్కడైనా జరిగిన పొరపాట్లను చక్కదిద్దడానికి ప్రయత్నిస్తే యెలా వుంటుంది, వాల్కోవ్?'

'అలా అడుగుతావని నాకు తెలుసు, మార్క్. కాని, నే నెప్పుడూ, ఒకటేమాట చెబుతానువిను. స్టాలిన్ అంతరించినా పరిస్థితులు మారేదిలేదు. మామూలు ధోరణిలో యిప్పుడున్న మోస్తరుగా లేకపోయినా చాలా కష్టంతో. ప్రమాదభరితమైన పని. కష్టంమాట, ప్రమాదంమాట అలా వుంచు; దానివల్ల ప్రయోజనంకూడా అంతగా వుండదని నా తాత్పర్యం. ఆయన పోయినా, పరిపాలనావిధానం అలా సాగిపోతూనే వుంటుంది. అతని అనంతరం, యింతకన్నా కూడా

బాగావుండవచ్చు, ఇప్పుడు కావలసింది స్టాలిన్ చావు కాదు. ఆవిధాన విధ్వంసం; నిర్మూలనం.'

మార్క్ అతిథులు రావడానికి ఒక అరగంట పూర్వం చక్కని ఒక యువతి మార్క్ తలుపుగంట మ్రోగించింది.

'కామ్రేడ్ సురోవ్ మీరేనా?'

'ఔను'

'నేను మీ పదమూడవ అతిథిని'

ఫస్టు డిపార్టుమెంటు క్రెమ్లిన్ గార్డునుండి యెవరో ఒకయువకుణ్ణి తన యింటికి అతిథిగా పంపుతారనీ, అతడువచ్చి తన బసలో ఒక మూలగా జరిగినదంతా చూస్తూ సంభాషణలన్నీ వింటూ వుంటాడని భావించాడు; కాని, యీవన్నెల విసనకర్ర దాపురమైంది'.

మొదట్లో పురుషులే అతిథులుగా వుండడానికి నిర్ణయమైనా అనుకోకుండా, స్త్రీ ఒకర్తె ప్రాప్తమైంది. ఆమె వుండడంవల్ల వారిస్వేచ్ఛకు, ఉత్సాహానికి అంతరాయం కలగవచ్చునని మార్క్ భావించాడు. కాని, యిలాంటి సందర్భాలలో మెలామసలాలో హెలీనాసెర్లిన్‌న అనే యీమెకు మంచి అనుభవమె కుదిరింది. ఎంతబాగా యిలాంటిసందర్భాలకు ఆమె నప్పిందంటే, విందుప్రారంభంనుంచీ యెరమరికలు లేక స్వేచ్ఛగా అతిథులందరూ రాజకీయాలు తప్ప ప్రతి విషయాన్ని చర్చిస్తూ, అందరూ పురుషులవలె వినోదంగా కాలక్షేపం చేస్తున్నారు.

అర్ధరాత్రి దాటింది. వీధిలో గణగణమంటూ ద్వారాని కున్న గంట మ్రోగసాగింది. తలుపుమీదగట్టిగా తట్టుతు

న్నట్టుకూడా శబ్దంవినిపించింది. మార్క్ ఆశ్చర్యంతో తృళ్ళి పడి, యెవరై వుంటారా అని ఒక్కవిసురున వెళ్ళి తలుపు తెర చాడు.

'మీఅన్నయ్యలనే మరచిపోయావుట్రా?' అని కోర్నియా ఉరుముతూంటే, అతని వెనుకనున్న సైమన్ అతణ్ణి తోసుకుని లోపల ప్రవేశించాడు. సైమన్ మార్క్‌ను యించుమించుగా పైకెత్తి కుదేశాడు.

'ఆదరాబాదరాగా వచ్చేశాం; తొందరపడ్డాం; మార్క్ మాకోసం నిరీక్షిస్తుంటాడని భావించాం. కాని తలుపైన తియ్యందే!"

మార్క్ సైమన్‌ను గాఢంగా కౌగలించుకుని కోర్ని వైపు చూశాడు.

'ఎంత అందంగా వున్నావు, కోర్ని! సలక్షణంగావున్నావు!'

కోర్ని పకపకా నవ్వాడు, ఇప్పుడతడు లెఫ్ట్‌నెన్ట్ జనరల్ గావున్నాడు, అతనికి కొత్తగా యివ్వబడిన ఆ నీలివర్ణపు బంగారుజరీ, యూనిఫారం, తళతళలాడే బాడీ ఆబొత్తాములు విశాల వక్షస్థలాన్ని ఆక్రమించి దేదీప్యకాంతులతో మెరసిపోతున్న పతకావళి అతని సౌందర్యాన్ని యినుమడింప జేశాయనీ, చాలా ఆకర్షణీయంగా వున్నాడనీ, తనతో యెవరైనా అంటే ఆయన కెంతో ఆహ్లాదంగా వుండేది.

సైమన్, కోర్నీకి పూర్తిగా విరుద్ధం, కొన్ని నెలల క్రితం అతణ్ణి చూసి నప్పుడే యెంతగానో బాధపడ్డాడు మార్క్. పాతకాలపుఫక్కీలో కోటు, సరిపడీసరిపడని టోపీ, చౌకబారు 'సూటు. 'టై' లేని షర్టు, అందవికారంగా బరువుగా

వున్న బూట్లు ధరించివున్నాడు సైమన్. కాని, మార్క్‌కు విచారం కలిగించినది అతనిదుస్తులు కాదు. అతనిముఖంలో కానవస్తున్న దైన్యాదుఃఖ్యాలు. అతని కళ్ళు. ఆవేదనా పూరిత దృక్కులు మరువరాని భీతిని స్ఫురిస్తున్నాయి. తెల్లగా పాలిపోయి, శుష్కించి వున్నాడు. శూన్యంగా వున్న అతని జేబులుమాస్తే చివరిరోజులలో అతడు కష్టాలు పాలు కాకతప్పదని ఆందోళన ఒకటి స్ఫురిస్తోంది.

మార్క్ తనఅన్నలను లోనికితీసుకుని వెళ్ళి అతిథులకు పరిచయంచేశాడు. సైమన్ తొందరగా తనచేతిని కరచాలనం కొరకు ముందుకుచాచి, అనంతరం దూరంగా ఒకమూల కూర్చున్నాడు. కాని, తనకుపరిచయం చేస్తుంటె, కొర్నె ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైనప్పుడు వొలకబోశాడు. అతడటువంటి మిత్రబృందంకోసమె అవతరించాడా అన్నట్లు మసలుతాడు, వెంటనే అక్కడచేరిన పదిమంది ఆకర్షణకు పాత్రుడయ్యేవాడు, ఆధునికనాట్యపద్ధతులన్నీ అతనికి బాగా తెలుసు, కథలనూ యెంత చమత్కారంగా చెప్పూకుపోయేవా డంటె, అతిథులు లేవబోయేసరికి తెల్లవారుతోంది.

కొర్నె పడుకోనడానికి ఎక్కడికో హోటలుకుపోయాడు. సైమన్‌మాత్రం మార్క్‌వద్దనే, వుండిపోయాడు, ఇద్దరూ చీకట్లో కూర్చొని యెవో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

''మరి సైమన్, నీముందు సంగతితేమిటి?" అని అడిగాడు ఉన్నట్టుండి మార్క్

"నాకు తెలియటంలేదు, మార్క్" అని జవాబిచ్చాడు సైమన్ ప్రశాంతంగా: "అంతా అయోమయంగా వుంది;

ఇదంతా అర్థంచేసుకోవాలంటే చాల తెలివితేటలు, నిగ్రహం చిత్తశాంతి వుండాలి. ఒకటిమాత్రం స్పష్టమైంది.—మనంపట్టిన మార్గం మనలను మనగమ్యస్థానానికి చేర్చలేదని. నేను 'పార్టీ' పనిని పట్టించుకోవడం మానేశాను. కారణం, నాకందులో విశ్వాసం తగ్గిపోయింది. మనం ఆదర్శాలకొరకు ఎంతయెక్కువగా త్యాగాలను చేస్తున్నామో అంతగా దూరమైన పోతున్నాం. హింసా సిద్ధాంతాలతో ప్రపంచాన్ని పునర్నిర్మించడం కుదరను, మార్క్. అన్నిమార్గాలను పట్టాలి; హింస నుండిహింసే ఉద్భవిస్తుంది. కాబట్టి, మనం వేరుదారులను త్రోక్కకతప్పదు, నాకుమాత్రం వాటినిగురించి ఆలోచించే శక్తిలేదు. మాతరం విప్లవజ్వాలలలో భస్మీపటలం అయిపోయింది. మాశక్తి మాకోరికలు, మావిశ్వాసం ఆ అగ్నికి ఆహుతి అయిపోయినాయి. మేముపట్టిన దారి పెడదారి అని తెలుసుకునేటప్పటికి మాశక్తిసామర్థ్యా లుడిగాయి. వేరొక దారి కనుగొనడం మాకు దుస్సాధ్యమైంది.

"కాని, మాతరం మాత్రం?" అని యెదురుప్రశ్న వేశాడు, మార్క్.

"మీతరంవాళ్ళు మేం చేసినతప్పులను దిద్దగలరు. ఏం? నీకలా తోచడం లేదు? మా ఆశలన్నీ నీలోనూ, నీవంటివారిలోనూ పుంజీభవించివున్నాయి. మేము భస్మమైపోయాం. అందుచేతనే, స్టాలిన్ మమ్మల్నీ దేశాన్నీ తనయిష్టం వచ్చినట్టు ఆడిస్తున్నాడు. భస్మరాశిని ఉఫ్ఫున ఊదెయ్యడల చాల సులభం. పాతకాలపువాళ్ళమైన మేము పట్టవలసినదారి ఒకటే ఉంది. అదే మా అంతిమ ప్రయాణం— రాజకీయసమాధి."

టెలిఫోన్ మ్రోగింది. మార్క్ రిసీవర్ అందుకున్నాడు. ఒక అపరిచితకంఠం మాట్లాడుతోంది;

"మీకు రాత్రి టెలిగ్రాం ఒకటి వచ్చింది."

"ఊఁ, చెప్పండి." అని అడిగాడు మార్క్.

"మార్క్ సురోవ్" అంటూ ఆపరేటర్ చదవడం ప్రారంభించాడు. "ప్రియమైన మార్క్, నేను వెళ్ళిపోతున్నాను, శెలవు. అన్వేషణ సాగిస్తూ వుండు— నీ పెరిస్సిటోవ్."

రిసీవర్ యథా స్థానంలో పెట్టేస్తు చల్లబడిపోయాడు మార్క్. కొంచెంసేపటికి రిసీవర అందుకుని వాల్కోవ్ ఉన్న ఆస్పత్రియిమ్మని అడిగాడు. ఆస్పత్రిడైరెక్టరె స్వయంగా ఫోన్ దగ్గరకు వచ్చాడు.

"మీకు కామ్రేడ్ వాల్కోవ్ కావాలా? కామ్రేడ్ వాల్కోవ్ రెండుగంటల క్రితం తుపాకీతో కాల్చేసుకొని చని పోయాడు." అతనింకా యేమేమొ చెబుతున్నాడు కాని మార్క్‌కు, వినిపించడంలేదు. అతనిధ్యాస అక్కడ లేదు.

వాల్కోవ్ కాల్చేసుకుని చనిపోయాడు! ఎంతమాత్రం నమ్మలేకపోయా డతడు. టెలిఫోన్ నుండి వెళ్ళిపోతోంటె సైమన్ అతడిముఖంవైపు చూశాడు. పెదిమ కరచుకున్నాడు; కళ్ళు పెద్దవైనాయి.

"పెరిస్సిటోవ్ కాల్చేసుకున్నాడు!"

సైమన్ ముఖం పూర్తిగా వివర్ణమైంది. "ఆదిమాతరం— విప్లవతరం—చరమఘుడియలలో వుంది." అనిగొణిగాడు. మార్క్ ముఖం ముడతలుపడింది. ఇంచుమించు తన అన్న ముఖంమీదకు విరుచుకు పడ్డాడు.

"కాని మేము సంధ్యాకాలాన్ని సమీపించడం లేదు! ఎంత మాత్రం లేదు, దైవసాక్షిగా!"

"మార్క్ కళ్ళల్లో నీళ్ళుసుళ్ళు తిరుగుతున్నాయి. తెరచి వున్న గవాక్షంవద్దకు వెళ్ళి నిలుచున్నాడు.

"చూడు, సైమన్, యీ గవాక్షానికి వెలుపల మాస్కో వుంది. మాస్కోకు వెలుపల మన దేశం వుంది. మనతంత్రుల రక్తపు వెల్లువలలోను తల్లుల కన్నీటి కెరటాలలోను మునిగి ఆ మెళారకైనా బ్రతకాలి, సైమన్!"

బయట అరుణ రేఖలు గోచరిస్తున్నాయి.



8వ అధ్యాయం.

## సురోవ్‌లకు ఉపమానం.

మార్క్ కనుపించడంలేదని ఒకమిత్రుడు తనకు తెలియ పరచ వచ్చినప్పుడు వేరాయివనోవ్న, కొడుకు యివాన్ దగ్గర వుంటూండేది. ఇవాన్ తుర్కిస్తాన్‌లో వున్న ఒక సైనిక విద్యాలయానికి కమాండర్‌గా వుండేవాడు. మార్క్ బస తాళం వేయబడిందని కూడా, వుత్తరం వ్రాసిన మిత్రుడు తన జాబులో పేర్కొన్నాడు. స్టాలిన్ మిత్రుడైన కిరోవ్ లెనిన్ గ్రాడ్‌లో హత్యచేయబడినప్పుడు, విద్వేగంతో కొన్ని అరెస్టులు జరిగిపోయాయి. జెయిల్లో పెట్టబడ్డవారిలో మార్క్ కూడా వున్నాడని అనుమానం.

కొత్తగా తగిలిన యీదెబ్బకు సోలిపోతూ క్రోధాశ్చర్యాలతో ఆవృద్ధురాలు. సుమారు ఎనభై యేళ్ళ ప్రాయంలో రాజ ధానీ నగరమైన మాస్కోకు మరునాటి రైలులో బయలు దేరింది.

రాత్రిగడుస్తున్నప్పుడు, ఒకవంక తల్లి రైల్లో ప్రయాణం చేస్తుంటె మాస్కోలో కొడుకు మార్క్ చిన్న నలుచదరపు గదిలో యిటూ అటూ పచారు చేస్తున్నాడు. ఒక గోడకు పై భాగాన్న ఒక కిటికీ బలమైన యినుపకమ్ములు బిగింప డిబడ్వుంది. ఆకిటికీ లోంచి మార్క్ నీలపురంగు ఆకాశాన్ని చూడగలుగుతుండేవాడు. ఆగదిలో గోడకే అమర్చబడి పడుకునేందుకు, ప్రక్కన లకుబిగించబడిన ఒక బల్ల ఒక స్టూలు మాత్రం ఉన్నాయి.

లూబియాంక చెరసాలలో అదొక మూలమూలగది.

కిటికీదగ్గరనుండి ద్వారంవద్దకు అయిదు, ద్వారం నుండి కిటికీవద్దకు అయిదు, ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు పాదచ్ఛాయలు. మళ్ళీ గిరుక్కున వెనకకు తిరిగి ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఈవిధంగా మార్క్ తనగదిలో వెనకకుముందుకు అడుగులు వేస్తుంటే, అతనిహృదయంలో ఆలోచనలు కూడా వెనకకు ముందుకు అడుగులు వేస్తున్నాయి.

"చివరకు మిగిలిన దింతేనా, మార్క్? ఇటువంటి అంతిమదిశకు భయపడుతున్నావా?"

'లేదు, నేను భయపడటంలేదు. ఇలా ముగియడమె మంచిదేమో నిర్ణయానికంటూ రాకుండా."

"ఇప్పుడు నీసంగతేమిటి, మార్క్? యింకా మార్పు అంటె యెరగని కమ్యూనిస్టులేనా? ఇప్పటికీ నీవు ప్రతిదానికీ సమర్థించుకుంటున్నావా?'

'లేదు. నేనింక కమ్యూనిస్టు నెంతమాత్రం కాను. ఐతే, యెవరిని? యేమిచేస్తున్నాను? అంటే చెప్పలేనుకాని కమ్యూనిస్టును కాదని మాత్రం గట్టిగా చెప్పగలను. ఇప్పుడు జరుగుతున్న విధానాన్ని నేనెంతమాత్రము అంగీకరించను. ఇంతవరకు నేనునమ్మిన దాన్ని యిప్పుడు పూర్తిగా ద్వేషిస్తున్నాను. నాకు తెలిసినదల్లా బ్రతకాలనున్నదని; ఐతే, యెవరికోసం, యెందుకు? అంటే ఎందుకూకాదు."

కిరోవ్ చనిపోయిన మరుసటి రోజున పెర్సనల్ డిపార్టు మెంటు అధిపతి యెర్షోవ్ కార్యాలయానికి పిలిపించబడిన వారిలో మార్క్ ఒకడు. అతనివంతు వచ్చేవరకు మిట్టమధ్యాహ్నమైంది. యెర్షోవ్ తనకుర్చీలో వెనకకు జేర్లబడి మార్క్ మీదకు విసిరాడు, ప్రశ్న.

'నీకూ వాల్కోవ్ కు వున్న సంబంధం యేమిటి? నేనెవరిని గురించి మాట్లాడుతున్నానో తెలుసుకున్నావను కుంటాను."

'నేనాయనను సివిల్ వార్ రోజులప్పటినుండి యెరుగుదును. ఆయన అప్పటి పేను పెరెస్విటోవ్.' తరవాత మార్క్ చెప్పకొంటూ పోయాడు, మొదట తా మిరువురూ ఆస్పత్రిలో కలుసుకొనడం, తరవాత పెరెస్విటోవ్ రాజకీయవిద్యాలయం నిర్వహించడం మొదలైనవాటిని గురించి.

మార్క్ చెప్పడంపూర్తి అయ్యాక యెర్షోవ్ నిరీక్షిస్తున్నాడు చెప్పవలసింది యింకా వున్నదేమోనని. మార్క్ మౌనం వహించగానే, యెర్షోవ్ తలను పైకెత్తి ప్రారంభించాడు:

'నువ్వొక్క సంగతి చెప్పడం మరచిపోయావు. వాల్కోవ్ ప్రజాశత్రువుగా తయారై, శిక్షనుండి తప్పించుకొనడానికి కాల్చుకుని, ఆత్మహత్య చేసుకున్నాడని'

" ఆవిషయం నేను చెప్పేదేమిటి?' అని సమాధాన మిచ్చాడు మార్క్ ప్రశాంతంగా, "అన్ని పత్రికలలోను పడనే పడింది. నాకు ఆయనతో వున్న సంబంధం యెట్టిదని ప్రశ్నించారు కాని ఆయన ఆత్మహత్య యెందుకు చేసుకున్నాడని అడగలేదు.'

"కానచ్చు..." అన్నాడు యెర్మోవ్. ఇప్పుడు కావలసింది అతనిచావుసంగతికాదు. దాన్నిగురించి నువ్వు ప్రస్తావించకపోవడానికి గల కారణం. తెలిసిందా, సురోవ్? మౌనంలో కొంత సత్యం దాగివుంటుంది కదూ?

మార్క్ మాట్లాడలేదు.

"సరే నువ్వు వెళ్ళవచ్చు!" అన్నాడు యెర్మోవ్.

పదినిమిషాలు పోయిన తరవాత మార్క్‌కు తెలిచేయబడింది, క్రేమ్లిన్‌కు అతనిఉద్యోగం అప్పటినుండి యిక అవసరంలేదని. అతనిని పనిలోనుండి తొలగించారు. ఆ రాత్రంతా అతడు సిద్ధంగానిరీక్షిస్తూవున్నాడు. తెల్లవారుఝామున అతడున్న గదితలుపు నెవరో తట్టారు. అతణ్ణి లోబియాంకకు తీసుకువెళ్ళడానికి ముగ్గురువ్యక్తులు వచ్చారు. మాస్కోనగరం మధ్యనే చెరసాలలోకి అతణ్ణి త్రోసివేశారు. బరువైన యినప తలుపుఅతనివెనక మూసుకుపోయింది.

వేరా ఇవనోవ్న మాస్కోకు వచ్చిరావడంతోటే, కొడుకు కోసం అన్వేషణ ప్రారంభించింది. ఎన్నో ప్రభుత్వకార్యాలయాలనూ, సంస్థలను గాలించింది. రోజంతా పబ్లిక్ప్రాసిక్యూటర్ ఆఫీసుముందర పడిగాపులుపడి నిలబడివుంది. క్రేమ్లిన్ గేటువద్ద నిరీక్షింపసాగింది: గంటలకొద్దీక్యూల్లో నిలుచునేది. అయినా, మార్క్ యెక్కడవున్నదీ, యేమైనదీ యెవరూ చెప్పలేక పోయేవారు. ఎవరినడిగినా, మార్క్‌సురోవ్ సమాచారం మాకేమి తెలియదు' అనేవాళ్ళే. గంటగంటకు ఆమె ఆందోళన హెచ్చిపోతోండేది. మాటిమాటికి ఆమె "భగవం

తుడా! నే నాలస్యంగా వచ్చివుండలేదు గదా. మా కోర్ని తొందరగా నచ్చేటట్టు అనుగ్రహించు!" కోర్ని ప్రయాణమధ్యలో వుండనే వున్నాడు. అతడున్న సైనిక కార్యాలయం నుండి మాస్కోకు యేడురోజుల ప్రయాణం. సైమన్ ఆమెకు చెలిగ్రాయిచ్చాడు, "సమస్తచర్యలూ తీసుకుంటున్నాం. నువ్వు మాత్రం జాగ్రత్తగా వుండు" అని.

తలవనితలంపుగా ఆమె కోర్ని స్నేహితుణ్ణి ఒకానొక రోజున కలుసుకొనడం తటస్థించింది. ఆయన ధర్మమా అని ఆమె ఎన్. కె. వి. డికి సంబంధించిన ఒక ఉన్నతాధికారిని కలుసుకొనగలిగింది.

"నన్నేం చెయ్యమన్నారు?" అని అడిగాడతడు, ఆమె అతనికి యెదురుగా కూర్చున్నప్పుడు.

"నా కొడుకు మార్క్ సురోవ్ కోసం యెదురు చూస్తున్నాను."

"అతడిక్కడే వున్నాడనిమాత్రం చెప్పగలను. కాని, అతనికి సహాయం చెయ్యడానికి ప్రయత్నించి లాభంలేదు. అతణ్ణి యీపాటికే కాల్చి చంపకుండావుంటె, దానికికారణం అతడు సురోవ్ కుటుంబానికి చెందివుండడమె..." కూర్చున్నవాడు లేచి యింకా యిలా అన్నాడు; "నువ్వొందరినిలో పిల్లలను కన్నావు. కాని, యీ కడసారపువా డొక్కడే యెందుకూ పనికిరాకుండాపోయాడు. వాడిప్రాణభిక్షనర్థించి ప్రయోజనం లేదు. ఇక్కడికి రావడంకూడా మంచిది కాదు. ఇక్కడ నుండి అతడు సజీవంగా బయటపడడం అసంభవం.

"మీ రేమంటున్నారు?" అన్నమాటలెలాగో అతికష్టం మీద ఆమె నోటినుండి బయడపడ్డాయి.

"అటువంటివాళ్ళు బ్రతకడానికి వీల్లేదంటున్నాను."

మెల్లగా చేతిలోవున్న క్రచ్‌నానుకుని వేరా ఇవనోవ్నా లేచి నిలుచుంది. కోపోద్రేకంతో ఆమెముఖం చిట్లించుకుంది. జరా భారంతో మూతలుపడిపోతున్న ఆమె నేత్రాలు ఒక్కసారిగా ప్రజ్వలించాయి. వంగిపోయిన ఆమెనడుమును మెల్లమెల్లగా పైకి యెత్తి చేతిలోవున్న క్రచ్‌తో ఉన్నతాధికారి నెత్తిని ఒక్కపెట్టు పెట్టింది, బలంకొద్ది. ఆ అధికారి, ఆవేశంతో కంపించిపోతున్న ఆమె శరీరాన్ని నేలమీదకువిసిరేశాడు. క్రింద నున్న తివాసిమీదపడిన, ఆమె బాధతో మూలుగుతూ లేచింది. ఇంతలో నలుగురూ మూగరు.

"ఈడ్చెయ్యండి, దీన్ని" అని గర్జించాడు అధికారి. "గది లోబంధించండి." మారుమాట చెప్పకుండా, తలయెత్తుకుని, గదిలో బంధింపబడడానికి సిద్ధపడింది వేరా ఇవనోవ్నా.

సురోవ్‌తల్లితో ఆ ఎన్. కె. వి. డి. అధికారి అంత కర్కశంగా ప్రవర్తించాడంటె కారణం లేకపోలేదు. ఆరోజుల్లో సర్వేసర్వత్ర ఒకఅభిప్రాయం వ్యాపించివుండేది; ఎన్. కె. వి. డి అధికారి అయిన యగోడాను బర్తరఫ్‌చేసి అతనిస్థానాన్ని యెఝోవ్‌కు కట్టిపెట్టడానికి స్టాలిన్ చూస్తున్నాడని.అందుచేత, యెఝోవ్‌ను సంతోషపెట్టడానికి యీ అధికారి యీ పని చేశాడు. కాబోయే అధికారి యెఝోవ్‌కు తనమీద అభిమానం కుదురుతుందనీ, అప్పుడు తనకు లాభిస్తుందని యీఉద్యోగి భావించి, మార్కను యెఝోవ్‌బందీగా తీసుకుంటె,

ఆమార్క్ తల్లిని హింసిస్తే సరిపోతుం దనుకున్నాడు. కాని, దురదృష్టవశాత్తు యితనివిషయంలో అలాజరగలేదు సరికదా, దీనికి ప్రాయశ్చిత్తం కూడా అనుభవించవలసివచ్చింది యీ అధికారి.

మూడురోజుల తరవాత వేరాఇవనోవ్న చెరసాలలో ఉంచ బడింది. కోర్ని సురోవ్ వొరొపిలోవ్‌ను అభ్యంతరకార్యాలయంలో కలుసుకున్నాడు. కోర్ని మాస్కోనచ్చి కొన్నిగంటలకన్న యెక్కువకాలం గడవకపోయినా, తనతల్లికి జరిగిన భంగపాటును గురించి పూర్తిగా తెలుసుకున్నాడు. తనతల్లిని గాని, మార్క్‌నుగాని చూడడానికతనికి అనుమతిదొరకలేదు. సరికదా, వారిని విడిపించడానికి యేమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలోకి దిగజారాడు. ఇప్పుడు వొరొపిలోవ్ దగ్గరకె స్వయంగా వచ్చాడు, తనతల్లిని మార్క్‌ను అతని (వొరొపిలోవ్) రక్షణలోకి తీసుకోవలసిందిగా అభ్యర్థించడానికి.

'నిజంగా యిదంతా హాస్యాస్పదంగా వుంది.' అన్నాడు వొరాషిలోట్ కోర్నితో. ఎఝోవ్‌తో మాట్లాడిన తరవాత టెలిఫోన్ పెట్టెస్తూ ‹‹యీరోజుల్లో వింతవింత విశేషాలు జరుగుచున్నాయి. వాటికి నవ్వాలో యేడవాలో తెలియడంలేదు. కాని, భయపడకు, కోర్ని. మీతల్లి అలా అవమానింప బడడానికి వీల్లేదు ...‹పటాలం పెంపుడు కొడుకు' కు కూడా విడుదల దొరుకుతుంది.'

బందీ అయిన తరవాత మూడువారాలకు మార్క్‌కు తెలియచేశారు విడుదలకు వుత్తరువులు అందినవని. ఐతే, వెంటనే

మాత్రం మాస్కో వదలి వెళ్ళిపోవాలి. అతను వెళ్ళిపోతోంటే ‘‘అన్నట్టు మీ తల్లినికూడా విడుదల చేస్తున్నారు. ఉత్తరువులు జారీచెయ్యబడ్డాయి కూడా.’ అని తెలియచెయ్యబడింది. తనను యెవరో వెన్నుపై ఒక చరుపు చరిచినట్లు ఉలిక్కిపడ్డాడు. ఐతే తనతల్లిని కూడా జెయిల్లో పెట్టారని గ్రహించాడప్పుడు. అది నమ్మడానికి గాని, భరించడానికిగాని శక్యంగానివార్త. ఆవార్తచెప్పిన వానివైపు తిరిగి ‘‘ మా అమ్మ జెయిల్లో పడవలసినంత నిర్భాగ్యురాలు కాదు’ అని యెలాగో అనగలిగాడు.

‘‘కాకపోవచ్చు’’ అని అంగీకరించాడా చెప్పినవ్యక్తి. ‘‘కాని, అదంతా నాకనవసరం. ఆమె ఒక ఎన్. కె. వి. డి. అధికారిని కర్రతో కొట్టడంచేత వారామెను జెయిల్లో పడేశారు.’’

తన చిన్నతనంలో ఒక తెల్ల ఉద్యోగి తనతల్లిని మృగాన్ని బాదినట్లుగా బాదినట్లు విన్నప్పటినుండి యింతవరకు యిటువంటి బాధపడలేదు. ఇంతకోపాన్ని వహించనూలేదు. ఆ తెల్ల పశువు అంత అమానుషంగా ప్రవర్తించడం వల్లనె తాను కమ్యూనిస్టుగా మారిపోయాడు. కాని, యిప్పుడు కమ్యూనిస్టులె తనతల్లిని భంగపరచడంద్వారా తనను బాధించారు. దానిని అతడెన్నటికి మరచి పోలేదు.

‘మెల్లిగా వెళ్ళు’ అన్నాడు రక్షకభటుడు, మార్క్ తనతల్లి తనకొరకు నిరీక్షిస్తున్న గదివైపు పరుగెడుతోంటే. మార్క్ తొందరపాటు తగ్గిద్దామనుకున్నాడు కాని, లోపల చెలరేగిన మానసిక సంక్షోభం అతని శరీరాన్ని ముందుకు నెట్టివేస్తోంది. తల్లీ కొడుకు లొకరికొకరు యెదురైనారు. ఆమెఅతనికౌగిలిలోకి

విసురుగా పడేవరకు, ఆమె నెరసిన వెంట్రుకలు ముఖాన్ని అన రించాయి. వయః పరిపాకం తప్పిన ఆమె చెక్కిళ్ళపై కన్నీళ్ళు కాలువలు కట్టాయి.

"మార్క్, నాతండ్రీ!' అంటూ ఆతల్లి అతని బుగ్గలను పుణికి తలనిమిరి, చుంచుమువ్వి, భుజాలను చేతులతో అదిమి పట్టుకుంది."

'మమ్మల్ని మన్నించు తల్లీ అనివాపోయాడు మార్క్,"

దీనికంతకూ మేమే బాధ్యులం. తండ్రి, సోదరుల అకారణ మర ణాలకు కూడా మేమే కారణం... ..బంధిఖానాలుకట్టి, అటు వంటివారి చేతుల్లో అధికారం వుంచి నందుకు... ఇంతవరకు చేసినదానికీ, యికముందు జరగబోయే దానికీ కూడా మేమే బాధ్యులం...మమ్మల్ని క్షమించు..."

"మాట్లాడకు!" అని రహస్యంగా గొణిగిందామె "మన మందరము బాధ్యులమె. భగవంతుణ్ణి మీరు మరచి పో యారు. దాంతో, మనకంతా శూన్యంగా తోస్తోంది. ఎందు కలా జరుగుతోందో చెప్పలేనుకాని, మీరుమాత్రం దుఃఖ భారంతో కృంగిపోతున్నారు. ఇప్పటికి శాంతించు నాయనా, మనమంతా యిక్కడనుండి...మాస్కోనుండి— వెళ్ళిపోదాం మార్క్. ఇక్కడివారికి శాంతి, సౌఖ్యాలనేవి లేవు; ఎవరు చూచినా దుఃఖభాజనులె; ఎక్కడచూచినా ఖేదమె. మనం వెళ్ళిపోదాం; ఏమంటావు, మార్క్?'

'ఔనమ్మా, వెళ్ళిపోదాం; మనవూరికి మళ్ళీ వెళ్ళిపోదాం. ఆ స్టెప్పీకి......'

స్వగ్రామం చేరుకున్నాక మార్క్ అదో మోస్తరుగా, యెదో పోగొట్టుకున్నవాడిలా తిరుగుతూ వుండేవాడు. తనలో అణగిపోయిన ఆత్మవిశ్వాసంకోసం... ద్వేషంగామారి పోయిన ప్రేమకోసం .....ఆహారం నిద్ర అతనికి దూరమైనాయి, గంటలకొద్దీ ఆలోచనా సముద్రంలో మునిగిపోయి, యే గవాక్షం చెంగటనో నిలబడికాని, చతికిలబడికాని ఉండిపోయే వాడు. ప్రక్క యెవరైనా మసలుతున్నారో లేదో కూడా అతనికి గుర్తుండేదికాదు. మాట్లాడినప్పుడు వినిపించేదీ కాదు. తనతల్లి ఆందోళనపూరిత బాష్పాలుకూడా అతణ్ణి దుఃఖా న్నుండి మరల్చలేక పోయేవి.

తగిలినగాయాలు క్రమేపి మానుతూవచ్చాయి. అంతె తనదుఃఖం ప్రజ లనుభవించేదుఃఖంలో స్వల్పభాగం మాత్రమే ననీ, ప్రజలింతకన్నా దుర్భర క్లేశాల ననుభ విస్తున్నారనీ అతడు సరిపెట్టుకోసాగాడు. వెనకటి కెన్నికష్టాలు వచ్చినా తన గ్రామస్థులుయిప్పుడున్నంత దుర్దశలో లేరని అతడు భావిస్తూ వచ్చాడు. జీవితం కష్టసాధ్యం కావచ్చుకాని, కష్టించి జీవిం చాలనె సత్యాన్ని వారు గుర్తించారు. ఎంతకష్టపడి పని చేస్తే, యింటివద్ద పరిస్థితులంత మెరుగుపడతాయి! సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రాకతో యివన్నీ మారిపోయాయి. భూమిని, పశుగణాన్ని కూడా వారు వశపరచుకున్నారు. స్టెప్పీ లలో గొర్రెలు చూద్దామన్నా కంటికి కనిపించడంలేదు. ఆ యేడు పంటబాగాపండినా రైతాంగంచేతికందినది స్వల్పమే. పంటచేతికి వచ్చీరావడంతోటే, అందులో చాలా వరకు

ప్రభుత్వపరం చేయవలసివచ్చింది. పోనీ, మిగతా దైనా పం చగా తమమాత్రం వస్తుందేమో ననుకుంటె పనిచేసిన రోజు లకు యేకొన్ని పౌన్సులగింజలనో వారికి పారబోశారు. ఆ గ్రామంలో మూడు సమిష్టి వ్యవసాయక్షేత్రాలున్నాయి. ఈ మూడింటిలో ఒకదానికి టిమొతిసురోవ్ పేరుపెట్టారు. తన తండ్రిపేరుతో పిలవబడుతున్న ఆసమిష్టి క్షేత్రంవల్ల ప్రజలు దరిద్రాన్ని అనుభవిస్తూంటే మార్క్ సహించలేకపోయాడు. అది తనతండ్రికీర్తికి కళంకం అనుకున్నాడు మార్క్. ఆ సమీ పంలోనె నిర్మాణం కాబోతున్న తూటాలఖార్ఖానా పరి సరాలనుచూస్తే అతనికెంతో రోత అనిపించింది. బక్కచిక్కి చినిగిన పేలికలతో, కాళ్ళీడ్చుకుంటూ, నడవలేక నడవలేక, సాగుతున్న ఖైదీలు జట్లు జట్లుగా ఆమార్గం వెంటనడిపింప బడే వారు. సమిష్టిక్షేత్రాలకు చెందినగుర్రాలు కొనవూపిరితో, ఫాక్టరీనిర్మాణ సామాగ్రి శకటాలను లాగలేక, లాగలేక సోలి పోతూవుండేవి. వాటికి, ప్రాణావశిష్టులైవున్న ఖైదీలు సాయ పడుతూవుండేవారు.

చివరకు యెన్నాళ్ళనుండో నిరీక్షిస్తున్న శ్రీముఖం మాస్కోనుండి వచ్చేసింది. సోవియట్ యూనియన్‌లోని ఆరుముఖ్యనగరాలలో దేనిలోను కూడా, అయిదు సంవత్స రాల వరకూ మార్క్ నివసించరాదని ఆంక్షవేశారు. ఈ శిక్షకు కారణాలు తెల్పబడలేదు. చెప్పలేదనిమార్క్ కించ పడనూలేదు. తన తండ్రి నివసిస్తూ వచ్చిన గ్రామంలోనే తాను జీవితశేషంగడపాలని మార్క్ యేనాడో నిశ్చయించు కున్నాడు. 'నువ్వునన్ను పల్లెటూరి బడిపంతులివికమ్మనిలాలిం

చేదానవుకదా. అమ్మా!' అన్నాడతడు ఒకరోజున తల్లితో.
'అందుకే నేనిప్పుడా ఉద్యోగానికి సిద్ధపడుతున్నాను.'

రెండువారాల తరవాత, టిమొతి సురోవ్ సమిష్టిక్షేత్రంలో వున్న చిన్నబడిలో అడుగుపెట్టాడు. గోడకి తన తండ్రి పటం ఒకటి వ్రేలాడుతూవుంది. దానిని ఆగ్రామంలో ఉన్న చిత్రకారు డొకడు వ్రాయగా కొయ్యచట్రంలో బిగించి అక్కడ వ్రేలాడదీశారు. ఆచల్లని చూపుల నీడలలో మార్క్ అచ్చటి బాలబాలికలకు విద్య చెబుతూ వుంటాడు. మనిషి మార్పు అనేదాన్ని అంగీకరిస్తే జీవితమెంత అందంగా ఉంటుందో బాలబాలికలకు నేర్పుతూ వచ్చాడతడు. అతడి ముఖంలో తిరిగి ఆనందం తొంగిచూస్తూంది. కంఠంలో దయార్ద్రత పరిస్ఫుటిస్తూవచ్చింది. ప్రతిఉదయమూ పాఠశాలకు వెళ్ళి 'సుప్రభాతం, పిల్లల్లారా' అని పిల్లల్ని సంబోధించేవాడు. వారిలోకూడా ఆ ఆనందం తరంగిత మౌతున్నట్లు 'సుప్రభాతం, సురోవ్'' అనిజవాబిచ్చేవారు.

మార్క్ గ్రామం అతనికొక పర్యాలోకన కేంద్రంగా అనిపించింది. అచ్చటినుండీ తుపానుభీభత్సానికి లోనై ఉన్న రష్యానంతనూ అతడు పర్యాలోకిస్తూండేవాడు. మహాప్రస్థానంలో మొదటి మజిలి తగిలింది. ఎవరిభుజస్కంధాల నుండి స్టాలిన్ పైకెగరి మహోన్నతపదవి నలంకరించాడో, వారి నందరినీ ఉరికంబాలకెక్కించో, విషంతినిపించో, తుపాకులతో కాల్చో ఎవరియింట్లో వారిని హతమార్చాడు.

ఆవిధంగా మృత్యుముఖం జొచ్చినవారిలో మొదటివాడు స్టాలిన్ ఆప్తమిత్రుడూ, చిరసహవాసి అయిన ఆడ్డియొనికిడ్జి,

అతడు ప్రాణాలను వదలుతూ, టెలిఫోన్ చేతితో పట్టుకుని "నే వెడుతున్నాను, స్టాలిన్! కాని, నువ్వూ నా వెనకాతె వస్తావులే." అని టెలిఫోన్ పెట్టేశాడు. తరవాత ఎబిల్ ఎనెకిడ్జి. ఒకప్పుడు యీయన స్టాలిన్‌కిగురువు. ఆగురువును పరలోకానికి పంపించాడు శిష్యుడు. ఇటువంటివారు వందలమీద నిహతు లయ్యారు. స్టాలిన్ పట్ల భక్తివిశ్వాసాలు కనబరచిన యిటు వంటి వారందరి హత్యకూ సమాధానం, కారణం ఒక్కటె— అదే, లెనిన్ ప్రకటించినసూత్రం—వెయ్యిమంది నిర్దోషులు శిక్షింపబడినా బడవచ్చు కాని, ఒక్కదోషికూడా తప్పించుకు పోకూడదు. దీన్ని ఎఝోవ్ అక్షరాలా అమలు జరిపేవాడు.

ఇంతవరకు వధింపబడిన వారందరూ స్టాలిన్‌ను వధించాలి, స్టాలిన్ నశించాలి అని వాదించేవారు. వీరందరూ నిర్దోషులై, కొందరు, వావిలావ్‌ను పోలినవారు, స్టాలిన్ వినాశనాన్ని కోరే భావాన్ని నివారించడానికి ప్రయత్నించారుకూడ. వాల్గా ప్రాంతంలో ఉన్న సైన్యానికి అధిపతిగా వున్న తుకచేవిస్కీ కూడా అంతే. సేనాధ్యక్షుడూ, అతనిమిత్రులూ, స్టాలిన్ స్థానంలో మరొకనియంతను నిలబెట్టాలని కుట్రపన్నుతూంటె ఎఝోవ్ అకుట్రను కనుగొని ఆసేనాధ్యక్షుని స్వహస్తాలతో కాల్చి చంపేశాడు. అతనిమిత్రులను కూడా బ్రతకనివ్వలేదు. జైళ్ళన్నీ సైనికోద్యోగులతో నిండిపోయాయి. ఎన్.కె. వి.డి. అపరాధ పరిశోధకోద్యోగులకు యేవిధంకానైనా వారు తప్పులను ఒప్పుకునేటట్లు చెయ్యవలసిందిగా ఆజ్ఞలివ్వబడ్డాయి. భయంకర చిత్రవధలను చిత్రించి ప్రజలు తమ్ము తాము దూషించుకొనడమె కాక అన్యులనుకూడా దూషించేటట్లు

చెయ్యబడ్డారు. దేశవ్యాప్తంగా సేనాపతుల హత్యాకాండ పెచ్చుపెరిగిపోయింది. దీనికి బాధ్యులు యే కొద్దిమందో అయినా, క్షాళనచేయబడ్డ నిరపరాధులు మాత్రం వేలసంఖ్యలో వుండేవారు.

ఈ హత్యలనే కెరటాలలో తొమ్మిదవ కెరటం కోర్ని సురోవ్ ప్రధానకార్యాలయముల్ని చిన్నపట్టణం వరకూ దొర్లిపోయింది. మొట్టమొదట కోర్ని స్వంతసిబ్బందిలోని ఉద్యోగులు బంధింపబడ్డారు. తరవాత తరవాత, ఆనిర్బంధాలు సైనికపటాలాలలోని దండనాథులకు కూడా తప్పకపోవడంతో కోర్ని మొదట ఆశ్చర్యపడి, రాను రాను, కోపోద్రిక్తుడు కా సాగాడు. తాను, వొరొషిలోవ్‌కు వ్యక్తిగతహోదాలో పంపిన టెలిగ్రాంకు సమాధానం రాకపోవడంవల్ల స్టాలిన్ తోనే, సరాసరి, మాట్లాడాలని ప్రయత్నించాడు. కాని, అతనికా అవకాశం యివ్వబడలేదు. అతనింకా ప్రయత్నిస్తూనే వచ్చాడు. అదే సమయంలో కొందరు స్పెషల్ డిపార్టుమెంటు ఉద్యోగుల్లు అతని కార్యాలయంలోకి ప్రవేశించారు.

"బంధించడానికొచ్చారా?" అని అడిగాడు, బిగ్గరగా.

"ఔను!"

తన వ్రాతబల్లమీదనున్న బరువైన సిరాబుడ్డిని పైకెత్తి బలంకొద్దీ ఆవచ్చిన అధికారిమీద విసరికొట్టాడు. ఆ ఉద్యోగి యెలాగో, తంపిస్టల్ అడుగుభాగంతో కోర్నిముఖంమీద ఒక్కపెట్టుపెట్టి స్పృహతప్పి నేలకొరిగాడు. అతినిదేహం మీదనుండి దాటి కోర్ని ఆగదివిడచి వెళ్ళిపోయాడు. తన

ముఖంమీద తగిలిన గాయంనుండి ప్రవహిస్తున్న రక్తం ముఖమంతా అయింది. యూనిఫారం మీదకు చిందింది. వక్షస్థలంమీదనున్న పతకాలు, 'డికరేషన్లు' రక్తసిక్తమైనాయి. రెండురోజుల అనంతరం వార్తా పత్రికలలో ఒక ప్రకటన వెలువడింది. "సేనాధిపతికోర్నీ సురోవ్ ప్రజాశత్రువుగా మారిపోయాడనీ, అతనికుట్ర వెల్లడి అయినదనీ, కఠినశిక్షకు పాల్పడతాడని." అతనిసైన్యంలో వివిధశాఖలలో జరిగిన సమావేశాలు అతనిసైన్యంలో వివిధశాఖలలో జరిగిన సమావేశాలు అతని చావును కోరుతూ తీర్మానాలు చేశాయి.

కోర్నీకి ఉత్తరాలు వ్రాయడమంటె యెప్పుడూ యిష్టం లేదు. కాని, మూడుమాసాలకొకపర్యాయం యింటికి ఉత్తరం వ్రాసుకోవాలనే నిర్ణయం ఒకటి చేసుకొన్నాడు. కాని, ఆరుమాసాలైనా కోర్నీ వద్దనుండి ఒక్కమాటకూడా తెలియక పోవడంతో, యింటివద్ద వేరాఇవనోవ్నాకు, అతని సోదరులకు ఆందోళన యెక్కువైంది. మూడుమాసాల అనంతరం కోర్నీ నివసిస్తూన్న యింటియజమానివద్దనుంచి పోస్టులో ఒకవుత్తరం వచ్చింది. అందులో కోర్నీసురోవ్ బంధింపబడ్డ ఉదంతం వ్రాయబడివుంది. మూడుమాసాలక్రితం వెలువడ్డ స్థానికవార్తా పత్రిక ప్రతి ఒకటికూడా అందులో పొదగబడివుంది. అందులో "ప్రజాశత్రువు కోర్నీసురోవ్ నశించాలి." అన్నమాటలు పెద్దఅక్షరాలలో ముద్రింపబడివున్నాయి. అదిచూచి మార్క్ భయంతో వణికిపోయాడు. కాని, యదార్థస్థితిని తల్లికిమాత్రం చెప్పలేదు. వారంరోజుల అనంతరం అతడు మాస్కో చేరుకున్నాడు.

రష్యా మొత్తంమీద కోర్ట్‌ని రక్షించగలవాడు ఒక్కడు మాత్రమె ఉన్నాడు. అతడు ఒరొషిలోవ్, మార్క్‌ను రక్షించింది కూడా అతడే. ప్రతిరోజు మార్క్ వొరొషిలోవ్ దర్శనం కోసం ఆయన ఆఫీసుకు వెళ్ళి వస్తూండేవాడు. ఒరొషిలోవ్‌కు తెలుసు మార్క్ వస్తున్నాడని; కాని, ఏమిచేయడానికి తోచడంలే దతనికి. చివరకు, కలుసుకోకపోవడమె మంచిదను కున్నాడు. అప్పటికి మార్క్ మాస్కో వచ్చి పదిరోజులైంది. ఈ పదిరోజులూ, వొరొషిలోవ్, జనరల్ జోసఫ్ అపనాసెంకోతో కోర్ట్‌ని గురించి సుదీర్ఘమైన సంభాషణలు జరుపుతూనే వున్నాడు.

"ఎన్. కె. వి. డివారి చర్యలతో నువ్వేమి సంబంధ పెట్టుకోవద్దు అని స్టాలిన్ గట్టిగా నిషేధించాడు. కాబట్టి, విజేవ్‌తోనే నేమిచెప్పినా లాభంలేదు. నే నేమి చెయ్యలేను." అన్నాడతడు చివరకి.

"అదంతా నాకు తెలియదు. కాని, మనం యెలాగోయీ విషయాన్ని సాధించి తీరాలి. మనసేనాధిపతులలో ప్రచండుడన దగినవాణ్ణి మనం పోగొట్టుకొంటున్నాం. నా ఒక్క ప్రాంతంలోనే సుమారు పదిహేనువందలమంది ఖైదీలుగా తీసుకోబడ్డారంటే మొత్తసైన్యంలో యెందరుబంధింపబడి వుండాలి?'

'ముప్పయి వేలు!'

అపనాశంకో ఒక్కసారి త్రుళ్ళిపడ్డాడు. నలుపలకలుగా ఉన్న అతని ముఖం జేవురించింది. 'మూర్ఖుడైన ఆఎర్జోవ్ పందువంటి సైన్యాన్ని గంగపాలు చేస్తున్నాడు. దీని పర్యవసానం యెలావుంటుందంటావు, వొరోషిలోవ్?"

'నేనుమాత్రం యేమిచెప్పగలను?' అని తెల్లముఖం వేశాడు వారోషిలోవ్. 'ఇప్పుడు వచ్చిపడ్డ చిక్కే అది. నాకేమి తెలియనివ్వడంలేదు. మనకుకూడా ఎప్పుడు అపాయం రానున్నదో చెప్పలేకుండా వున్నాను. ఈపరిస్థితుల్లో మనం యేమాత్రం జోక్యం కలిగించుకున్నా ప్రమాదం తప్పకపోవచ్చు. నీవు సీపనివినే కాకుండా తలకాయను కూడాపోగొట్టుకోదలచావా?'

అవకాశంకో తెలుసుకో దలచిన చివరిమాట అదే. అతనిప్పుడు సైన్యంలో ఉన్నతాధికారిగా పనిచేస్తున్నాడు. ఆపదవిని వదలుకోవడమంటే సామాన్యంకాదు. అలా అని కోర్నిని అతని గ్రహచారానికి వదిలిపెట్టనూ లేదు; తమ ఇరువురిని పెనవేసుకుని చాలా నిగళబంధనాలున్నాయి.

'సరే, నీయిష్టంవచ్చినట్టు చెయ్యి' అన్నాడతను గంభీరంగా, "కాని, అతణ్ణి మనం వాళ్ళకప్పగించి వూరుకోలేం. మనం ఒకరి సరసనొకరం నిలబడి యుద్ధాలు చేశాం; కష్టసుఖాలను సమంగా అనుభవించాం; మన మతనికి సహాయ పడక తప్పదు కూడా; మనంచేసి తీరవలసిందె.'

'నాకు తెలుసు మనం చెయ్యావలసి వున్నదని,' అని జవాబిచ్చాడు ఒరోషిలోవ్. ఒక్కక్షణం కళ్ళుమూసుకొని గతాన్ని స్మరింపసాగాడు. అంతర్యుద్ధపురోజుల్లో, సెరెట్సియన్ వెలుపల యేవిధంగా సైనికులతో నిండిన ఒకరైలును తెల్లవాళ్ళ బారినుండి తప్పించడానికి కోర్ని యేవిధంగా తన పటాలాన్ని ఉరికించి హోరాహోరీగా పోరాడాడో. అతడు జ్ఞాపకం చేసుకో

పాగాడు. ఆనాడు ఆ రైల్లో ఒరోషిలోవ్ ప్రయాణం చేస్తున్నాడు. అటుతరవాత కోర్ని స్వారిచేస్తూ రక్తం కాలువలు కట్టి ప్రవహిస్తూంటే ఆవేశంలో వున్న తన గుర్రాన్ని అదిమి పట్టుకుని నవ్వుతూ పరిచయం చేసుకున్నాడు.

“సరే” అని వొరోషిలోవ్ తాను కూర్చున్న కుర్చీ లోంచి ఎగిరి లేచాడు. ‘మనయజమాని మనలను కాల్చెయ్యమని ఆజ్ఞాపించవచ్చు, అయినా సరే, నా, చెబుతాను.”

స్టాలిన్‌తో మాట్లాడినప్పటి వివరాలన్నిటిని అఫనాసెంకో ఆ రాత్రి యేకరువుపెట్టాడు.

‘మొదట్లో మామూలు వినిపించుకోనైనా వినిపించుకో లేదు. అటు తరవాత అదంతా ఎఝోవ్ చూసుకుంటాడు లెండి’ అన్నాడు ముక్తసరిగా; చివరకు, నా చేతిలో ఉన్న ఆఖరుముక్కనుకూడా ఆడేశాను; స్టాలిన్‌కు జ్ఞాపకంచేశాను, 1920 లో స్టాలిన్ సూచనలను పాటించి తుకచేవిస్కీతో యే విధంగా కలహించాడో, అప్పటినుండి వారిరువురూ పరస్పరం యేలా ద్వేషించుకునేవారో. చివరకు, ఒక్కనవ్వునవ్వి సురోవ్‌కు సాయం చెయ్యాలి, అన్నాడు; అటుపిమ్మట మమ్మల్ని వెళ్ళమని అనుజ్ఞనిచ్చాడు. దీనినిబట్టి అతడేదో చెయ్యకమానడని నాకు గట్టినమ్మకం వుంది. ఒరోషిలోవ్‌కూడా అలాగే నమ్ముతున్నాడు.’

ఆసాయంకాలమె కోర్నిసురోవ్‌ను గురించి తన నివేదికను అంద చెయ్యమన్నాడు యెఝోవ్‌ను స్టాలిన్.

'తన నేరాన్ని అంగీకరించడం లేదతడు' అన్నాడు యెఝోవ్, 'పిచ్చికోపంతో రెచ్చిపోతున్నాడు; తనను బంధించడానికి వెళ్ళిన ఉద్యోగిని గాయపరచాడు. ఇప్పటికీ జెయిల్లో వుండి కూడా రక్షకభటులను కాల్చుకుతింటున్నాడు. వాళ్ళందరిని చీల్చి, చెండాడి కాకులకు, గద్దలకు గిరవాటేస్తానని ఒట్లు, సత్యాలు పెట్టుకుంటున్నాడు.'

స్టాలిన్ నవ్వాడు. బుడెన్ని మనుష్యుల మొరటుతనం అతనికి బాగా తెలుసు. కోర్ని ఆవిధంగా బెదరిస్తున్నాడంటే, దాన్ని నేరంగా పరిగణించడానికి వీల్లేదు.

'అతణ్ణి వదిలివెయ్యవచ్చుననుకుంటాను.' అని తేల్చేశాడు చివరకు స్టాలిన్. 'మళ్ళీ అతన్ని మంచిమాటలతో దార్లోపెట్టాలి. తెలిసిందా?"

జెయిల్లోంచి విడుదల చెయ్యబడ్డతరవాత సంవత్సరానికి బ్లుచెర్ స్థానే నియమింపబడ్డ అపనాసెంకో అడుగుజాడల్లో దూరప్రాచ్యానికి పంపబడ్డాడు. అక్కడనుండి సోదరుడు మార్క్‌కు చక్కటి ఉత్తరం ఒకటి వ్రాశాడు కోర్ని. 'నన్నిక్కడ ఒకసైన్యానికి అధిపతిగా నియోగించారు." అని ఉదహరింపబడివుంది ఆవుత్తరంలో 'ఇక్కడి ఆఫీసర్లు యెంతమంచివాళ్ళో నువ్వు తెలుసుకుంటె యెంత బాగుండును!" అని తన భావాన్ని ప్రకటించాడు.

ఇంతలో స్టాలిన్ కమ్యూనిజం, హిట్లర్ సామ్యవాదం ఒకదాని సరసను ఒకటి వర్ధిల్లలేవన్న సంగతి పొక్కింది తాత్కాలికంగానైనా. ఐతే ఈయిరువురు నియంతలు ఒకరి

కొరకు సర్వవిధాలా సహాయపడడానికి ఒడంబడికలపై సంతకాలు చేసుకున్నారు. రష్యన్ తిండిగింజలను తిని బలిసిన హిట్లర్ సైన్యాలు పశ్చిమంగా కదిలాయి. రష్యన్ చమురు పోసుకుని, జర్మన్ టాంకులు పారిస్‌లో ద్వారిస్తో సాగాయి. తెరపిలేకుండా రైళ్ళు ధాన్యాలూ, నూనెలూ, ముడియినుమూ వేసుకుని రష్యానుండి జర్మనీకి నడచిపోతూ వచ్చాయి. 1941 వసంతకాలపు చివరిరోజుల్లో రష్యన్ పత్రికలలో యీక్రింది ప్రకటన వెలువడింది.

"సోవియట్ యూనియన్, జర్మనీ దేశాలమధ్య రాజకీయ సంబంధాలు కొంతవరకు నలుగుడులో పడ్డాయి." అన్న వార్త విపులప్రచారాన్నందుకుంది. కాని దీనికీ యదార్థ పరిస్థితులకు సమన్వయం కనుపించదు. జర్మనీతో మామైత్రి యధా విధంగానె వృద్ధినొందుతోంది."

రాబోయే ప్రమాదాలను నిరాధార వార్తలుగా ప్రభుత్వం ఖండించినా, యిరుదేశాలమధ్య సామరస్యం ఆట్టేకాలం నిలచే అవకాశం సన్నగిలి పోయిందని రష్యన్ ప్రజలు గ్రహించేశారు.



9 వ అధ్యాయం

## అడవిలో మనుషులు

1941 జూన్ నెలలో ఒకానొక వేకువఝామున హిట్లర్ టాంకులు, సైనికులు రష్యన్ గడ్డమీద దాడిచేశాయి. పొగలు చిమ్ముకుంటూ ఫెళఫెళార్భాటంతో విరుచుకు పడు తున్న యీదాడికి ఆకాశమార్గాన వైమానికదళం రక్షణ నిస్తూ వచ్చింది. నేలపై నున్న సోవియట్ టాంకులు, విమా నాలు అగ్నిజ్వాలల కాహుతి ఔతూవచ్చాయి. పశ్చిమ ప్రాంతంలో వున్న సోవియట్ సైన్యాలు భూన భోంతరాళం నుండి కురిసే అగ్నివర్షంలో తుడిచిపెట్టుకు పోయాయి. అచిర కాలంలోనే, శేషితసైనికనివహం తూర్పుదిశకు పలాయనం ప్రారంభించింది.

జర్మన్ రష్యన్ దేశాలమధ్య యుద్ధం ప్రారంభమైంది.

దక్షిణరష్యాప్రాంతంలో జనరల్ క్రిమోవ్ ఆధ్వర్యాన నడవ డానికి అశ్వికదళం వొకటి అటవీమధ్యస్తంగా నున్న ఒకా నొక శిబిరంలో సమాయత్త పరుపబడసాగింది. ఇదొక విం తైన సైన్యం. ఇందులో డివిజనులులేవు; పెద్ద పెద్ద ఫిరంగులు లేవు; ఎటొచ్చి చిన్నఫిరంగులతోను, మరతుపాకులతోను యీ సేన యేర్పాటైంది, మరఫిరంగులు, తుపాకులు బరువైనవా గన్లమీద యెక్కించబడ్డాయి. సైన్యంయావత్తూ పదహారు విభాగాలుగా విభజింపబడింది. ఒక్కొక్కదాంట్లో రెండేసి వందలమంది అశ్వికులుంటారు.

యుద్ధం తొలిరోజునె సైనికకొలువులో చేరవలసిందిగ మార్కుకు పిలుపు వచ్చింది. జనరల్ క్రిమోవ్ నాయకత్వా

క్రింద నడవవలసిన విభాగాల్లో పదమూడవ విభాగానికి నాయకుడుగా మార్క్ జనరల్ క్రిమోవ్ యెదుట హాజరు కమ్మన్నారు.

మార్క్ స్వగ్రామాన్ని వదలలేక వదలలేక హృదయ భారంతో వదిలిపెట్టాడు. అంతకు నెలరోజులకు పూర్వం, అతని తల్లి, పశ్చిమసరిహద్దు ప్రాంతానికి పంపబడ్డ యివాన్ తో వుండడాని కని వెళ్ళింది. అతడున్న పట్టణాన్ని యుద్ధం ప్రారంభమైన గంటలో జర్మనులు పట్టేసుకున్నారు. ఐతే, తమతల్లి యేమైనట్లు? ఇవాన్, అతనిభార్యాపిల్లలూ యేమైనట్లు? మహోపద్రవానికి లోనై వుంటారని మార్క్ భయపడ్డాడు.

ఆ బాధలు, సంశయాలు, ఆందోళనలు, సత్యాన్వేషణ అన్నీ యిప్పుడు అడుగున పడిపోయాయి. శత్రువు రష్యన్ గడ్డపై కాలుపెట్టాడు. అదే యిప్పటి కళవళపాటుకు కారణం. జర్మనులను పారదోలాలి, అంతకుమినహా చర్చించడానికి కాని, తర్కించడానికి కాని అవకాశం లేదు. అతని హృదయాంతరాళమునుండి అతణ్ణి తొందరపెట్టుతున్న దొక్కటె విషయం—శత్రువునుతరిమి కొట్టాలి.

పశ్చిమంగా క్రిమోవ్ పదహారు విభాగాలను తీసుకువెళ్ళే రైళ్ళు మొదట్లో ఒకదాని తరవాత ఒకటి త్వరత్వరగానే పురోగమించాయి. వాటి పురోగమనానికి యెట్టినిరోధం జరగకుండా రైలుమార్గాన్ని వదలివెయ్య వలసిందిగా మాస్కో నుండి ఉత్తరువులు జారీచెయ్య బడ్డాయి! రైళ్ళు జనంతోటి గుర్రాలు, చిన్నచిన్న ఫిరంగులతోటి క్రిక్కిరిసివున్నాయి.

గుఱ్ఱాలు రైలుబళ్ళలో ఇటువైపున నాలుగు అటువైపున నాలుగుచొప్పున కట్టివెయ్యబడ్డాయి. వీటికీ వాటికీ మధ్యగా బలమైనకొయ్యకమ్మి బిగింపబడివుంది. మధ్యాజనం కూర్చోవాలి. ఈస్థలం చాలా కుశలంగావుంది.

జర్మన్ బాంబులు రహదార్లను స్టేషన్లను ధ్వంసంచేస్తున్న ప్రాంతానికి యీ పదహారురైళ్ళు సమీపించగానె పురోగమనం మందగిస్తూ వచ్చింది. చివరకురైళ్ళు ఆగనూ ఆగాయి. మార్గమధ్యంలో ఒకవిభాగం—పదహారవది—అదే పనిగా చేస్తూ వచ్చిన విమానదాడి వాతపడి, నామరూపాలులేకుండా తుడిచిపెట్టుకుపోయింది. పశ్చిమంగా చేస్తున్న తమ ప్రయాణం ముగిసే సమయానికి జర్మన్ దండయాత్రసైన్యాలు తమవైపునకు పురోగమిస్తూ తమరిని దాటి ముందుకుపెళ్ళిపోయాయి. 1914 లో వలె-యిది యుద్ధరంగం – యిదికాదు. అనే వివక్షతలేకుండా పోయింది. ఏపటంలోను యుద్ధరంగం చూద్దామంటె, గుర్తించుదామంటె వీలుపడదు. ఎక్కడ చూచినా గంద్రగోళమె. ఆగంద్రగోళంలోనుండె జర్మన్‌పటాలాలు ముందుకు చొచ్చుకుపోతూ, పట్టణం తరవాత పట్టణం, ఆక్రమిస్తూ వచ్చాయి.

రైలు ప్రయాణం యిక సాధ్యపడకపోయేవరకు, తన సైనికులను మార్క్ ఒక అడవిచివర చెట్లమాటున నిలిపాడు. ఉన్నగుఱ్ఱాలలో నమున్నతమూ,బలిష్టమూఅయినఒకగుఱ్ఱాన్ని తనకై యెన్నుకుని, సావేజ్ అని దానికి నామకరణంచేశాడు. తనగుఱ్ఱంమీద స్వారిచేస్తూ మార్క్, బారులుతీరివున్న

సైనికులను వారిముఖకళవళికలను, వర్చస్సును పరిశీలిస్తూ వచ్చాడు ఈ సైనికవిభాగాలు చేయవలసిన విధులేమో, సేనాధిపతులకు తప్ప, యితరులకెవరకీ తెలియకుండా, రహస్యంగా వుంచబడ్డాయి. ప్రతివిభాగమూ శత్రుసైన్యాల వెనకభాగానికి చొచ్చుకుపోవాలి; ప్రతివిభాగమూ, దేనికదే, తన కప్పగించినవిధిని నిర్వర్తించవలసి వుంటుంది. ఒక విభాగానికీ, మరొకవిభాగానికీ సంబంధం అనేది వుండదు. ఏదైనా ఒకవిభాగం శత్రువుచే ముట్టడింపబడి ప్రమాదానికి లోనైతే, అనుభవించవలసినదే కాని దానిరక్షణకెవరూ రారు. అది రష్యన్ యుద్ధతంత్రం. తనవిభాగాలలో కనీసం సగంవిభాగాలైనా తానున్నచోటికి రాగలిగితే అదృష్టమే నని భావించాడు క్రిమోవ్.

ఎవరిపనిమీద వారు బయలుదేరే ముందు తనవారికి నాలుగుమాటలుచెప్పడం సముచితమని భావించాడుమార్కో. అయితే, యేమిచెప్పాలోమాత్రం అతనికర్థం కావడంలేదు. "మిత్రులారా...సోదరులారా!" అని ప్రారంభించాడు. అలా ప్రారంభించాడే కాని, తాను చెప్పబోయే భావాలను వారు గ్రహించగలరా అనే సందేహంలో పడ్డాడు. తనను వారు విశ్వసిస్తారా అని అనుమానించాడు. తమ నిండు ప్రాణాలను బలిచెయ్యడానికే దాపురించినట్టుగా భావించరుగదా! తమ శత్రువుగానే భావిస్తారేమో? మళ్ళీ అందుకున్నాడు, చెదరిపోతున్న ఆత్మవిశ్వాసాన్ని కుదుటబరచుకొని.

"మిత్రులారా, సోదరులారా! మనం యీనాడు స్టాలిన్ కోసం గాని, పార్టీకోసంగాని యుద్ధం చెయ్యబోతు

న్నట్టు మీాతో నేను చెప్పవలచుకొనలేను. కాని, పత్రికలలో మాత్రం వారిలా వ్రాసుకుంటున్నారు. మహాలక్ష్యం అంత కన్నా మహత్తరమైనదీ, స్వల్పమైనదీకూడా. మనం మన దేశంకోసం, మనప్రజలకోసం యుద్ధంచేస్తున్నాం. మన దేశాన్ని మనంరక్షించుకో లేకపోతే, మనపిల్లల ముఖాలను మనం యేముఖంపెట్టుకుని చూడగలం ? నా దేశం అని చెప్పు కోనే అదృష్టం లేని నిర్భాగ్యులైపోతారు వారు."

"జర్మన్‌లొక్కరే కాదు మనశత్రువులు; శత్రువు రష్యా లోనే గూడుకట్టుకు కూర్చుని, ప్రజలను నానాహింసల పాలు చేస్తున్నాడు." అని యెవరో వెనకనుండి బిగ్గరగా అరి చాడు.

"నాకు తెలుసు" అని మార్క్ సమాధానం యిచ్చాడు. మనగడ్డపై మనం గడ్డిమొక్కల నెన్నింటినో పెంచు తున్నాం. ఆ గడ్డిమొక్కలను కావాలంటే మనం పీకిపార వెయ్యవచ్చు. యుద్ధమే, వాటిలో, చాలావాటిని, దహించి వేస్తుంది; మిగిలినవాటిని తరవాత మనం నిర్మూలిద్దాం. అం తేనా, కామ్రేడ్స్ ?"

ఎవరూ మాట్లాడలేదు. సమాధానం లేదా ! అతనిగుండె జారిపోయింది. ఒకే ఒకబొంగురు కంఠంమాత్రం యెడమ ప్రక్కనుండి సమాధాన మిచ్చింది. అది సార్జెంటుడెమిన్ కంఠ మని మార్క్ గుర్తించకపోలేదు. డెమిన్ ఆజానుబాహువు. దీర్ఘకాయుడు. ఎంతపెద్ద యూనిఫారం అయినా అతనికి బిగుతుగానే వుంటుంది :

" మీరు చెప్పింది నిజం ; యెవరూ కాదనలేరు; మొదట జర్మనులను తరిమివేద్దాం; తరవాత అదేవిధంగా మనకున్న కష్టాలను కూడా తీర్చుకుందాం. "

ప్రశాంతమైన మందహాసవీచిక ఒకటి సైనికశ్రేణిలో యీ చివరనుండి ఆచివరకు దొర్లుకుపోయింది. తమ కమాండరు చెప్పిన వాక్యాలను వారు అపార్థం చేసుకోలేదు. ఆయన ఆజ్ఞ ప్రకారం ఉన్న శిపాయిలందరూ ముప్పది అయిదేసి మంది చొప్పున విడిపోయారు. వారందరికి ఆ అడవి చేతులుచాచి స్వాగత మిచ్చింది. చల్లగా, మేజర్ మార్క్ సురోవ్ పద మూడవ విభాగాన్ని తనలో యిముడ్చుకుంది.

యుద్ధప్రకటనకు పూర్వం సోవియట్ సైన్యాలలో పేరు ప్రఖ్యాతులు గాంచినవీ, ఆధునికమూ, శక్తివంతమూ, అయిన ఆయుధాలను కలిగియున్నవీ పశ్చిమప్రాంతానికి పంప బడ్డాయి. గ్రామాలలోను, పట్టణాలలోను, విశేషసైనికబలం సమీకరింపబడింది. నిజం చెప్పాలంటే, ఆప్రాంతాల్లో పౌర జనాభాకన్న సైనికప్రజానీకమే విశేషంగావున్నారు. వీటన్నిం టిని గ్రహించినవారు ఆవైపుదేశభద్రతకు లోపంలేదనే భ్రాం తిలో వుంటూ వచ్చారు.

కాని, యిదంతా తెల్లవారేసరికి తారుమారైంది. సోవియట్ సేనావాహిని, డివిజన్లకు డివిజన్లే యుద్ధశైథిలుగా మారిపోయి రోడ్డువెంటబారులుతీరి పశ్చిమాభిముఖంగా నడక సాగించారు. వారిప్రక్క జర్మన్ సైనికులు కాపలా దార్లుగా నడుస్తున్నారు. సైనికసస్లైస్థావరాలు, మిలటరిగిడ్డంగులు గ్యాసా

లైన్ టాంకులు, మిలటరి సప్లైలను కొనిపోతున్న రైళ్ళు— అన్నీ జర్మనీవారి చేతుల్లోకి వెళ్ళిపోయాయి ఘర్షణఅనే దేమి లేకుండా.

జర్మన్ పురోభాగం— సప్లైస్థావరాలతో టి, విమానా శ్రయాలతో టి తోణికిసలాడుతూ, సైన్యం ముందుకు నడు స్తున్న కొద్దీ ముందడుగు వేస్తూ— చెక్కు చెదరకుండా వుంది. పట్టుకోబడిన రష్యన్ గ్రామాలు, పట్టణాలు జర్మన్‌లకు యెటు వంటి బాధ కలిగించలేదు; ప్రతిఘటననేది లేకుండా రష్యన్ ప్రజలు జర్మన్ సైనిక కార్యాలయం యే ఆజ్ఞలనిస్తే ఆ ఆజ్ఞ లను పాలిస్తూ వచ్చారు. విజేతలు, ఆత్మవిశ్వాసంతో, ఆకు పచ్చని యూనిఫారములను తొడుక్కొని రష్యన్ గడ్డమీద నడచిపోతున్నారు.

ఐతే, క్రమేపి వార్తలు వ్యాపింపసాగాయి. జర్మను సైన్యం వెనక భాగంలో యెవరో కొందరు వింతమనుష్యులు అప్పుడప్పుడు కనిపిస్తూవుండే వారని యీవార్తలు వివరించేవి. అక్కడక్కడ జర్మన్ మిలిటరి రిజర్వులమీద దాడి కూడా జరిగేదట; జర్మన్ యుద్ధవిమానాలు ఆ యా విమాన స్థావరా లలో ఉన్నపళంగానే మంటలలో దగ్ధమైపోయే వట; మందు గుండ్ల ప్రేలుడువల్ల టాంకులు ఛిన్నాభిన్నమై పోయేవట. వెనకభాగమె తీవ్ర అశాంతికీ, మార్పులకూ గురిఅవుతూ వచ్చింది. జర్మన్ సైనిక కార్యాలయోద్యోగులు చెప్పే కథ నాలనుబట్టి, అడవిలో వుండే " వాల్డెన్ మేనర్ " మనుష్యుల పనేమో ననుకున్నారు. వీళ్ళుచేస్తున్న చేతలనుగురించి

జర్మన్ మిలిటరి సోల్జర్లు చెప్పే కథనాలు వింటూంటే యివన్నీ వింతవింతగా కన్పించేవి.

ఐనా, జర్మన్ ప్రధానకార్యాలయం వెంటనే గ్రహించింది జరిగినదంతా; సోవియట్ దళం ఒకటి జర్మన్ శ్రేణిని చీల్చుకుని వెనకకు వెళ్ళి వుంటుందనే నిర్ణయానికి వచ్చారు. వెంటనే వుత్తరువులు యివ్వబడ్డాయి, 'ఈదళాన్ని తుడిచి వేసెయ్యాలని' కాని, ఎలాతుడిచి వెయ్యడం, ఈదళం ప్రధానస్థావరం అడవిలో నున్నప్పుడు? ఆచెట్లల్లోని తమసైన్యాన్ని పంపడానికి, అందువల్ల సంభవించే ప్రమాదాలను యెదుర్కొనడానికి జర్మనులు సిద్ధపడగలరా? పైగా, యీ దళం సైనిక నియమాలను, విధివిధానాలను వేటినీగుర్తిస్తున్నట్టు కనిపించదు; ఏ ఒక్కచోటా స్థిరంగా వున్నట్టు కనుపించదు. విస్తృత భూభాగంమీద చెదరి వున్నది; యుద్ధానికా సిద్ధపడదు. మెరపువలె మెరిసి, పిడుగువలె విరుచుకు పడే స్వభావం దానిది. వడిగావడిగా దెబ్బలుతీసి, మాయమైపోతూ వుంటుంది, అసలక్కడకు రానేలేనట్టు. అసలు చిక్కు జర్మనులకు యెక్కడవచ్చి పడిందంటే ముందుదాడి యెక్కడ జరుగుతుందో తెలియకపోవడం. అందుచేవారు అహర్నిశలు, అప్రమత్తులై కన్నుమూతపడకుండా కాపలా కాసుకోవలసి వచ్చేది. సర్వసన్నద్ధంగా తమవారిని ఉంచుకోవలసి వచ్చేది.

చివరకు, యెలాగైతేనేం, జర్మన్ బలాలు ఒక విభాగాన్ని ముట్టడించ గలిగాయి. రష్యనులు తీవ్రంగా పోరాడారు. చానగా మిగిలిన అయిదుగురిని జర్మన్ శిబిరాధికారుల వద్దకు ప్రశ్నించడానికి తీసుకునిపోయారు.

'మీ యూనిట్ పేరేమిటి?'

'జనరల్ క్రిమోవ్ సైన్యంలో అయిదవ విభాగం.'

'మిగతా విభాగా లెక్కడున్నాయి?'

'మాకు తెలియదు; వాటిని మేమెప్పుడూ చూడలేదు.'

మొత్తం యివెన్ని విభాగాలు?'

'మాకు తెలియదు; పదహారువరకు వుండవచ్చునని వినికిడి'.

'జనరల్ క్రిమోవ్ యెక్కడున్నాడు?'

'మాకు తెలియదు; ఆయనను మే మెప్పుడూ చూడలేదు,"

ఆ అయిదుగురు అక్కడి కక్కడే కాల్చి వెయ్యబడ్డారు. జనరల్ క్రెమోవ్ మనుష్యులు యెక్కడ కనిపించినా తక్షణం కాల్చి వెయ్యవలసిందే కాని ఖైదులుగా పట్టుకోనరాదని సైనిక ఉత్తరువు. సర్వసాధారణ అంతర్జాతీయ యుద్ధ నియమాలు వారికి వర్తింప చెయ్యవద్దని ఆజ్ఞ.

అడవి మధ్యగా ప్రవహించే ఒకానొక నది గర్భాన్ని తన విభాగపు స్థావరంగా చేసుకున్నాడు మార్క్. ఈకాలంలో నదిపూర్తిగా యెండిపోతుంది. వసంతకాలంలోను, శరత్కాలంలోను మాత్రమె ఆనదిలో నీళ్ళుంటాయి. నది అడుగు భాగం, వచ్చిపోయేవారి పదఘట్టనాలవల్లా, గుఱ్ఱపు డెక్కల తాకిడి వల్ల ఒక కాలిబాటగా తయారైంది. అందులో నివసించేవారు చేసుకున్న బొరియలలోంచి వెలువడేపొగకు ఆనది గట్లు పూర్తిగా మసిమూరిపోయాయి. దానికితోడు ప్రతి బొరియ ఆకూ అలంతో కప్పబడింది. కొన్నింటిలో గుర్రా

లను కట్టేశారు. ఆశిఖరానికి చుట్టూ మార్క్ పహరా వేశాడు యెవరైనా వస్తున్న అలికిడి అయితే, హెచ్చరిక చెయ్యమని.

ఈరహస్య స్థావరంనుండి మార్క్ ప్రతిరాత్రి తనజనంలో సుమారు మూడవవంతుమందిని యెక్కడో అక్కడ దాడి చెయ్యమని పంపేవాడు. మిగతావారు విశ్రాంతి తీసుకునే వారు. ఎవరిని యెక్కడ యెదుర్కోనాలన్నా సూచన క్రిమోవ్ ప్రధానకార్యాలయం నుండి రేడియోద్వారా అందుతూ వుండేది; రాత్రిజరిగినదాడి పర్యవసానం అదేవిధంగా క్రిమోవ్‌కు అందచెయ్యబడుతూ వుండేది.

ఒకనాటి రాత్రి గస్తీతిరుగుతున్న కాపలావారు, ముగ్గురు సామాన్య పౌరులను, శిబిరంవైపు వస్తున్నారని, ఖైదీలుగా పట్టుకొని తీసుకొనివచ్చి హాజరుపెట్టారు. కాని, కాపలావారు అనుమానించినట్లు వారు వేగులవాళ్ళు కారు. మార్క్ సైన్యంతో కలసి పనిచెయ్యడానికి పంపబడ్డ రాజకీయోద్యోగి ఒకడు. మిగతా యిరువురూ అతని సహాయకులు. ఆరాత్రి దాడిలేకపోవడంవల్ల యీముగ్గుర్ని చూడడానికి మార్క్‌ను లేపారు. ఆముగ్గురికి పడుకొనడానికి శిబిరంలో వసతినేర్పాటు చేసి మార్క్ మళ్ళీ నడుం వాల్చాడు. రాగానే ఆ రాజకీయోద్యోగికి తనకొక స్వంత ఉత్తరం అందచేసాడన్న సంగతిని మరచిపోయి.

ఐతే, మార్క్‌కు నిద్రపట్టడంలేదు. అతని భావవీధిలో యెన్నెన్నో ఆలోచనలు పరుగెడుతున్నాయి. అసలీ రాజకీయోద్యోగి, సహాయులతో సహా, తనవద్దకు యెందుకు పంప

బడ్డాడా? అని తీవ్రంగా ఆలోచిస్తున్న డతడు. దేశంమొత్తం మీద ఎక్కడవిన్నా రష్యావారికి యుద్ధం చెయ్యాలని లేదన్నమాటలె వినిపిస్తున్నాయి. అదంతా చూస్తే తమ శక్తియావత్తూ ఉన్నట్టుండి ఒక్కసారిగా ఉడిగి పోయినట్టు భావించి, ముందుకు త్రోసుకువచ్చే శత్రువునుచూసి నిస్సహాయ స్థితిలో దిక్కులకు పరిగెత్తడం ప్రారంభింప సాగారు. ఇప్పుడు రష్యన్ జాతి అనేదిలేదు. భీతావహులైన ప్రజలు యేమిచెయ్యాలో తెలియక, యెక్కడికి వెళ్ళాలో తెలియక దేశంలో కనిపిస్తున్నారు.

ఇటీవలక్రిమోవ్ ఉత్తరువుల ననుసరించి జర్మన్ పురోగమనం వల్ల చెల్లాచెదరైపోయిన సుమారు పదిహేను వందలమందిని మార్క్ సమీకరించు కున్నాడు. వారందరితోటి సాధ్యమైనంతత్వరలో రష్యన్ ప్రధమశ్రేణిలోకి పంపబడతారని మార్క్ చెప్పగానే ఒక్కొక్కరు చల్లగా జారడం ప్రారంభించారు. చివరకు నూరుమందిలోపు మాత్రమె మిగిలారు.

జర్మన్ కావలావారినుండి తాను తప్పించిన రెండువేల అయిదువందల మందిఖైదీల సంగతిని కూడా జ్ఞాపకం చేసుకున్నాడతడు. వారంతా ఒకయుద్ధఖైదీల శిబిరానికి తోలుకొనిపోబడ్డారు. వారు తప్పింపబడినందుకు మార్క్‌కూ,అతని అనుచరులకూ కృతజ్ఞత చూపడానికి బదులు వాటిని అనుమానంతో పరికిస్తూ, అవకాశం దొరికినప్పుడల్లా పలాయనం చిత్తగించేవారు. వారికి యుద్ధం చెయ్యాలని యెంత మాత్రం లేదు.

యుద్ధం చెయ్యడంకంటె, ఖైదీలుగా శత్రువుకు చిక్కిపోవడమె మంచిదని తోచిందివారికి. ఇదంతా తన ప్రాంతంలోనే జరుగుతోందా, లేక రష్యా మొత్తంమీద నే, యుద్ధం సాగకుండావుండడానికి యేఅవలక్షణమైనాపుట్టుకు వచ్చిందా? అన్న సంగతి బోధపడడం లేదతనికి. కాని, ఒక్కటి మాత్రం స్పష్టమైంది—ప్రతిపిషయమూ జర్మనుల వైఖరిపైననే ఆధారపడివున్నదన్నసంగతి. రష్యనులను జర్మనులు సరిగ్గా ఆదరిస్తే యుద్ధం చెయ్యాలన్న కోరిక యింకా చల్లాచుతుంది; లేక, కఠినంగా చూస్తే ప్రతిఘటన పురికొంటుంది. ప్రస్తుతానికి వారి వైఖరి యెలా వుంటుందో చెప్పడం కష్టం.

క్రమేపి అతడు నిద్రాసక్తుడయ్యాడు. తన భావాలు యీసారి తల్లివైపు తిరిగాయి. ఆమె యిప్పు డెక్కడున్నట్టు? ఎలావున్నట్టు? అసలు బ్రతికే వుందా లేక యీ లోకాన్ని వదలిపోయిందా? ఇంతలో హఠాత్తుగా అతనికివ్వబడిన జాబు సంగతి జ్ఞప్తికి వచ్చింది. దీపం వెలిగించి కవరుచింపి పలాచని కాగితాన్నొకదాన్ని పైకితీశాడు. దాని మీద యెన్నో పంక్తులు లేవు.

"మార్క్—సంవత్సరాలకు పూర్వం నీవునాకు వ్రాసిన ప్రత్తరానికి యింతకాలం ఊరుకొని యిప్పుడు జవాబు వ్రాయడానికి నాహక్కుతొలగి పోయిందను కుంటాను. అప్పటిలో— యిప్పటివరకు — నీకు సమాధానం వ్రాయలేనను కున్నాను. నేను పీటరును ప్రేమించాను. అతడు బ్రతికివున్నంత వరకూ అతని కొరకూ, అతని బిడ్డకొరకూ నేను బద్ధురాలనై వుండా

లనుకున్నాను. ఇప్పుడు పీటర్ చనిపోయాడు. ఆలంక అతణ్ణి కబళించేసింది. ఆసంగతి యీమధ్యనే నాకు తెలిసింది.

"మార్క్—అసలు నీకు నేను జ్ఞాపకం వున్నానా? ఇన్ని సంవత్సరాలనుండీ నిన్ను గురించే ఆలోచిస్తున్నాను; నీకోసమె తహతహలాడుతున్నాను. కాని, యిప్పుడు నువ్వెక్కడు న్నావో, అసలున్నావోలేవో తెలియని స్థితిలో వున్నాను నేను. కోర్నసుకోవ్ మీసోదరుడన్నసంగతి నాకు జ్ఞాపకం వుంది. ఆయనద్వారా యీలేఖను పంపుతున్నాను.

"ప్రియా, యీ జాబు నీకందడమె జరిగితె నాకోసమైనా నిన్ను జీవించమని ప్రార్థిస్తున్నాను. నువ్వుకావాలంటే, బొరొవిచికి సమీపంలోనె వుంటే నాదగ్గరకు రావలసిందిగా కోరుతున్నాను. నీకోసమె యెదురు చూస్తుంటాను— మేరియా.'

చివరకు! చివరకు! వచ్చింది... మేరియా వుత్తరం! మార్క్‌కు వెర్రిసంతోషం ముంచుకు వచ్చేసింది; అత నామె నెప్పుడూ మరచిపోలేదు, ఆశలనూ వొదులుకోలేదు. ఇప్పుడామె వ్రాసింది స్వయంగా. చిన్ననవ్వు మొలిచింది మార్క్ ముఖంమీద; అది అంతకంతకు ముఖమంతా ఆక్రమించింది. ఇప్పుడిక తాను జీవిస్తాడు; ఎప్పుడోనాడు తా నామె దగ్గరకు వెడతాడు కూడ.

ఒకనాడు పదమూడవ విభాగపు మనుషులు తమ అధికారి అదృశ్యమై పోయాడని ఆందోళన పడడం ప్రారంభించారు. అడగ్గా అడగ్గావాళ్ళ స్టాఫ్ కెప్టెన్ చెప్పాడు 'కోర్' కమాండర్ ఒక ముఖ్యవార్తను రేడియోద్వారా తెల్పడంవల్ల ఆ పని మీద వెళ్ళాడని.

"ఒంటరిగానే వెళ్ళేరా?" అని వాళ్ళు విస్మయంతో మళ్ళీ అడిగారు.

"లేదు, యిద్దరు కలసివెళ్ళారు. ఆపనికి అంత కంటె హెచ్చుమంది వెళ్ళనక్కరలేదు.

శిబిరంలో యింకా యెవరెవరు మాయమైనారా అని అచ్చటివారు పరిశోధించగా పవ్లుష్కిన్ అనే మరోవ్యక్తి కూడా కనపడలేదు. ఇతగాడు ఒక గ్రామ కమ్యూనిస్టు ముఠాకి కార్యదర్శి. జర్మనులు దేశాన్ని ఆక్రమించి పెడుతున్నప్పుడు యితగాడు బయటపడి పదమూడవ విభాగంలో చేరాడు. పల్లెపట్టులను బాగాయెరిగున్న వాడవడంచేతబహుశః యితగాడే మేజర్‌తో కూడా వెళ్ళివుండాలి అన్ననిశ్చయానికి వచ్చారు శిబిరంలోవున్నవారు. కాని, యీ పెంతపని యేమైవుంటుందా అని తర్క వితర్కాలకు లోనై చివరకు దాని ప్రస్తావనను మానుకున్నారు.

ఈలోగా వెనకటి కమ్యూనిస్టు కార్యదర్శి తన సహచరుడుగాను, దారిచూపేవాడుగాను వెంటవస్తూంటే, మార్క తూర్పుముఖంగా, నిర్జనమూ, దుర్గమమూ అయిన అడవులలో పడి, ముందుకుపోసాగాడు. రైల్వే కార్మికుని మురికిపాత కోటును, మాసికల'బూటు'ను తొడుక్కొని వున్నాడు. అప్పటికి వారు తమ స్థావరాన్ని వదిలి ఆరురోజులైంది; ఇక యెంతో కాలం పట్టదు ప్రయాణం పూర్తి కావడానికి, అక్కడికి దగ్గరలోనే, యెక్కడో, బీడుభూములలో మధ్యగా

'పాములపుట్ట' అనే ప్రదేశం ఒకటివుంది; అక్కడే, క్రిమోవ్ సూచనలనుబట్టి, తాను కలుసుకోవలసినదని ఆజ్ఞాపింపబడ్డ జనం వుంటున్నది. వారిని తాను కలుసుకున్నప్పుడు వీలైతే రష్యన్ ప్రాంతంలోకి వారిని తరలించాలి. అదేకనక సాధ్యం కాకపోతే, వాళ్ళు తినసైన్యంలో కలవాలి. ఆ సూచనలను సుగిస్తూ, "బహుజాగ్రత్తగా వ్యవహరించాలి; వీరిలో యెవరినీ, ముఖ్యంగా, వయోవృద్ధుణ్ణి, చావనివ్వకూడదు."

'పాములపుట్ట.' అనబడే ఆప్రదేశం ఒకగట్టినేల. చుట్టు ప్రక్కలనున్న బాడవాలో కొంచెం యెత్తుగావుండి చెట్లతో కప్పబడి వుంటుంది. మార్క్, అతనిఅనుచరుడూ చెట్లగుంపును చేరగానే పసిడిచాయగల ఒకదీర్ఘకాయుడు, అనారోగ్యంతో వున్నవాడిలా కనిపిస్తూ యెదురు వచ్చాడు.

"ఎవరుమీరు?" అని ప్రశ్నించాడతడు.

"మేజర్ సురోవ్, 'టాస్క్ ఫోర్సుకమాండర్.' ఈప్రాంతంలో వున్నారని చెప్పబడేకొందరు ప్రచ్ఛన్నవ్యక్తులను కలుసుకోమని జనరల్ క్రిమోవ్ ఆజ్ఞ యిచ్చారు.

దీర్ఘకాయుడు మార్క్ వైపు నిశితంగాచూసి, 'కోర్నినురావ్ సోదరుడవా?" అని అడిగాడు. మార్క్ "ఔను" నన్నట్టు తల పంకించాడు. "సంతోషం, మేజర్ సురోవ్. నువ్వు కావలసినచోటికే వచ్చావు. మార్షల్ ఆచెట్టుక్రింద వున్నారు." అని తనవెనకనున్న ఒకచెట్టువైపు చూపించాడు.

మార్షల్ ! ఏమార్షల్ అనివిస్తుపోయాడు సురోవ్. ఎవరు చెప్మా యీమార్షల్ ? బుడెన్నిఅయివుంటాడు. అసంభవం! రేడియోప్రసారప్రకారం ఆయన దక్షిణ రష్యాలో వున్నాడు.

ఒక్కొక్కడే యుద్ధంలోనే ఓడిపోతున్నాడు. టిమోషెంకో యేమో? వొరోషిలోవ్ కాదా? విశాలమైన భుజస్కంధాలు, తెల్లని శిరోజాలు వింతసోయగాన్ని తెచ్చిపెట్టిన వృద్ధమూర్తి చెట్టు వెనకనుంచి ముందుకు అడుగుపెట్టాడు. మార్క్ వెంటనే అతణ్ణి గుర్తించాడు — మార్షల్ కులిక్!

మార్క్ తన నివేదికను వినిపిస్తూంటె మరో ముగ్గురు వచ్చి వారిని కలుసుకున్నారు. ఈ అయిదుగురు — ఒక మార్షల్, ముగ్గురు జనరల్స్, ఒక కల్నల్ — మాత్రమె పశ్చిమసరిహద్దుల్లో మొట్టమొదట దాడిలో పోయినవారు పోగా మిగిలినవారు. తూర్పుదిశగా దీర్ఘప్రయాణం చేసినమీదట; ఆకలిదప్పులతో సొలిపోయి యీ పాములపుట్టలో తలదాచుకోవలసి వచ్చింది వారు.

ఇప్పుడు మార్షల్ నిర్ణయించవలసివచ్చింది — మరికొంత దూరం తూర్పుదిక్కుగా మార్క్ సహాయంతో రష్యన్ సరిహద్దులలోకి ప్రయాణం చెయ్యడమా? లేక, పశ్చిమదిశగా నడచి, సుమారు అంతదూరంలోనూ వున్న మార్క్ స్థావరాన్ని చేరుకోవడమా? ఈ రెంటిలో తూర్పుగా నడవాలంటె జర్మన్ శ్రేణుల మధ్యనుండే ప్రయాణం చెయ్యవలసి వుంటుంది; అంటె, మరీ ప్రమాదభరితం. సాయంకాలం బాగా ప్రొద్దుపోయాక, ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు. "మేజర్ సురోవ్ నన్ను రష్యన్ శ్రేణులకు చేరుస్తాడు; మిగతావారు పాష్లుఖిన్‌తో మార్క్ శిబిరానికి వెడతారు."

ముగ్గురు జనరల్స్‌లో ఒకడైన షైలోవ్ నడవడానికికూడా ఓపిక లేని స్థితిలో వున్నాడు. షైలోవ్, తూర్పునకు వెళ్ళడం

కన్న పశ్చిమంగా శిబిరానికి వెళ్ళడమే మంచిదని సంతోషిం చాడు మార్క్. కారణం పశ్చిమరంగంలో వచ్చిన పరా జయాని కంతకూ బాధ్యులైన జనరల్స్‌లో షైలోవ్ ఒకడని, అతడు యెక్కడకనిపిస్తే అక్కడ కాల్చి చంపెయ్యవలసిం దని స్టాలిన్ ఉత్తరువు లున్నాయనీ మార్క్‌కు తెలుసు. తనను శిబిరానికి పంపడానికి కారణం అదే అయివుంటుందని ఊహిం చిన షైలోవ్ మార్క్‌ను అడిగాడు అతనికేమైనా తెలుసు నేమో నని. మార్క్ తనకు తెలియదన్నట్లుగా నటించ లేదు.

"స్టాలిన్ అంతపనీ చేస్తాడని నాకు తెలుసు" అన్నాడు షైలోవ్.

మరుసటి ఉదయం, కొంచసేపు నిద్రపోయి లేచి యెవరి దారిని వారు పట్టారు. మొదట మార్షలూ, మార్క్ తూర్పుముఖంగా బయలుదేరారు. మిగతావారు వీరిరువురూ దృష్టిలోంచి మరుగుపడేవరకూ చూస్తూ నిలుచున్నారు. అటు పిమ్మట వారుకూడా, వవ్లాఖిన్ దారి చూపిస్తూంటె పశ్చి మంగా నడక సాగించారు.

మార్క్ యింకా రైల్వేకూలి దుస్తులలోనే వున్నాడు. మార్షల్‌కూడా తనయూనిఫారంను తీసివేసి, రష్యన్‌పల్లె ప్రజలు ధరించె చిరుగులజాకెట్టూ, ముసలివాళ్ళు పెట్టుకునే పాతటోపి ధరించాడు. జర్మన్‌సేనాపతు లెలాగో గ్రహిం చారు, మార్షల్ యెక్కడో తమవెనకనె దాగివున్నాడని. ఈ సంగతినివిన్నప్పుడు మార్క్, కులివ్‌ను ఒకచోట దాచి

వుంచి, ఆహారం కావలసివచ్చినప్పుడు, అడవిచూర్గాన్ని సమీపవ గ్రామాలకు చిన్నపట్టణాలకు వెళ్ళేవాడు. అడవిలో గుడిసెల్లోను, పొదల్లోను రాత్రిళ్ళు గడపినప్పుడు చలి విపరీతంగా వణికించేసేది.

ఎలాగో కొద్దిలో తప్పించుకొంటూ, ముందుకు సాగుతూ, జర్మన్ యుద్ధరంగం వెనకభాగానికి చేరుకున్నారు. ఆరంగానికి ఒకతీరూ తెన్నూ లేదు; ఒక ఆకారం లేదు. ఒక్కొక్కప్పుడు యిరవై అయిదు, ముప్పైమైళ్ళు లోతు కూడా వుండేది. అనేకసార్లు, పిస్టల్‌ను వాడవలసివచ్చేది. ఒకప్పుడు ఒకానొకచోట విశ్రాంతికై ఆగినప్పుడు కులివ్ అన్నాడు "అనవసరంగా, నీ నెత్తిమీద చాలా శాపాలను కట్టుకున్నావు, మేజర్!"

"ఔ" నన్నట్లు మార్క్ తలపంకించాడు. "దానివల్ల యిప్పుడు వచ్చినప్రమాద మేమి లేదండి; కాని, మనం దొరికిపోయామా, తక్షణం కాల్చేశా రన్నమాటె...వాళ్ళు మనలను పట్టుకోరు..." కులివ్ అభిప్రాయం జర్మనులు తప్పకుండా తమరిని బందీలుగా తీసుకుంటారని.

మెల్ల మెల్లగా పురోగమిస్తూ యుద్ధం సాగుతున్న ప్రాంతంలో ఒకగ్రామాన్ని సమీపించారు. అనేకపట్టణాలలో వలె యీ పట్టణంలో కూడా సైనికులు లేకుండానే వుంది; జర్మన్ సైనికులూ లేరు, రష్యన్ వాళ్ళూ లేరు. చాలసేపు ఆప్రదేశాన్నంతనూ బాగా గాలించి, గాలించి ఒకానొక సురక్షిత స్థావరం నిర్ణయించాడు మార్షల్‌ను ఉంచడానికి. అదొక పాడైపోయిన పవర్ హౌస్‌లో భూగర్భగది. బాంబుపడడం వల్ల ఆభవనం పనికిరాకుండా పోయింది. తత్కారణంగా

వదలివేయ బడింది. అందులో, కావలసినవన్నీ—ఒకదీపం. ఒకగడ్డిమేటి, నీళ్ళుపోసుకొనడాని కొంతతొట్టి అమరివున్నాయి. మార్క్ క్షుద్బాధ నుపశమింప చేసుకొనడానికై ఆహారం నిమిత్తం వేటకు బయలుదేరాడు.

కులివ్ మార్క్ కార్యవిధానాన్ని గ్రహించాడు; సోవి యట్ వైపు ఒంటరిగా వెళ్ళి స్వీయరక్షణకు కొంతమందిని రష్యన్ వైపునుండీ వెంటబెట్టుకు రావాలని ప్రయత్నించాడు. ఆ సాహసంతో బయలుదేరా లనుకుంటోంటే కులివ్ అతణ్ణి వెనకకు పిలిచాడు. చిందరవందరగానున్న ఆయన గడ్డంమీద మాత్రమె మిణుకుమిణుకుమంటూన్న ఆసన్నని దీపపుకాంతి ప్రసరిస్తోంది. ముఖం చీకట్లో కనుపించడం లేదు. "మీ అన్నయ్య కనిపిస్తే అడిగానని చెప్పు" అన్నాడు. మార్క్ ఒక్కక్షణం ఆగాడు. ఈమాత్రానికి వెనకకుపిలిచి వుండడు మార్క్. అసలు ప్రబలకారణం వేరొకటి వుండివుండాలని అతను ఘట్టిగా, అభిప్రాయపడ్డాడు. "నాకుటుంబం మాస్కోలో వుంది; ఏప్రమాదమైన సంభవిస్తే ప్రభుత్వం తప్పక ఆదు కుంటుందని ధైర్యం చెప్పు......మరొకసంగతి; నీకు నే నెంతో ఋణపడి వున్నాను, మేజర్. నావల్ల నీ వెన్నో ప్రమా దాలకు, కష్టాలకు గురిఅవుతున్నావు. ఇప్పుడు మృత్యుముఖం లోనే అడుగుపెట్ట బోతున్నావు."

'దానికేమిలెండి, కామ్రేడ్ మార్షల్, సైనికుణ్ణి అయిన తరవాత ఆవిధంగా నడవడం నావిధి; సాధ్యమైనంత వరకు, ప్రమాదాలనుండీ తప్పించుకొనడానికె ప్రయత్నిస్తాను. ఒక వేళ, దైవం కలిసిరాక యే ప్రమాదమైనా సంభవిస్తే నన్ను

నెప పెట్టకండి. రెండుమూడురోజులలో నావద్దనుండి సమా ధానం రాకపోతే నామీద ఆశవదలుకొని మీదారి మీరు చూసుకోండి. ముందుకు వెళ్ళినాసరే; వెనకకు నడచినా సరే.

మార్క్ చేతిని మూర్షల్ గట్టిగా పట్టుకున్నాడు.

యువక రష్యన్ సైనికుడొకడు తన పటాలం విడిచి వున్న చోటికి యెదురుగాను, యెవరికి చెందకా వున్న భూభాగానికి నోమాన్స్‌లాండ్ పంపబడ్డాడు, ఒక బొరియలోదాగి, శత్రువు అలికిడియేమైనా వినవస్తుందేమోనని కనిపెడుతున్నాడు. అర్ధ రాత్రిదాటినపిమ్మట కొంతసేపటికి జర్మన్ శిబిరాలదిశగా కాల్పు లు వినిపించాయి.ఊపిరిబిగబట్టుకుని కూర్చున్నాడతను. హెచ్చ రికగా, అతడుకూడా కాల్పులుజరిపివుండునుకాని, తనకే అపా యం రాకుండా కాపాడమని భగవంతుని ప్రార్థిస్తూ అలాగే కూర్చున్నాడు. కాల్పులధ్వని అంతకంతకు సమీపిస్తోంది. ఎవరో పొదలలోంచి వడివడిగా తనవైపు పరుగెత్తుకు వస్తు న్నట్టు అనుమానించాడతడు. ఆబొరియలోంచి, ఒక్కగంతు వేసి శిబిరానికి పరుగుతీశాడు అతణ్ణి రెండవవ్యక్తి వెంబ డించింది. "రక్షించండి" అంటూ వెనకకు తిరగకుండా పరు గెత్తుతున్నాడతడు జర్మనులు తరుముకు వస్తున్నారనే భయంతో.

అతని కేకలువిని కందకాల్లో వున్న కామ్రేడులుకాల్పులు ప్రారంభించారు.గుండ్లు తనకు యిటూఅటూ రివ్వురివ్వుమంటూ దూసుకు పోతోంటే అతనికి భయం మరీ యెక్కువైంది.తనకు చేతనైనంత వడిగాపరుగెత్తి యెలాగో అలాగ ఒక కంద కంలో పడ్డాడు. తనను తరుముకు వస్తున్న సైనికుడు కూడా

కందకంలో పడిన కొంతసేపటికివరకూ అతని నోటి వెంట మాటరాలేదు.

"ఎవడవు నువ్వు" అని అడిగాడు ఆయువకదళవాయి మాట్లాడ గలిగేశక్తి, ధైర్యమూ కుదుర్చుకొని.తనను డివిజనల్ ప్రధాన కార్యాలయానికి తీసుకుపొమ్మన్నాడు. అక్కడికి వెళ్ళిన తరవాత మాస్కోలో వున్న అధిష్టానవర్గంతో టెలిఫోన్‌లో మాట్లాడడానికి అనుమతి కావాలన్నాడు.

జనరల్ క్రిమోవ్ సైన్యంలో ఒకానొక విభాగానికి అధిపతి అని తెలుసుకొన్న తరవాత అక్కడిజనరల్ అందుకు సమ్మతించాడు.

చాల ఆలస్యం అయినతరవాత, మార్క్‌కు నిద్రకూడా వచ్చే సమయానికి అతనికి టెలిఫోన్ రిసీవర్ అందించబడింది.

'ఒక్కక్షణం అలాగే వుండండి, కనెక్షన్ యిస్తాను.' అన్నాడు ఆపరేటర్.

కొన్ని క్షణాల అనంతరం, ఒక కంఠధ్వని దూరాన్నించి తనకు వినిపించింది

"ఎవరా మాట్లాడేది? "

'క్రిమోవ్ సైన్యం పదమూడవ విభాగపు అధిపతి మేజర్ సురోవ్‌కు, ఒకానొక వ్యక్తిని గురించి జనరల్ క్రిమోవ్‌కు యిచ్చిన ప్రత్యేకఉత్తరువులనుగురించి యిక్కడనిరీక్షిస్తున్నాడని దయచేసి చెప్పండి..."

"ఎవరావ్యక్తి?"

'అధిష్టానవర్గానికి తెలుసు.'

చాలసేపు నిశ్శబ్దం. మరొకకంఠం ప్రశ్నించింది. 'ఎవరా మాట్లాడు తున్నవారు?' మార్క్ మళ్ళీ చెప్పుకొచ్చాడు.

'ఉండండి!.' హఠాత్తుగా మరొక కంఠం అందుకుంది. ఇది మెంతో పరిచయమైవున్న కంఠంవలె తోచింది అతనికి. విదేశస్థు లెవరో మాట్లాడుతున్నట్టుంది యాస. శ్వాసబరువుగా మెనో గుండెజబ్బుతో బాధపడుతున్నట్టు—వస్తోంది. అందుచే మాటలు అప్పుడప్పుడు తెగిపోతూ వుండేవి.'

'నువ్వు చెప్పదలచుకున్న దేమిటి'? అని అడిగింది కంఠధ్వని.

ఇప్పటికి మార్క్ అర్థంచేసుకున్నాడు. తాను స్వయంగా స్టాలిన్‌తోనే మాట్లాడుతున్నట్టు. తాను కుబిక్‌ను యుద్ధరంగం వరకు తీసుకువచ్చినట్టూ, జర్మన్ శ్రేణులను దాటించి తీసుకురావడం ప్రమాదంగానే వున్నట్టు విన్నవించాడు.

'మంచిపని చేశావు,' అన్నాడు స్టాలిన్ 'అతణ్ణి భద్రంగా దాచి వుంచావా?"

'నమ్మకంగా చెప్పలేను; నాకు చేతనైనంతవరకు జాగ్రత్త పడ్డాను,' మళ్ళీ నిశ్శబ్దం, మరొకకంఠం'నాఆజ్ఞలను క్రైమోవ్ సరిగా అర్థం చేసుకోలేదు. సోవియట్ యూనియన్ మార్షల్‌ను ఎవరినీ ప్రాణాలతో వదలడానికి వీల్లేదు. తెలిసిందా-ప్రాణాలతో! నువ్వూ క్రైమోవ్ కలసి, రాకూడని ప్రమాదాన్ని, తెచ్చి పెట్టారు. ఇప్పుడేమి చెయ్యదలచుకున్నారు?'

'నాకు తోచినంతవరకు, కామ్రేడ్ స్టాలిన్, కొద్దిపాటి సైన్యంతో మన మార్షల్ వున్న పట్టణంమీద దాడిచేసిఅతణ్ణి విడిపించుకొనవచ్చు ననుకుంటాను.'

స్టాలిన్ మాట్లాడలేదు; బహుశః అతడు ఆలోచిస్తున్నాడేమో.

'అలాచెయ్యడంలో ప్రమాదం చాలావుంది' అన్నాడతడు. అంత కంటె, కొంతమంది సైన్యాన్ని కులిక్‌ను తప్పించ డానికి .....పంపితె బాగుంటుంది. అటువంటివారికి నువ్వు నాయకత్వం వహిస్తావా?' మార్క్ ఉలుకు పలుకు లేక అలాగేకూర్చున్నాడు. ఇప్పుడు స్టాలిన్ చెప్పినదానికి అర్థం– అందులోవున్న సాధకబాధకాలు అతనికి బాగా అవగతమై నాయి. కులిక్ ప్రాణాలతో జర్మనుల చేతుల్లో చిక్కడం స్టాలిన్ యెంతమాత్రం సహించడు. కావాలంటే, మార్క్ స్వయంగా కొంతమందితో వెళ్ళి,కులిక్‌ను తుదముట్టించే యే ర్పాటు చెయ్యవచ్చు, తరవాత, అవసరమైతే, కులిక్ చావు పొక్కకుండా వుండడానికి మార్క్‌కూడా చంపబడ వచ్చు. అతనికి ముచ్చెమటలు పోస్తున్నాయి.

'అసంభవం.' అన్నాడతను. 'ఆవిధంగా సైన్యంలోనికిజొచ్చుకు పోవడం సామాన్యంకాదు. నూరింట ఒక వంతుకూడా అది సాధ్యపడే పనికాదు'

చెవిదగ్గరనున్న రిసీవరులో మళ్ళీ ఆ నూసంవిన పడుతోంది. అవతలవ్యక్తి ఒకముఖ్య నిర్ణయానికి రాలేక మథనపడుతు న్నట్లుగా రూఢిపరచుకున్నాడు. స్టాలిన్ సరిగ్గా యేమియో చిస్తున్నాడో, మార్క్‌కు తెలుసు. ఆ సైనికులు కనక తమకు నిర్దేశించిన ఆజ్ఞలను నిర్వర్తించకముందె హతమారిపోతే, కులిక్ తప్పకుండా శత్రువుచేతుల్లో పడిపోతాడు. కాబట్టి, ఆ ప్రయత్నం యెంతవరకు జయప్రద మౌతుందో చెప్పడం కష్టం.

"లోపలికి చొచ్చుకుపోవాలంటె యెంతబలం కావాలి?" అని అడిగాడు స్టాలిన్.

"ఎంతోమంది అక్కరలేదు. ఒకపటాలమూ, కొన్ని టాంకులూ అయితే చాలు."

"సరే, ఔతే! ఒకపటాలాన్ని సిద్ధంచెయ్యమని చెబుతాను. నువ్వే ఆపనిని నెరవేర్చాలి. నే చెప్పినది మాత్రం మనస్సుకు పట్టించుకో. కులివ్ ప్రాణాలతో శత్రువశం కాకూడదు. తెలిసిందా?"

"తెలిసింది."

అవతలవైపున రిసీవర్ పెట్టేసిన శబ్దం అయింది. ఒకటి, రెండు నిముషా లలాగే కూర్చున్నాడు నిశ్శబ్దంగా; మళ్ళీ పిలుపేమీ రాలేదు.

మార్క్ పథకం పారింది. సోవియట్ పటాలం పలచపలచగా వున్న జర్మన్ శ్రేణులను చీల్చుకుపోయింది. వెలుపల బలహీనంగా వున్న రక్షకదళం వెంటనే ఉపసంహరింపబడింది. ఆవిధంగా టాంకు ఒకటి వీధులలోనడవడానికి వీలుచిక్కింది. అది వెళ్ళివెళ్ళి పవర్ స్టేషన్ కు యెదట ఆగింది. మార్క్ కులివ్ ను భూగర్భంలోవున్న గదిలోంచి వెలికితెచ్చి యిరుకుగానున్న టాంకులోపలికి దూర్చాడు. వెంటనే టాంకు రష్యన్ శ్రేణుల వైపు దొర్లిపోయింది. మార్గమధ్యంలో యెటువంటి అవరోధమూ కలుగలేదు. మార్క్ తనపనిని జయప్రదంగా పూర్తి చేశాడు.



## చావు బ్రతుకుల మధ్య

మార్క్ తనశిబిరానికి మళ్ళీ తిరుగు ప్రయాణం సాగిస్తూ, తాను శిబిరానికి వెళ్ళేవరకు అచ్చటిపరిస్థితి యెలావుంటుందో అని పరిపరివిధాల ఆందోళన పడసాగాడు. పరిస్థితులు సుముఖంగా వుండవేమో నన్నట్లు దుర్నిమిత్తాలు అతనికి కనిపిస్తూ వచ్చాయి. మనసుకూడా కీడునే శంకిస్తోంది. తాను శిబిరానికి చేరువౌతున్నకొద్దీ జర్మన్‌శిపాయిలు విశేషంగా, తననలెనె, తాను పోతున్న దిక్కుకే కదలుతున్నట్లు భావించాడతడు.

"ఆ వైపునవారు విశేషంగా తమబలాన్ని సమీకరిస్తూన్నా"రని ఒక ముసలికార్మికుడు చెప్పాడు, "అక్కడ రష్యన్‌దళం యేదోవున్నట్టువారు కనుగొన్నారట. దాన్ని యెలాగైనా, ధ్వంసంచేసి తీరాలని వాళ్ళు దృఢసంకల్పులై కూర్చున్నారు."

ఆ రాత్రి మార్క్ యెలాగో ఛాయకదలినట్లుకదిలి జర్మన్ శ్రేణులను దాటి ఆవలపడ్డాడు; తరవాత, మరికొంతదూరం నడచి పక్షిలా అరచాడు; ఒకచెట్టుమాటు నుండి గమనిస్తున్నాడుకూడా, అచ్చటివిశేషాలను. దూరాన్నుండి అతని ధ్వనులకు ప్రతిధ్వనులు వినిపించాయి. అంటె, తనవాళ్ళు యింకా అక్కడున్నారని గ్రహించాడు; పెక్కుసార్లు తానుచేసిన ధ్వనులకు ప్రతిధ్వనించినట్టుగా సమాధానం వస్తూండేది. దాని ఆసరాచూసుకుని మెల్ల మెల్లగా ముందుకు కదలుతూ వచ్చా

డు. కాని, యిప్పు డతనికర్థమైంది. ఆ ప్రతిఘటన వస్తున్నది బీడు భూములలోంచి కాదు, నదీగర్భంలోంచి కాదని. అంటె, చాలా ప్రమాదస్థితిలో వున్నట్టుమార్క్ తెలుసుకున్నాడు. తనవా రంతా బీడుభూములకు వెన్నిచ్చి నదీగర్భంలో తలదాచుకుం టున్నందువల్లనూ, బీడుభూములు దుర్గమంకావడం చేతనూ తిరోగమనానికి అవకాశం యెంతమాత్రం లేదు.

"ఇక మన ఆశలన్నీ అడుగంటాయి" అన్నాడు కెప్టెన్ రెండుచేతులనూ గట్టిగాపట్టుకొని. "మన యిరువురి దగ్గరా రెండే రెండుతుపాకులున్నాయి. వాటికి రెండేసిగుళ్ళకన్న మన దగ్గర లేవు. తూటాలింకా తక్కువగావున్నాయి. ఉన్నవాళ్ళ లో యుద్ధంచేయగలవారు డెబ్బైఅయిదుమందికన్న లేరు. మిగతావారిలో కొందరు యీలోకాన్నే వదిలేశారు. హత శేషులు క్షతగాత్రులైనారు. ఆశ్వికబలం చూద్దామా అంటె యిరవైనిమించి లేదు. అవేనా, రౌతులకన్నా అధ్వాన్నం గా వున్నాయి.

"మరి దీనికేదో మార్గం చూడాలి" అన్నాడు మార్క్.

ఏమార్గమూ కనిపించడంలే దనే నిరాశాపూరిత సమా ధానం చెవినిపడింది.

ఆసంగతి మార్క్ కు యేనాడో తెలుసు. కాని, తాను బయటపడి, తనతోవున్నవారిని బయట పడవెయ్యడానికే విశ్వప్రయత్నం చేస్తున్నా డతను. అతనిమనస్సు విద్యుద్వేగం తో పనిచేస్తోంది. తమలో కొంతమంది జర్మన్ స్థావరాలను ఒకదిశను యెదుర్కొంటే వారిబలం చీలిపోవడం తథ్యం. అప్పుడు మనమిగతావారు రెండవదిశనుండి చీల్చుకుంటూ

పోవచ్చును, అలా ఢీకొనేవారు నేలకూలడం సంభవమే అయినా సర్వనాశనం తప్పుతుంది.

తొందర తొందరగా తన యూనిఫారం వేసుకొని తన సైనికులముందర ప్రత్యక్షమయ్యాడు.

''కామ్రేడ్స్'' అంటూ ప్రారంభించాడు "నాతోకూడా త్యాగపూరితులైన కొందరు స్వచ్ఛంద సైనికులను ఒకానొక సాహసోపేతమూ, ప్రమాదభరితమూ అయిన కార్యాన్ని చెయ్యడానికి ఆహ్వానిస్తున్నాను. అలాచెయ్యడంవల్ల మిగతా వారు బ్రతకడానికి వీలౌతుంది. ఎవరైతే నావెనకాల రా దలచుకొన్నారో వారు నావెనక వచ్చినిలవండి."

పదకొండుమంది, జనరల్ షైలోవ్‌తోసహా, ముందుకు అడుగు వేశారు.

మిగతావాళ్ళను గురించి మార్కాకు యేమీ తెలియదు. తనతో వున్న కొద్దిమందిలో తనూ, కొరొలిన్ అనే మరొక యువకుడూ మాత్రం సజీవంగా జర్మనులకు ఖైదీలుగా చిక్కారు. మార్కాకు కాలుమీద బలమైనగాయం తగిలింది. కొరొలిన్ క్షేమంగానే వున్నాడు.

"నేనేమైపోయానో అనేస్టాలిన్ ఆలోచిస్తూ వుంటాడు" అన్నాడు షైలోవ్ తన అవసాన ఘడియల్లో మార్కాతో.

''నేను శిక్షింపబడక పోవడంచేత, నా అనంతరం స్టాలిన్ అదీ అనుకోడు" అని తలపోశాడు మార్కా. క్రోపిన్, మరొక యుద్ధఖైదీకలసి తనను అడవిలోంచి మోసుకుపోతొంటె, అతనికి తెలుసు తనకోసం మృత్యుదేవత యెదురు చూస్తోందని. హిట్లర్ యిదివరకే, ప్రకటించాడు. టాస్కా

ఫోర్సెస్‌లో పనిచేస్తూ యుద్ధఖైదీలుగా పట్టుబడ్డవారికి అంత ర్జాతీయ యుద్ధఖైదీలను చూడవలసిన సూత్రాలన్వయించవని. చావంటె అతణ్ణి యెప్పుడూ కలవరపెట్టలేదు. అది అన్నిసమస్యలను పరిష్కరించగల శక్తి సంపన్నమైన అనుభూతి అని అతనిభావం. అంతవరకూ అతణ్ణి కలవరపెడుతూ, బాధిస్తూ వేధిస్తూ వచ్చిన అనుమానపిశాచాలు, భయసందేహాలు ఒక్కక్షణంలో దూరమై పోతాయి. సర్వనాశనమనే భయానికింక తావులేదు; తన్నేది బాధించలేదు: ఎటుచూచినా శూన్యమె గోచరిస్తోంది.

కాని, తనకత్యంత సన్నిహితమైనదీ, ప్రియమైనదీ యెంతో దూరానికి జరిగిపోయింది. నీలిమబ్బులతో నిండియున్న ఆకాశవీధి తన కహితంగా తోచినా, తననివాసం కాబోతున్నందున ఆప్యాయంగా మారుతూవచ్చింది. తనసోదరులు—కోర్ని, ఇవాన్, సైమన్, తనతల్లి? ఆమె స్మరణకు రాగానే అతనిలో జాలి ముప్పిరిగొన్నది. బాధబయలైంది. మేరి యేమైనా, తనే లోకానికి తిరిగిరాలేడో, ఆలోకంలోనే వుండిపోతుంది. వెళ్ళేటప్పుడు 'బూరోవిచి'లో ఆమె కనుపిస్తుందేమో, తనభావాలను కొద్దిగా వినిపించిపోదా మనుకున్నాడు. అయితే, ఆమె కొడుకు పీటర్ కనిపించాడేకాని ఆమె కనుపించలేదు. యుద్ధం తొలిరోజుల్లో నర్సుగా పనిచెయ్యడానికి ఆమె సిద్ధపడింది.

లీనా, కాట్యా, మెరియా—యీ ముగ్గురూ జీవితంలో తనుపట్టిన మార్గాన్నే పట్టారు. ఎవరందించ గలిగిన ప్రేమపాత్రను వారందించారు. ఈ ముగ్గురి ప్రేమకావ్యాలలోని విభిన్నఘట్టాలు తనలో యేవేవో కొత్తతనాన్ని సృష్టించాయి.

దానినాతను ప్రేమ అనిపిలుచుకుంటాడే కాని 'యిది' అని మా త్రం నిర్వచించ లేడు......

తానింకా యెంతకాలం జీవించవలసి వుంటుందో అనివ్యక్త భావాలతో కాలక్షేపం చేస్తూన్నాడు మార్క్ — ఒకగంటో? రెండుగంటలో ఆతనికి లోకంతో సంబంధం! కాని, తనను ఖైదీగా తీసుకున్న జర్మన్ కల్నల్ తనను అక్కడికక్కడే కాల్చి వెయ్యక, యుద్ధఖైదీల శిబిరానికి తీసుకు పొమ్మని తన వారికి ఆజ్ఞ యిచ్చాడు. ఇప్పటికి మూడురోజులనుండి రోడ్డు మీద ప్రయాణం చెయ్యగా, చెయ్యగా శిబిరం దూరపు మేరలో కనపడుతోంది. ఇతనికి ఉత్తరువులు తెలియకుండా వుంటాయా!

శిబిరం చేరగానే మార్క్ నలువైపులా ఆశ్చర్యంతో పరికించాడు. ఎక్కడా భవనాలు కాని, వంటశాలలు కాని, నరసంచారంవుండే ఆనవాళ్ళు గాని మచ్చుకేనా కనపడలేదత నికి; బహుశః ఆకలితో శోషిస్తూ విచ్చలవిడిగా తిరిగే అనాగ రిక; జనాన్ని వాళ్ళు అసలు మనుష్యులక్రింద నె లెక్క గట్ట లేదేమో? సోవియట్ సైన్యాలింకా చెదరిపోతూ, ప్రచండ వేగంతో ముందుకు చొచ్చుకువస్తున్న శత్రువును నిరోధించే శక్తి లేకుండా వున్నాయి. శతసహస్రాలుగా జర్మన్ యుద్ధ ఖైదీలశిబిరాలలో ప్రవాహంలావచ్చి పడుతున్నారు రష్యనులు.

తనను శిబిరద్వారంలోంచి లోపలకు తీసుకువెళ్ళు తున్న సమయంలో విమానాలహోరు అతని చెవులకు సోకింది. పైకి చూడగా, ఒకదాని వెన్నంటి ఒకటి తూర్పునుండి పడ మటికి పోతున్నాయి. అవన్నీ సోవియట్ విమానాలే. హఠాత్తుగా

వేలాది కంఠాలనుండి భయంకరనాదం ఒకటి బయలుదేరింది:

"బాంబులు!"

నల్లని ముద్దలవలె కాన్పించిన కొన్ని బాంబులు నేల మీదపడి ప్రేలడం ప్రారంభించాయి. ఆప్రేలుడుకు శిబిరం నాశనమై పోయింది. దాంతో మార్క్ మెరిసి కొంత దూరంలో పడినచేతులు కాళ్ళు, ప్రవాహంగా రక్తం గాయా లనుండి స్రవిస్తున్న కళేబరాల, పెద్దగుట్టగా పడివున్నాయి. ఆగుట్టమీద మెరిసిపడ్డాడు మార్క్, బాంబు భీభత్సానికి. చచ్చిపోతున్న వారి ఆక్రందనాలు వింటూన్న మార్క్ ఆకా శంమీద మొగుతున్న విమానాలపై పుపిడికిలి మెత్తి చూపి స్తూ 'మూర్ఖుల్లారా! మీవాళ్ళ నేనా మీరు చంపుకోవడం?' అని ఉరిమాడు. నీళ్ళతో నిండిన తనకళ్ళతో, క్రోధా వేశం ప్రస్ఫుటంగా ప్రజ్వలించే నేత్రాలూ, సన్నటినుదురు, పొగ మారినట్టున్న మీసాలుగల పాపిష్టిముఖాన్ని — చూడగలి గాడు. మళ్ళీ తననేత్రాలను పైకెత్తి గద్దించాడు బిగ్గరగా 'ఎందుకు మాట్లాడరు?'

కాని, దేవతలుమాట్లాడరు. వారు చెప్పవలసిందేమీలేదు.

ఆరోజుల్లో పడమటి దిశగా పోయే రహదారులకు సమీ పంలో నివసించేవారికి, మెడ తెరపిలేకుండా, చీమల బారుల్లా, కదలిపోతూండే యుద్ధఖైదీల దృశ్యం. రివాజై పోయింది. ధూళి ధూసరితమైన ముఖాలతో, అవయవాలతో, సోలిపోతున్న శరీరాలతో, కాళ్ళీడ్చుకుంటూ మెల్ళ తరబడిని పోతూండే వారు, అడవుల్లోంచి పొలాల్లోంచి, జనపదాలు పల్లెలు, పట్ట

కాల, లోంచి మెల్లగా ప్రాకిపోతున్నారువారు వాళ్ళు ముందుకు పోతున్న కొద్దీ, వెనక నల్లటి మరకలు దారిపొడుగునా వదలి పోతూండేవారు. మార్గాయాసంచేత, బడలికచేత క్షుద్బాధ చేత ముందుకు అడుగు వెయ్యలేక కొందరు నేల కొరిగే వారు. ఈబారులు పశ్చిమ సరిహద్దుకు చేరువైనకొద్దీమచ్చలు మరీ విపరీతమైనాయి.

'తోటి సోదరుల చిత్రహింస' జరిగినకొన్నాళ్ళకు మార్క్ కూడా యుద్ధఖైదీల ఒకానొక బారులో యుద్ధఖైదీగా నడు స్తున్నాడు. అంతమంది ప్రాణాలను పొట్టను పెట్టుకొన్న రష్యన్ బాంబులు, మార్క్‌నునుంచుకోకుండా వదలిపెట్టడమె కాక, ఒకవిధంగా రక్షించాయికూడ. పడిన బాంబులు ఒక్క రష్యను లనే ప్రత్యేకించి చంపివిడవలేదు; తననక్కడకు తోలుకొని వచ్చిన జర్మన్ సైనికగార్డులను, జర్మన్ శిబిరకార్యాలయాన్ని తాను టాస్క్‌ఫోర్స్‌లో గావించిన చర్యలను వివరించే రికార్డు లను పూర్తిగా ధ్వంసం చేశాయి. ఇతణ్ణిప్పుడు యుద్ధఖైదీగా మాత్రమె లెక్క గట్టి పడమటి దిశగానడిచే ఖైదీలలో ఒకణ్ణి గా నడిపిస్తూ వచ్చారు. తనవంటి క్షతగాత్రులను బళ్ళమీద, పాదచారుల వెనక మోసుకు పోయారు.

ఆవిధంగా మార్క్ 1941 శీతకాలం తొలిరోజులలో పశ్చిమ సరిహద్దులకు కొంత చేరువలో గల ఒకానొక రష్యన్ పట్టణంలో నున్న కోటలో యుద్ధఖైదీగా రోజులు గడపు తున్నారు. ఆశిబిరంలో వేలమీాద వుంటూ వుండేవారు రష్యన్ యుద్ధఖైదీలు. కాని, తనవంటి ఆఫీసర్లు మాత్రం,

ఒకప్పుడు గిడ్డంగిగా వాడబడుతూ వచ్చిన భవనంలో, ఉంచ బడ్డారు. ఆగిడ్డంగిలోవున్న అలమారులు, అదృష్టవశాత్తు,మనిషి పడుకొనడానికి వీలైనంత విశాలంగా వుండేవి.

ఒకనాటివుదయం తలక్రింద చేతులు పెట్టుకొని వెలకిలపడు కొని వున్నాడుమార్క్. ఒక చిన్నబల్ల అతనికి దిండుగా పనిచే సింది. కాలిమీద గాయం యింకా పూర్తిగా మూను పట్టక పోయినా మృత్యుముఖంలో వున్నవారిమధ్య ఆస్పత్రినివాసం చాలబాధనిపించింది. ఆయన గాయం మానివుంటె తప్పించుకు పారిపోవడానికే ప్రయత్నించి వుండేవాడు. కాని, యింకా చేతకర్ర బట్టుకొని ఆధారపడవలసిన అవసరం కలుగుతూనే వుందతనికి.

గాయం మానకుండానే పారిపోవడం అవివేకంగా కనపడి నప్పటికీ, నయమైన తరవాత, తానుగాని, యితరులుగాని పారి పోవడానికి వీలైన మార్గాల నన్నింటినీ అతడు కనిపెడుతూనే వుండేనాడు.

ఆశిబిరంలో ఒక యువకరష్యన్ లెఫ్టినెన్ట్ ఉన్నాడు. అత డంటె మార్క్కు చాలయిష్టం. అతనిపేరు కటోవ్. అతడు, రోజు రోజు యిలా చచ్చిపోవడం కంటె పారిపోవడా నికి ప్రయత్నించి పారిపోతూ చంపబడ్డానయమె, ననేవాడు. ఆ అభిప్రాయాన్నే విలిబుచ్చే మిత్రులు కూడా అతనికి కొంద రున్నారు.

కటోవ్, యెప్పుడో ఒకప్పుడు తనసహాయంతో గాని స్వయంగానే కాని తప్పించుకు పోగలడనేనమ్మకం మార్క్కు కలగగానే అతడు కటోవ్కు ఒక ఉపాయం చెప్పాడు. "నలు

గురూ తప్పించుకునే మాదిరిగానే, ముళ్ళతీగమీదనుండి దాటి పారిపోదామనుకుంటె, యింతకుపూర్వం అలా ప్రయత్నించిన వాళ్ళగతి యేమైందో నీగతీ అదేపోతుంది. ఆముళ్ళ తీగను జర్మన్ గస్తీ సైనికు లెప్పుడు కాపలా కాస్తుంటారు. ఎవ రైనా ముళ్ళతీగను దాటడానికి ప్రయత్నిస్తే అక్కడికక్కడే కాల్చేస్తారు. ఆశవం యెన్నాళ్ళైనా అలాగే వ్రేలాడుతూ ఉంటుంది. అంటే, అలా పారిపోదామనుకున్న వారిగతి యే మాతుందో ప్రత్యక్షంగా చూపించడమన్నమాట. అందుకని నేనొక ఉపాయంచెబుతాను. అది నీకు వినడానికే అసహ్యం గాతోచవచ్చు. కాని, విన్నతరవాత, దీర్ఘంగా ఆలోచించిన మీదట నా ఉపాయం యెంతవిలువైనదో నీకె అర్ధమౌతుంది. ఇదివరకు దీన్ని యెవరూ ప్రయత్నించనూ లేదు కూడ. ఖైదీలకు యేర్పాటైన మరుగు దొడ్లున్నాయి. ఇటూ, అటూ జర్మన్ గార్డుల మరుగుదొడ్లున్నాయి. మీరు వీటిల్లోంచి తప్పించుకు పారిపోతే మీ పలాయనం అనుకున్న ప్రకారం నెరవేరుతుంది.

మరుగుదొడ్లమాట యెత్తగానే కటోవ్ వళ్ళు జలదరిం చింది. భయంతో వెలవెలబోయాడు. కాని, తనస్నేహి తులతో రోజంతా తర్జనభర్జనలు చేసినమీదట ఆరాత్రే పలా యన మంత్రం జపించడానికి నిశ్చయించారు. ఎవరికీ కనిపించ కుండా మార్క్ వాళ్ళను కనిపెడుతున్నాడు. బారక్సె లోంచి ఒక్కొక్కళ్ళే తప్పించుకున్నారు. బారక్స్‌కు మరుగు దొడ్లకు మధ్యనున్న ఆరుబయిట ప్రాకుతూ మరుగుదొడ్లను సమీపించారు. ముళ్ళతీగకు ఆవలివైపునుండి యేక్షణంలో

పైనా తుపాకిచప్పుడు వినపడవచ్చునని చూస్తున్నాడు. కాని, అరగంట అయినా యేసవ్వడి వినరాకపోయినందున, 'అమ్మయ్య' అని ఒక్క నిట్టూర్పు విడిచాడు మార్క్. కాటోవ్, అతని స్నేహితులు తప్పించుకు పోయారని అతడు నిశ్చయానికి వచ్చేశాడు. కాని, మెల్లగా వచ్చి యథాప్రకారంగా తన ప్రక్కమీద శరీరంవాల్చాడు తాను కూడ కొద్ది రోజులలో శిబిరాన్ని వదలి పోవలసి వుంటుందని మార్క్‌కు తెలియదు.

కటోవ్ బృందం పలాయనం జరిగినప్పుడు మార్క్ టైఫాయిడ్ జ్వరంతో వున్నాడు. ఇది చాల ప్రమాదకరమైన అంటుజాడ్యమనీ, యీజాడ్యం సోకినవారిని వెంటనే కనిపెట్టి శిబిరం అధికారులకు తక్షణం తెలియజెయ్యాలనీ కఠోరమైన ఉత్తరువు లున్నాయి. అటువంటి రోగినిగుర్తించి వెంటనే వార్త యివ్వగానే ఒక ట్రకుక్కవచ్చి అతణ్ణి "ఆస్పత్రి"కి తీసుకుపోతుంది. 'ఆసత్పి' అంటె శిబిరానికి కొన్నిమైళ్ళ దూరంలో అడవిలోవున్న ఒకానొకప్రదేశం. అక్కడికి యిలాంటి రోగులను తీసుకుపోయి ట్రక్కులోంచి క్రిందనున్న మంచుమీదకు దొర్లించేస్తారు, ఆకాస్త ప్రాణం యెగిరిపోవడానికి.

ఇదంతా యెరిగివున్న మార్క్ తోటిఆఫీసర్లు మార్క్ టైఫాయిడ్‌తో బాధపడుతున్న సంగతిని, చాలరోజుల వరకు పొక్కనివ్వలేదు. చివరకు ఒకనాడు, ఒళ్ళు తెలియనంతటి జ్వరం వచ్చింది అతనికి. దాంతో సంగతి బయటపడింది. మార్క్ (అంతిమ) ప్రయాణానికి యేర్పాట్లన్నీ పూర్తి అయినాయి. తమకు చేతనైనంతవరకు, జాగ్రత్తలను తీసు

కున్నారు. తమకందుబాటులో నున్న ఉన్ని కోట్లలో బాగా వేడినివ్వగల కోటును తొడిగారు. పటకా గట్టిగ బిగించారు. దట్టమైన ఉన్ని టోపీని నెత్తికి తొడిగారు. కాలికి పెద్ద కట్టు వున్నందున రబ్బరుబూటు నొక దానిని సంపాదించి తొడిగారు. అచ్చటి వారందరితోటి, తలలో నాలుకవలె కలసి మెలసి వుంటూ వుండడంచేత, అతని యెడ బాటుకు చింతించని వారులేరు. అతణ్ణి ట్రక్కులోకి మోసుకు పోతూంటే వారంతా హృదయభారం తోటి, కన్నీళ్ళతోటి వీడ్కోలిచ్చారు.

మంచుతో దట్టంగా కప్పబడివున్న అడవినేలపై దభాలున దొర్లింప పడినప్పుడు అతని కొంకింత స్మారకం వచ్చింది. మెల్ల మెల్లగా కళ్ళు తెరచాడు. జ్వరతీవ్రత మీదనున్న అతని కండ్లకు తనచుట్టూవున్న చెట్లూ చేమలూ, పైనున్న ఆకాశమూ గిర్రున తిరిగి పోతున్నట్టనిపించినందున యేదో కలగంటున్నా ననుకున్నాడు. ఆ తిరిగే పోయేచెట్లమధ్య యెదో గోధుమవర్ణపు మచ్చ వెనక్కీ, ముందుకీ కదలు తున్నట్టు తోచింది...ముందికి వెనక్కి- వస్తోంది. పోతోంది. ......

ఎలాగో లేనిఓపికను తెచ్చుకుని కలలోంచి బయట పడాలని, చెదిరిపోయిన మనస్సును అదుపులోపెట్టాడు. అప్పుడు తటాలున జ్ఞప్తికి వచ్చిందతనికి, తనకు జ్వరం వచ్చినకొత్తలో "ఆస్పత్రి"నిగురించి వింటూవచ్చిన విషయాలు. దాంతో కొంతవర కర్థమైంది తా నెక్కడనున్నదీ. ఒకసారి చుట్టప్రక్కలకు దృష్టిని పోనిచ్చి. పడివున్న మానవకళేబరములను చూసేవరకూ తా నెక్కడున్నాడో స్పష్టమైంది.

అంటె, అది అతని చివరిక్షణమేయలన్నమాట. ఎటువంటి చరమదశ! కాని, మరీ అంత చెడ్డది కాదేమొ. కొద్దిసేపటిలో అతనికి స్పృహ తప్పిపోతుంది; కళ్ళు మూతలుపడిపోతాయి; ఆలాగే, దీర్ఘనిద్రలో మునిగిపోతాడు; ఇక లేవడమంటూ వుండదు.

గోధుమవర్ణపు ఛాయ మళ్ళీ అతనిముందు ప్రత్యక్షమైంది. దాంతో అతనినావరించివున్న మైకమంతా పటాపంచలై పోయింది. భయంతో ఆపాదమస్తకం వణికిపోతున్నాడు. గోధుమవర్ణంలో వస్తూ పోతూవున్న ఆచాయ అడవి యెలుగు బంటి తప్ప మరొకటి కాదు. కుష్కించి, శుష్కించి శల్యావశిష్టమైన ఆ యెలుగుగొడ్డు అస్థిపంజరంమీద వెంట్రుకలతో కప్పబడివున్న చర్మం ఒదులు ఒదులుగా వ్రేలాడుతోంది. ఒక్కక్షణకాలం ఆ రెండుజీవాలు పరస్పరం చూచుకున్నాయి. మనిషి, యెలుగుబంటి- తనకు రానున్న ప్రమాదమూ, ఆ ప్రమాదంనుండి తాను తప్పించుకొని బ్రతికి బయటపడాలనే అభిలాష అతనికి యెక్కడలేని శక్తినీ తెచ్చిపెట్టాయి. భయవిహ్వాలుడైన అతనిచూపులు 'చూడు, యేం చేస్తానో' అన్నట్లున్నాయి. లేచి ఆమృగంపైపు నడచాడు; కొంతదూరం కాళ్ళీడ్చు కొంటూనూ, కొంతదూరం పరుగిడుతూను వెళ్ళిపోయిందా ఎలుగుబంటి.

తన నావరించిన భయం తొందరపెట్టగా, మార్కు నడక సాగిస్తూ వచ్చాడు. నడక సాగుతున్నదని భయం లేదనుకున్నాడు. ట్రక్కుపోయిన జాడనుబట్టి నడుస్తూ చివరకురోడ్డుచేరు

కున్నాడు. ఒకక్షణం ఆగి వెనకకు చూశాడు. ఎలుగుబంటి కూడా తన వెనకనే నిలబడివుంది.

గత్యంతరంలేక, రొమ్మును మార్క్ మొగాదిగా చూశాడు. పడమరగా కుడివైపుకు వెళ్ళితే శిబిరంవుంది; తూర్పుగా ఎడమవైపునకు వెళ్ళితే బొరొవిచి పట్టణంవుంది. ఆ పట్టణం లోనే ఒక్క చిన్నయిల్లు– మేరియా నివాసం. ఈ లోకంలో తానెలాగైనా, యెప్పటికైనా చేరుకోవాలని అభిలషించే చోటు. అదైనా, తాను కావాలని చేసుకొన్న నిర్ణయం కాదు. అదొక, ప్రేరేపణ. ఎడమవైపునకు వెళ్ళి నడక ప్రారంభించాడు. అతణ్ణి తరుముకుంటూ నీడలా వెంబడిస్తోంది మృత్యువు.—ఎప్పుడు పడిపోతావా, యెప్పుడు మీదకురుకుదామా అన్నట్టు. కాని, అతడు పడిపోలేదు. పడడం కూడా యేమంత అసంభవం కాదు; ఎప్పుడైతే తానింక నడవలే ననుకొనేవాడో, దెబ్బతగిలిన కాలితో నేలమీద గట్టిగా తన్నేవాడు. దానితో వేడివేడి సూదులతో ఒక్కసారి పొడిచి నట్టుగా బాధ నరాలను తోడేసేది. ఆ బాధతో ముందుకు అడుగు దానంతటఅదే పడుతూవచ్చేది.

భగవంతుడు తనచిత్ర విచిత్రలీలల నేవిధంగా నిర్వహిస్తాడో చెప్పడం కష్టం. కటోవ్ కు తప్పించుకు పారిపోయేముందు, అతనికి మార్క్ బొరొవిచిలో వున్న మేరియ పేరు, అడ్రసూ యిచ్చాడు. ఆ జాడ తీసుకుంటూ ఒకనాటిరాత్రి ప్రొద్దు పోయాక ఆకలితో సోలిపోతూ, చలితో చచ్చిపోతూ, మేరియాయిల్లు చేరుకున్నాడు. ఆమె అతడుపడిన భంగపాటు నుండి కోలుకునేవరకు ఆశ్రయమిచ్చి ఆదరిస్తూ వచ్చింది.

అతనికి కొంచెం జవసత్తువలు చేకున్నపిమ్మట ఒక శక టాన్ని కుదుర్చుకుని యిద్దరూ శిబిరానికి వెళ్ళేరు. తనతల్లి నడిగిపుచ్చుకున్న బంగారునాణెములు మేరియా దగ్గరవున్నా యి. వీటి ఆసరాతో కొరొలిన్, మార్కులను తప్పించవచ్చు ననుకున్నది మేరియా. కొరొలిన్ విడుదలను సాధించడంలో కష్టం అంతగాలేదు. కారణం, వేలాది శిపాయీలలో అత డొక సామాన్య సైనికుడు. అంతమందిలో అతడదృశ్యమైనా డన్న సంగతిని గుర్తించడం కష్టం. ఆ వంకతో కావలివాళ్ళు తమ ప్రమత్తతను సమర్థించుకోవచ్చు. కాని, మార్కు విష యం అలాంటిది కాదు. ఉన్నతోద్యోగుల వర్గానికిచెందినవా డనడంవల్ల ఏ కాపలావాడూ అతని పలాయనానికి తోడ్పడి తాను ప్రమాదానికి గురికా నొల్లడు. కాని, ఆ అవసరం లే కుండా నే పోయింది మార్కు విషయంలో. మార్కుకుజ్వరం రావడం కొరొలిన్‌కు తెలుసు. టైఫాయిడ్ జ్వరంతో, వొళ్ళు తెలియని పరిస్థితీ తెలుసు. ఆసంగతి శిబిరఅధికారులు తెలుసు కోవడం, తన మేజరును చచ్చిన శవాన్ని తీసుకువెళ్ళినట్లు ట్రక్కులో వేసితీసుకుపోతోంటే నిస్సహాయ స్థితిలో కళ్లప్ప గించి గుటకలుమ్రింగుతూ చూస్తూ వుండిపోవడమూ అతనికి బాగా జ్ఞాపకం వున్నాయి.

ఎలాగైతే నేమి స్వేచ్ఛపొందిన కొరోలిన్ శకటంలో మేరియా సరసను వెనుకభాగంలో కూర్చున్నాడు. ఎదట కోటోవ్ నిలుచుని, బండికి కట్టిన జోడు గుర్రాలను తోలు

తున్నాడు. గుఱ్ఱాలు శక్తివంచన లేకుండా పరుగెత్తుతున్నాయి. లంచం తిన్న కాపలావాడు అడవిలో బయలున్న గుర్తులను చెప్పాడు వారికి.

ఆశకన్న నిరాశే వారికెక్కువైంది. అప్పటి కప్పుడే సాయంకాలం చాల ప్రొద్దుపోయింది. మార్క్‌ను తీసుకువెళ్ళి అప్పటికి చాలా గంటలు గడిచాయి కూడా. అసలే టైఫాయిడ్ జ్వరంతో స్మారకం లేకుండా వున్న రోగి, దానికి తోడు, నట్టడవిలో దట్టంగా మంచుపడుతూంటే దానికి సరి అయికూడా బ్రతికి వుండడం సాధ్యమా? ఐనా, వారికి ఆశ చావలేదు. "బండి త్వరగా పోనివ్వండి మీకు పుణ్యముంటుంది; ఊఁ పోనివ్వండి' అంటూ వెనుకనుండి మేరియా కాటోవ్‌ను హెచ్చరిస్తోంది. ఆహోరుగాలిలో కాటోవ్‌కు ఆమె మాటలు చెవి సోకకపోయినా వీపున దహిస్తున్నట్లుగా చబుకుతో గుఱ్ఱాల న దేపనిగా అదలిస్తున్నాడు.

రోడ్డుప్రక్కకు మళ్ళినప్పుడు ట్రక్కు విడిచిన జాడలనుపట్టుకొని మార్క్ వదలివేయబడిన బయలును చేరుకున్నారు. ఎక్కడికక్కడ కుప్పలుకుప్పలుగా పడివున్న కంకాళాలస్వరూపాలనువారు చూడగలిగారు. చెదరిపోయిన మనసులను చేతబట్టుకొని, హుటాహుటీగా వారు శకటందిగి, ముగ్గురూ మూడు వైపులా నడుస్తూ ఒక్కొక్కకుప్పనే పరిశీలిస్తూ వచ్చారు. మంచుతో కప్పబడిన వారిముఖాలను తుడిచి పరీక్ష చేస్తూ వచ్చారు.

ఉన్నట్టుండి కొరోలిన్ ఒక పెద్ద కేక పెట్టాడు. మిగతా యిరువురూ ఒక్క ఊపులో వెళ్ళి అతని ప్రక్కనవాలారు, మార్క్ శవం కనపడివుంటుందనే నమ్మకంతో. కాని, ఆశరీరంమార్క్ ది కాదు; నాటి ఉదయం మార్క్ తో పాటు మరొక ఆఫీసరునుకూడా అదె ట్రక్కులో తీసుకువెళ్ళారు. ఆయనది, ఆ శవం.

ఐతే, మార్క్ యేమైనట్టు? వారిద్దరినీ ఒకేసారి క్రిందకు దొర్లించి వుండాలి. కొరోలిన్ లేచి ముఖంమీద పడిన ఘర్మ బిందువులను తుడుచుకుంటూ, నేలమీదనున్న మంచును మరింత సూక్ష్మంగా పరిశీలించగా, జంట వరసలలో అడుగుల జాడలు ఆబయలు అంచులవరకూ కనిపించాయి. ఆ జాడను వెంబడించి చూడగా, మంచుపడటం ప్రారంభమైె ఆట్టేసేపు కాకపోవడంచేత, ఎవరో వ్యక్తి కాళ్ళీడ్చుకుంటూ ముందుకు సాగినట్టు స్పష్టమైంది. కొన్ని అడుగులతరవాత వ్యక్తి పడివున్న చెట్టును దాటాడు; దాటేటప్పుడు మంచుతో కప్పబడివున్న చెట్టు మానుపై అడుగువేసి వుండాలి. అందుకే, ఆమంచుమీద, శిలువ అచ్చుగుద్దినట్టు శిలువ గుర్తుపడింది. కాని సైనికబూట్ల మడమలమీద ఆ బాపతు గుర్తులు లేవు. ఎటూ తోచక కొరోవిన్ ఆగి నిదానించాడు. అప్పుడతనికి జ్ఞాపకంవచ్చింది, మార్క్ ఒపాదానికున్న జోడు రబ్బరు జోడని.

ఆజాడపట్టుకొని యింకొంచెం ముందుకు వెళ్ళాడు. చటుక్కున అతని కంటబడ్డాయి, పొదలు దాటిన తరవాత, మరొక

రకం పాదచ్ఛాయలు. అవి మనిషి పాదాలు కాను, జంతు పాదాలు. అవివొచ్చి, మనిషి పాదచ్ఛాయలను కలుసుకున్నాయి, అటువంటి అడుగు లే జంతువుకు సంబంధించినవో అతనికి బాగా తెలుసు. అది తలచుకునేటప్పటికి భయంతో అతని రక్తం పేరుకుపోయింది.

అయితే, మనిషిఅడుగు జాడలు, జంతువు అడుగు జాడలు చెరియొక వైపు కనిపించాయి. ఐతే, మార్క్ యెక్కడికి వెళ్ళివుంటాడు? అతనికి మేరియా జ్ఞాపకం వచ్చి వుంటుంది. ఔను, ఆదిశగానే మార్క్ వెళ్ళివుండాలి అన్న నిశ్చయానికి వచ్చాడు. కారోలిన్, రోడ్డుపట్టుకుని తూర్పుదిశగా వడివడిగా నడచి వెళ్లాడు, తన ఆశ ఫలించక పోతుందా అని. కొలదిసేపటిలోనే తన అనుమానం నిరాధారం కాదని రుజువు చెయ్యగల ఆధారాలు దొరికాయి. గోధుమ వర్ణపు ఉన్ని కొంత, వంగివున్న ఒక కొమ్మకు వ్రేలాడుతోంది. ఎలుగుబంటి యీదిక్కుగా వచ్చివుండాలి; మార్క్‌ను వెంబడించి వుండాలి; ఇది అతని పరిశోధన సారాంశం.

కొన్ని నిముషాల్లో వాళ్ళు మహావేగంతో రోడ్డును బట్టి ప్రయాణం సాగించారు. బారోవిచివైపు; వారి ఆశలు మోసపెత్తాయో; లేక, అడుగంటాయో?

రాత్రిపడింది. నక్షత్రా లొక్కొక్కటే బయటపడుతున్నాయి. అడవిలో చీకట్లుచిమ్ముతున్నాయి. తనకు స్పృహ తప్పే లోపల యీ చీకటిలో పడివుండడ మెందు కనుకున్నాడు, మార్క్. మళ్ళీ మార్క్, గాయం తగిలిన తన కాలితో, నేలను

గట్టిగా తన్నాడు. బాధయెక్కువగా తోచినా, ఫలితంతగ్గి నట్టే భావించాడతను. ముచ్చెమటలు పొయ్యడంవల్ల కోటు బొత్తాములు ఊడతీశాడు. చీకటి దట్టమైనకొద్దీ భల్లూకం చేరువౌతోందన్న సంగతి అతణ్ణి కలవరపెడుతోంది. ఇప్పు డతనికీ, జంతువుకూ కొన్ని అడుగులదూరంకన్నా లేదు. కాళ్ళు సీసపుకాళ్ళవలె బరువులెక్కాయి. వాటిని కదిపేశక్తి కూడా అతనికిలేదు.చివరకు గాయంతగిలినకాలు అతణ్ణికూర్చో బెట్టేసింది. తీగా కూర్చున్నాక నిలొచ్చలేకపోయాడు. చేతుల మీద, మోకాళ్ళమీద ప్రాకడం ప్రారంభించాడు. నిరాశా, నిస్పృహాబాష్పాలు కళ్ళలోనుళ్ళు తిరుగుతున్నాయి. భల్లూ కం బాగా చేరువైందని పసిగట్టి మోకాళ్ళమీదనే వెనకకు తిరిగి పిడికిలిబిగించి దానివైపు చూపించాడు; దాంతో భల్లూ కం వెనకకు తగ్గింది.

మార్క్ చెవుల్లో యెదో గింగురుమంటూ శబ్దం వినవ స్తోంది, శ్వాసబరువుగాను హ్రస్వంగాను వెలువడుతోంది. ఐనా, మోకాళ్ళతోటి, చేతులతోటి ముందుకు ప్రాకుతూనే వున్నాడు. మంచువల్ల బీటలువారిన గాయాలనుండి రక్తం స్రవిస్తోంది. పోనుపోను, రొడ్డు ఎత్తు పైతూ వుండంచేత మార్క్ ఓడిపోయాడు. లేవడానికి మళ్ళీమళ్ళీ ప్రయత్నించా డేకాని, ప్రతిసారి పడిపోతూనేవచ్చాడు. ఇక తానెంతమా త్రమూ ముందుకు పోలే ననేనిశ్చయానికి వచ్చేసి అవనత ముఖుడై రోడ్డుమీద అలాగే పడివుండిపోయాడు, ఆఖరుసారి తెగించి, మృత్యువుతో పోరడానికి కావలసిన బలాన్ని సేకరించు కుంటూ.

ఎలుగుబంటి ఒకటి రెండు క్షణాలలాగే నిలబడిపోయింది, నిరీక్షిస్తూ. అప్పటికీ ఆ మానవశరీరం, కదలలేదు, మెదల లేదు. మెల్లగా సమీపించింది. దాని నిశ్వాస వెచ్చదనం తన తలకుసోకుతున్న దానినిబట్టి, తలదగ్గరవున్నట్టు తెలుసు కున్నాడు. వెనకకు, మళ్ళీ సగంలేచి కూర్చొని తన ఉన్ని టోపీలో చుట్టపెట్టిన తనచేతిని దానిదౌడలమధ్యకు పోనిచ్చా డు. ఎలుగుబంటికూడా బాగా అలిసిపోయింది. తన పంజాను యెత్తి మార్క్ గుండెలమీద ఒక్కచరుపు చరిచింది. కాని, అది అంతబలమైన దెబ్బ కాదు. మార్క్ దానితలను పట్టు కుని గట్టిగా గుంజాడు. ఇద్దరూ రోడ్డుమీద దొర్లుతున్నారు. మెల్లగా, యెలుగుబంటి తన వెనకకాళ్ళమీద లేచి నిలుచుని మార్క్‌ను నిలువునా యెత్తింది. ఆవిధంగా అతడూ, జంతువూ నిల్చుండిపోయారు, కుస్తీపట్టే మల్లయుద్ధ ప్రవీణుల్లాగ.

మార్క్ శరీరం వివశత్వం పొందుతోంది; కళ్ళుమూతలు పడుతున్నాయి; బోర్లాపడి దొర్లిపోయాడు. ఎలుగుబంటి అతనిప్రక్కకు చేరింది, మెల్లిగా. ఇక, తనకోఱలను అతని శరీరంలోకి దింపుదామని ప్రయత్నిస్తూంటే శరవేగంతో అక్కడి కొకశకటంవచ్చి ఆగింది. దానిమీదనుండి ఒక్కుమ్మడి గా ఒకడు క్రిందకురికాడు. పొడుగాటి వేటకత్తిని యెలుగు బంటి భుజంక్రిందగా పొడిచాడు. జంతువు వెనక్కు పడి పోయింది. తాను ప్రతిఘటిస్తున్నట్టుగా తలపంకించి, స్పృహ లేకుండా పడివున్న మార్క్ ప్రక్కకు దొర్లిపోయింది. సుదీర్ఘ మైన తన అంతిమయాత్రను సుఖంప్రదం చేసుకోడానికా

అన్నట్లు ఒకటి, రెండుసార్లు యిటూ అటూ సద్దుకుని కదలిక లేకుండా పడి వుండిపోయింది.

మేరియా కన్న బాగా పెద్దదైన వేరొావాహ్లోవా మేరియాతోటే వుంటూ వుండేది. మేరియా పెద్దకుండతో నీళ్ళు కాస్తొంటె వాహ్లోవా అతని మురికిమ స్తులను తొలగిస్తోంది. బెదరిపోయి ఆమె పెట్టిన కేకకు మేరియాపరుగెత్తుకు వచ్చింది. వారిముందర ఒక అస్థిపంజరానికి బాగా అతుక్కు పోయినట్టుగా వుంది. మోకాళ్ళువాచి రక్తాలు కారుతున్నాయి. కాళ్ళ మీాద యెక్కడా కండరాలుకాని, మాంసం కాని వున్నట్టు లేదు. అవి రెండూ యెందుకు పనికిరాని రెండుకొయ్యముక్కల వలె వున్నాయి. చర్మంతప్ప మరేమిలేని ఆ పొడుగాటిచేతులు బాగా వాచివుండడమె కాక యెండిపోయినరక్తంతో దరుజు చేసినట్టుగా వున్నాయి.ఆ నగ్నశరీరాన్ని చూడలేక తన రెండు చేతులతో తను ముఖం మూసేసుకుంది మేరియా. అటుతరవాత, యెన్నాళ్ళనుండో నీటతడవని ఆ శరీరాన్ని వాళ్ళు మెల్లగా కడగడం ప్రారంభించారు. ఇద్దరూ మోసుకువెళ్ళి పక్కమీాద పడుకోపెట్టారు.

మార్క్ చావుల బ్రతుకుల సరిహద్దులలో చాలకాలం కాపురం వున్నాడు. కలలో తనుమళ్ళీ ఒక చిన్నబాలుడై పోయాడు. తన తుపాకీతో నాడుకోనిమ్మని బ్రతిమాలుకొనడమో, లేక, స్టెప్పీలకు గొర్రెలమందను తోలుకుపోతూ కేకలు పెట్టడమో చేసేవాడు.

తెలివిరాగానే అతడాడిన మొదటిమాట "మంచినీళ్ళు," కావాలని నీరసంగా - అతినీరసంగా - అడిగాడు. స్త్రీ ముఖ మేదో తనపై వ్రాలివున్నట్టు అతడు చూశాడు; ఆ ముఖాన్ని తానిదివరకు చూసినట్టు జ్ఞాపకముంచుకున్నాడు. కాని, అది వేరొకలోకంలో తనపిల్లలరక్షణభారాన్ని వహించిన ప్రేమైక మూర్తివలె ఉంది. తరవాత ఒకపొగమంచు కప్పినట్లయింది; వెంటనే నిద్రలో మునిగిపోయ్యాడు.

మరొక రెండువారాలు గడిచేటప్పటికి మార్క్‌కు కొంత స్వస్థత చేకూరడమే కాక, ఓపికకూడా వచ్చింది. డాక్టరు మేరియాకేసి తిరిగి, ఆత్మశక్తి సాధించిన యేమహాత్మ్యంవల్లనో యితడు మళ్ళీ బ్రతికివున్నాడు. తానింకా పక్కమీద నుండి లేచేస్థితిలో లేకపోయినా, యింకాకొంచెం స్వస్థత చేకూరినట్టుగా వున్నాడు. చేతులు, మోచేతులు మాను పట్టాయి. అంతకంతకు పుష్టిచేస్తున్నాడు. జర్మన్ యుద్ధరంగం దాటి తనకందిన లేఖ, అందలివిషయాలు కూడా తనకేవో స్వప్నగతవృత్తాంతంగానే తోచింది.

ఒకనాడు పక్కమీద మార్క్ ప్రక్కనే కూర్చుని మేరియా ప్రపంచ వార్తలను మెల్ల మెల్లగా వినిపిస్తూ వచ్చింది.తూర్పున యుద్ధరంగం మంచువల్ల స్తబ్దతగా వుండిపోయింది. అక్కడ నుండి వార్తలు కూడా సరిగ్గా రావడంలేదు. యుద్ధరంగానికి యీవైపున ఒక నవజీవనం చిగురిస్తోంది. ఆక్రమిత ప్రాంతాలలో రష్యన్లేమిచేస్తున్నారో, వారివారి వ్యాపకాలేమిటో జర్మనులంతగా పట్టించుకోవడం లేదు. రైతాంగం సమిష్టి

వ్యవసాయవిధానానికి స్వస్తిచెప్పి ఉన్న భూమిని తమలో తాము పంచేసుకున్నారు. ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులు మళ్ళీ యెవరి పనుల్లోకి వారు వెళ్ళడం ప్రారంభించారు. ఏదోవిధంగా ప్రజలకు ఆహారం, జీవితావసరాలు సేకరించుకోవాలిగదా! మరిన్ని యింకా పశ్చిమంగా వున్న ఆక్రమిత ప్రాంతాలలో జర్మనులు ప్రజాప్రభుత్వాన్ని అమలులో పెట్టారు. బారోవిచి ప్రాంతంలో మాత్రం యింకా సైనిక ప్రభుత్వమె నాగుతోంది. ఇదమిద్ధమనె ప్రభుత్వమేది యేర్పాటు కాకపోవడంవల్ల ప్రజలె తమకు వీలుగా నున్న ప్రభుత్వాన్ని యేర్పాటు చేసుకునేవారు. ఒకటి రెండు దుకాణాలూ వెలిశాయి; సంత రోజులను కూడా నిర్ణయించు కున్నారు.

'ఇదంతా ఒక వింతగా లేదు?' అంది మేరియా 'సోవియట్ అజామాయిషీలో ప్రతివాడు కిరాయికి పనిచేస్తున్నామనే అనుకునేవాడు. ఎవరో యజమానికోసం చెమటా, రక్తమూ ధారపోస్తున్నా మనుకునేవాడు. కాని, వారిలోయిప్పుడు పెద్దమార్పు కానవస్తోంది. ప్రతివారిలోనూ కార్యోత్సాహం వెల్లివిరుస్తోంది. గ్రామాలలో పెద్దపెట్టున కోళ్ళ పెంపకం సాగుతోంది. సైనికావసరాలకు పనికిరాని గుర్రాలను జర్మన్ల నుండి రైతాంగం కొనడంప్రారంభించారు. పనికి రాకుండా పడివున్న లోహపు రేకులతోటి కుటుంబావసరాలకు కావలసిన వస్తు సామగ్రి తయారవుతోంది. దీనిలో గర్భితమైవున్న రహస్య మేమిటంటావు, మార్క్?'

చాలాసేపు మార్క్స్ అలాగే మౌనంగా పడుకుని వున్నాడు. కొంత సేపటికి సమాధానం యివ్వడం ప్రారంభించాడు. "ప్రజలలో జీవితాశ చిగురించింది. స్టాలిన్ కమ్యూనిస్టు విధానం పడిపోయే సమయం వచ్చిందని భావించడమె ఆజీవితాశ. ఇంతకూ, జర్మను లెంతవరకు మన విధానాలను అనుమతిస్తారో యేమేమి చెయ్యదలచుకున్నారో, యెవరికీ తెలియదు. కాని, కొంతకాలానికే జర్మనులు వెళ్ళిపోతారనీ, అప్పటికి కమ్యూనిస్టు విధానమూ అంతమౌతుందనీ, అప్పుడు తమకు యే బెడదా లేక సుఖంగా వుంటుందనీ భావిస్తున్నారు. కనక, వారు స్వలాభంకోసం పాటు పడుతున్నారు, కాని, నాకు మాత్రం యిదంతా ఒక కలవలె కనిపిస్తోం దంటె, నమ్ము."

మేరియా తన రెండు చేతులనూ మోకాళ్ళమీద ఆనుకుని కూర్చుంది. తన చేరడేసి కళ్ళతో, రెప్ప వాల్చనైనా వాల్చకుండా. చిరునవ్వైనా లేకుండా, అలాగే చూస్తోంది. "నిన్ను నేను ప్రేమిస్తున్నాను, మార్క్స్"

ఆహా! యెంతకాలంనుండో యెదురుచూస్తున్న ఆప్రియతమమైన వాక్కులు – ఆమధురభావం – తన చెవుల సోకాయి. ఆమె ఆవిధంగా తన భావాన్ని వ్యక్తం చేస్తుందని లీలగా గ్రహించినా, అంత ప్రశాంతంగా, అంత సహజంగా ప్రకటించినందుకు అతని ఆనందం వెల్లివిరిసింది. అతనిని వెతుక్కుంటూ అడవిని బడి చివరకు బ్రతికించింది. ప్రాణాన్ని నిలబెట్టింది; బ్రతుకుమీద ఆశను రేకెత్తించింది. ఆ లావణ్యా

మూర్తి నుంచి యేదో చైతన్య స్రవంతి ఉరకలు వేసుకుంటూ ప్రవహించి అతణ్ణి ముంచేసింది. అతనిలో యెనో కొత్త రక్తం, ప్రసారమైనట్టు భావించాడు. ఆమె చేతుల్లో నిస్సహాయ స్థితిగా, అనారోగ్య స్థితిలో విగతవస్త్రయై, భయవిహ్వలురాలై చిక్కాడు. తనకొరకామె యేమేమి చెయ్యవలసి వచ్చిందో అదంతా ఊహించాడతను. అంతా అయిన తరవాత కూడా ఆమె తనను ప్రేమిస్తోంది; తాను వినదలచుకున్న మాటలను కూడా ఆమె అనేసింది.

ఆమె చేతిని తన బుగ్గలకు అదుముకుంటూ మృదువుగా అన్నాడతడు:

'ప్రతిమనిషికీ, పుట్టినప్పుడే, యెంత పెట్టిపుట్టాడో నిర్ణయమౌతుంది. కొందరికి హెచ్చు; కొందరికి తగ్గాను. నేను మాత్రం అదృష్టం చేసుకుని పుట్టివున్నందున నీ నిండు ప్రేమ నాకు లభించింది. నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తున్నాను, మేరియా.'

ఆమె అతని భుజంమీద వ్రాలింది. ఆమె నిశ్వాస వేడిమి అతని చెక్కిళ్ళకు తాకుతోంది. 'నాటి రాత్రి జ్ఞప్తి వుందా?' అన్న మాటలు అతని చెవులో గొణిగింది మేరియా, 'అప్పుడు మనం యిప్పటికన్నా యౌవ్వనంలో వున్నాం. ఆయౌవ్వనోద్రేకంలో కొన్ని క్షణాలపాటైనా మనం ఒకరి నొకరం మోసం చేసుకున్నాం. నీ బాధనూ, భారాన్నీ కొంత నేనూ పంచుకుని నాటినుండి నేటివరకూ అలా భరిస్తూ వస్తున్నాను. మనకు పరస్పరం ప్రేమించుకునే హక్కు లేదని యెందుకనుకోవాలి, మార్క్? ఎక్కడచూచినా, ద్వేషమె కానవచ్చే యీనాడో

జుల్లో మనం అన్యోన్యం ప్రేమించుకుంటున్నాం. ద్వేషంలో ప్రేమ. ముందర ప్రేమించుకుంటే తరవాత ద్వేషించుకో వచ్చు. ఈ రోజుల్లో ప్రేమించుకుంటూ కూర్చున్నంత మాత్రాన సరిపోదు కదా!"



# ప్రేమ-ద్వేషం

ప్రేమ—ద్వేషం! రాబోయే వారాల్లో, నెలలలో, యేళ్ళలో మార్క్, మేరియా అన్నమాటలను పదేపదే జ్ఞాపకం చేసుకోవలసి వచ్చింది.

అతని జీవితమంతాకూడా తన కేదో తెలియని విషయంతో తలపడవలసి వచ్చింది. ఆ తెలియని విషయాన్ని ప్రేమతోటి ద్వేషంతోటి కూడ నిర్వహించ వలసి వచ్చేది.

తన మహాదేశంలో యెక్కడచూసినా అందం, ఆనందం, జీవితాశ గజ్జెలు కట్టుకుని నాట్యంచేసేవి. —ఆ పంటపొలాల్లో ఆవిపిన సీమల్లో, ఆ పర్వతశ్రేణుల్లో. మైదానాల్లో, నదీతరంగాలలో, తటాక వీచికలలో శీతాతపములలో, గానంలో, కవనంలో, నృత్యంలో— యెక్కడచూచినా—అందమే, ఆనందమే చిందు లాడుతున్నాయి.

కాని, తాను చిరుతప్రాయం నుండి పెరిగి పెద్దవాడయ్యాడు. పేదరికం, నైరాస్యం, కష్టసుఖాలు, భయశోకాలు, క్రోధమాత్సర్యాలు.ంమరణం, వినాశం తప్ప మరేమి కాన్పించలేదీ మధ్య కాలంలో. ఎల్లప్పుడూ, శాంతినే కాంక్షించె తనకు యుద్ధం తప్ప మరేమి ద్యోతకం కాలేదు; ప్రేమ రాజ్యంలో బ్రతికాలనుకున్న తనకు ద్వేషం రాజ్యం యేలడం కాన్పించింది.

రోగంతో, కదల మెదలలేని నీరసస్థిసులో వుండి కూడా మార్క్ తన భావ నేత్రంతో చూస్తున్న దేమిటి? పశ్చిమ

రష్యాయావత్తూ జ్వాలకుండంలా మండిపోతోంది. — సస్య శ్యామలమైన పొలాలు యుద్ధజ్వాలలో స్మశానవాటికలుగా తయారైనాయి. స్టాలిన్ కఠోరశాసనాల ననుసరించి గ్రామాలు, పట్టణాలు-ఒకటేమిటి సర్వం అగ్నికాహుతి చెయ్యబడ్డాయి. పొగలు జిమ్మే ధూమమహోమాలుగా మారిపోయాయి జనపదాలు; ప్రజలు లక్షోపలక్షలుగా మృత్యుగహ్వరంలోకి దొర్లిపోతున్నారు. పెఠెల్. పెఠేల్‌మనే శబ్దంతో ఫిరంగి గుండ్లు, బాంబులు బ్రద్దలౌతోంటే, సైనికులు తుపాకులను బారుపెట్టి కాలుస్తూ ఉన్నారు. 'గ్యాస్ చేంబర్సు' యుద్ధఖైదీల తాత్కాలిక విడిదిస్థావరాలుగా నానాటికి పెరిగిపోతున్నాయి; ఆకలి, అనారోగ్యమూ సర్వ వ్యాప్తమైపోయాయి.

స్టాలిన్...హిట్లర్...వీరిరువ్వురిలో యెవరెక్కువ దుర్మార్గులో అన్నప్రశ్నను యితరులతోపాటు, తానూ వేసుకునేవాడు. ఎవరిమీద ముందు యుద్ధం సాగించడం-హిట్లరనె నమ్మకమే తనకు కుదిరితే, తనకు శక్తి శక్తివచ్చిన పిమ్మట సాధ్యమైనంత త్వరలో యుద్ధస్థలానికి వెళ్ళి దండెత్తిన శత్రువులను తరిమికొట్టడానికి సర్వశక్తినీ ధారపొయ్యాలి. దానివల్లస్టాలిన్ చేతులూ బలపడవచ్చు. అతని అధికారమూ చిరస్థాయి కావచ్చు; కాదు, స్టాలిన్ దుర్మార్గుడు, అనే నిశ్చయానికివస్తే హిట్లరుకు సహాయం చెయ్యడం తనవిధి; అలా చెయ్యడంవల్ల రష్యా అంతా హిట్లర్ చేతుల్లో జర్మనీ వలసదేశంగా మారిపోయినాసరే.

ఆవిధంగా డోలాయమానమైన వ్యక్తి మార్క్, ఒక్కడే కాదు. తన చుట్టూ, బొరొవిచిలో, జర్మన్ ఆక్రమిత ప్రాంతంలో వున్న రష్యనులందరూ యీవిషయ ప్రశ్నలనే వేసుకుంటున్నారు. వీరందరిలో సామరస్యం యేర్పడింది. ఒకరినొకరు అర్థ చేసుకున్నారు. ఆ సామరస్యంతో యీ సమస్యలను చర్చిస్తూ వాదోపవాదాలు చేస్తూవచ్చారు. ఏమిటి ముందు కర్తవ్యం? చివరకు 1942 వసంతకాలంలో ఒకనాడు వారంతా ఒకచోట సమావేశమై నిర్ణయానికి వచ్చేశారు; స్టాలిన్నూ, అతని ప్రభుత్వాన్నీ యెదిరించి, జర్మనులపక్షాన్ని యుద్ధం చెయ్యడం లక్ష్యంగా పెట్టుకుని పనిచెయ్యడానికి ఒకవ్యవస్థను యేర్పాటు చేసుకోవాలనుకున్నారు.

అలా చెయ్యడంవల్ల ఉత్పన్నమయ్యే ఫలితాలస్వరూపం యెలా వుంటుందో మార్క్ చిత్రించేటప్పటికి సభలో ఉద్రేకాలు బయదేరాయి.

" ఈ విధానంలో వున్న మహోపద్రవాలను ప్రతివారు బాగా గుర్తించాలి." అంటూ ప్రారంభించాడు మార్క్. "మీరందరూ యెరుగుదురు కొన్నివారాలక్రితం జర్మన్ సేనాముఖాన్ని కొంచెం వెనకకు నెట్టేవరకు పరిస్థితులేలా మారిపోయాయో. కొన్నిరోజులు గడచిన అనంతరం, జారిన కాలును తీసుకొని, చేజారినప్రాంతాన్ని తిరిగి చేపట్టారువారు. అప్పుడు నేనూ, ప్రొవొస్కీవాళ్ళతో పాటు తిరిగి స్వాధీనం చేసుకోబడ్డ ప్రాంతంలోకి వెళ్ళాం.

ఎన్నో గ్రామాలు మసి అయిపోయాయి. అలా మసికాకుండా వున్నప్రాంతాల్లో రైతుజనంతాలూకు శవాలు చెట్ల

కొమ్మలకు, టెలిగ్రాఫ్ స్తంభాలకు వ్రేలాడుతూ వున్నాయి. ఇదంతా యెవరుచేశారు? జర్మన్‌లు కారు, మనవాళ్ళే—స్టాలిన్ తొత్తులు, జి. పి. యు గూఢచారిదళంవారు. ఐతే, దీన్నంతనూ యెందుకుచేసినట్లు? ఎందుకా? ఇక్కడప్రజలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అంగలార్చారు. నడుంబిగించి, కలిసికట్టుగా, పనిచేశారు; భూములను తమలో తాము పంచుకున్నారు. దుకాణాలను, అంగళ్ళను తెరచి పౌరజీవితానికి అవకాశం కల్పించారు.

"ఇప్పుడు మీ అందరికీ బాగా అర్థమయిందా? జర్మనీయే కనక యుద్ధంలోవోడిపోతే, స్టాలిన్‌ను యెదిరించిన వారినందరిని స్టాలిన్‌వర్గం, రాజద్రోహులుగా పరిగణించి, దయాదాక్షిణ్యాల ప్రసక్తి లేకుండా తుడిచి వేస్తారని?"

"అర్థ మయింది" అని ముక్తకంఠంతో ఉచ్చైస్స్వరంతో జవాబిచ్చారు అక్కడచేరినవారంతా.

"అది అలావుంచండి" అంటూ తన వుపన్యాసాన్ని సాగించాడు, మార్క్. ఈప్రాంతానికి ఆధిపత్యం వహిస్తున్న జర్మన్ జనరల్‌కు కూడా హిట్లరన్నా, అతని జాతివిద్వేషమన్నా యెంతమాత్రం కిట్టదు—కాని, బహు ఉదారస్వభావుడు; మాంచి మర్యాద తెలిసినవాడు; విశాలహృదయుడు. అతడుచెప్పాడు: జర్మనీవారు యుద్ధానికి దిగడంలోగల ఆంతర్యం, రష్యాప్రజలను కమ్యూనిస్టుబారినుండి తప్పించడమని; రష్యానుపాలించే యుద్దేశ్యం జర్మనులకు లేనేలే దన్నాడు. ఈప్రాంతంలో మనరక్షణ యేర్పాట్లను మనం చేసుకొన

జానికి ఆయన సమ్మతించాడు. యూనిఫారములను, ఆయు ధాలను యిస్తానన్నాడు. మనలో మనం పౌరరక్షణావకాశాల కై కాకుండా, మాస్కో వరకూ తమతో పాటు యుద్ధం చెయ్యడానికి అనుమతిస్తా మన్నాడు. మనల్ని పూర్తిగా విశ్వసిస్తా నన్నాడు.

"ఏమో—అదెంతవరకు నిజమో. అతడు తనస్వంత బాధ్యతమీదనే మాట్లాడుతున్నాడో, జర్మనీపక్షాన్నే మాట్లాడుతున్నాడో యెలా తెలుస్తుంది ? ఒకవేళ జర్మనీ ఓడిపోవడమె ప్రారంభమైతే తనమనసు మార్చుకొని, మనలనందరినీ వరసగా కాల్చేయ్యమంటాడేమో. లేక, అతని స్థానే క్రొత్తగా మరొక జనరల్ యెందుకు రాకూడదు? అతని భావాలూ, వైఖరీకూడా యిలాగే వుంటాయనే నమ్మకం యెక్కడుంది? ఇప్పుడు మీ అందరికీ అర్థమైంది అనుకుంటాను. యేక్షణంలో యేమి జరిగినా జరగవచ్చునని. అప్పుడు జర్మనులు మనలను తమస్వార్థాని కుపయోగించుకు తీరతారు. ఎదురుతిరిగి స్టాలిన్ కాలరాసినట్లే రాసేస్తారు."

"ఔను!"

"ఒకవేళ మనం సర్వంపోగొట్టుకొని నిహతులమే అయాం అనుకోండి. అప్పుడు మనదేశీయులకు మనమొక గొప్పసేవ చేసినవారం ఔతాం. కమ్యూనిజం అంటె రష్యా కాదనీ, కమ్యూనిజానికి ప్రబలశత్రువులు రష్యన్ ప్రజాసామాన్యమే ననీ లోకానికి మొట్టమొదట చాటింది మనమె ననీ వారు గ్రహిస్తారు."

"కావచ్చు; కాని, యిప్పుడా ప్రస్తావన యెందుకు ?"

మార్క్ నిటార్గా నిల్చుని, తలయెత్తాడు. ఇప్పుడతని విస్ఫారితనయనాలు తేజోవంతంగా ప్రకాశిస్తున్నాయి. ఇప్పటికతని మనస్సులో నున్నదాన్ని విప్పి చెప్పడానికి అవకాశం అయాచితంగా వచ్చి పాదాలమీద పడింది. తానీ నాడు చేస్తున్న సేవంతా దేనికోసమో. తన భుజాలమీద యింత వరకూ వున్న బరువేదో దిగిపోయినట్లు అనిపించింది అతనికి. ఆత్మ విశ్వాసంతో ఆనందాతిశయంతో ఒక్క కేకపెట్టాడు.

"తెలిస్తే, యికమనం కార్యోన్ముఖుల మౌదాం. మన వర్గాన్ని విస్తృతిపరచుకుంటూ వెడదాం. మనవలెనే మన ప్రజలకోసం, ప్రజలస్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం యుద్ధం చెయ్యదలచినవారి నందరిని మనలో చేర్చుకుందాం."

ఏనాడైనా జనరల్ తన అభిప్రాయాన్ని మార్చుకోవచ్చు; లేదా, అతని మతిని మార్చవచ్చు. అదొక జూదం వంటిది. ఎంతోమందిని చేర్చుకోవాలి; సాధుల్ని చెయ్యాలి; శిక్షణ నివ్వాలి. వ్యవస్థను పెద్దదాన్ని చేసి, పటిష్ఠవంతం అయ్యేటట్టు చూడాలి. క్షణక్షణమూ వినియోగపడాలి; అమూల్యమైన కాలం వృథాపోవడానికి వీల్లేదు. మార్క్ ప్రచారం ప్రారంభించాడు. ఒకపట్టణాన్నుండి మరొకపట్టణానికీ, ఒకగ్రామాన్నుండి మరొకగ్రామానికీ సంచారం చేస్తూ తనభావాలను వివరిస్తూ సూచనలుచేస్తూ వుండేవాడు. నిరంతరం మథనపడుతూ వుండేవాడు. సైన్యానికి ఒక ఆకారం యేర్పడింది. పటాలాలు, వర్గాలు, దళాలు, ఉద్యోగులు రవానాయేర్పాట్లు, ప్రధానసైనిక కార్యాలయం యేర్ప

డ్డాయి. ప్రధాన కార్యాలయం అడవి మధ్యగా జర్మన్‌లు చొచ్చుకురావడానికి సాహసించనిచోట యేర్పాటు చెయ్య బడింది.

సైనికబలం ఒకవంక సమీకరించబడుతూంటే వేరొక వంక పౌరపరిపాలనకు కూడా యేర్పాట్లు చురుకుగా సాగు తూ వచ్చాయి. స్వతంత్ర ప్రభుత్వం, పరిపాలనావర్గాలు, కూటాలు యేర్పాటైనాయి. స్వతంత్ర రష్యన్ వార్తాపత్రికలు కూడా వెలువడుతూవచ్చాయి.

ఐతే, యిదంతా మున్నాళ్ళ ముచ్చటేనేమో. ఈసువర్ణావ కాశం యెన్నాళ్ళుంటుంది? ఆట్టేకాలం వుండదనే హెచ్చరిక ఒక జర్మన్ ద్వారా రానే వచ్చింది. ఈయనపేరు కెప్టెన్ బెర్గర్ — బొరోవిచి ప్రాంతీయాధికారి చేతిక్రింద పనిచేస్తున్న ఉన్నతోద్యోగి, కెప్టెన్ బెర్గర్‌కు రష్యన్ భాష బాగా తెలుసు.

"క్లిష్టకాలం రాబోతోంది" అన్నాడు ఒకనాడు మార్క్ తో బెర్గర్. ఆక్రమితప్రదేశంలో రాజకీయాధికారాలను చలా యించే అధికారి వేరే వొస్తున్నాడు. ముందు ముందు సైన్యాని కేమీ సంబంధంవుండదు, ప్రజాపరిపాలనా వ్యవహా రాలతో. ఆ రోజులు రాబోతున్నాయంటేనే నాకు భయం వేస్తోంది, మిస్టర్ సురోవ్. ఎందుకంటే, మాజర్మనీ లక్ష్యా లేమిటో, మా ఫ్యూహరర్ లక్ష్యాలేమిటో నాకు బాగా తెలుసు."

బెర్గర్ అపరిచితుడైన ఒకవ్యక్తితో యింతగా మనస్సు విప్పి యెందుకు చెప్పివుంటాడా అన్న దూరాలోచన పోయినా,

అతని నిష్కాపట్యాన్ని మాత్రమె తీసుకుని మార్క్ చాలా సంతోషించాడు. కాని, అతనికివార్తలు అందుతూనే వున్నాయి, యింకా పశ్చిమంగా జర్మనీవారు పౌరపరిపాలనా విధానాన్ని యేర్పాటుచేసి, రష్యన్ ప్రజానీకాన్ని విపరీతంగా బాధిస్తున్నారని. ఈవార్త అందినప్పటినుండీ మార్క్, అతని అనుచరులూ అధికతర వేగంతో రష్యన్ యేర్పాట్లు చేస్తున్నారు, ఒకవిధంగా జర్మనులకు లొంగిపోకుండా వుండే స్థాయిలో.

పరిస్థితులు ప్రచండ వేగంతో పరుగిడుతున్నాయి. జర్మన్ వెనక భాగాన్ని తయారౌతున్న యీరష్యన్ బలం మీద నె జర్మన్ రహస్యపోలీసు శాఖవారు అప్పుడేఒక కన్ను వేసి వుంచారు. ఈ రహస్యపోలీసులు ధరించేటోపీలమీద,కోటుగుండీల మీద మృత్యుముఖాలు చెక్కబడియున్నాయి.

ఒకనాటి రాత్రి యీవ్యవస్థ గ్రహించాడు, ముహూర్తం సమీపించిందని. రష్యనులు తమ రహదారిని తామే నిర్మించుకున్నారు. అశేష కష్టాలకు గురిఅయి ఆరాత్రి యేదో ఫెళఫెళమంటూ, పదేపదే, ధ్వని వినపడుతూ వచ్చింది. మార్క్, కొలోవ్ లకు మొదట్లో అదేమిటో బోధపడలేదు వారికి. మార్క్ గవాక్షం దగ్గరకు వెళ్ళి తెరగుడ్డగా వాడుతున్న జంపుఖానాను వొత్తిగించి చూశాడు. తెరవొత్తిగిలిన వెంటనే గది అంతా రక్తారుణకాంతి పుంజమైంది. ఆకాంతిలో మార్క్ ముఖంమీద నీడలువారుతున్నాయి, ఆశ్చర్యమూ కళవళ పాటూ అతని కళ్ళల్లో ప్రతిబింబిస్తున్నాయి.

యుద్ధఖైదీల శిబిరం వైపునుండి కానవస్తున్న అగ్నిశిఖ లా కాశన్నంటుతున్నాయి. ఫెళఫెళార్భటులతో వినవచ్చే ధ్వనులు కూడా ఆవైపు నుండే వస్తున్నాయి.

'వాళ్ళు రష్యన్ ఖైదీలను తుపాకులతో కాల్చి చంపేస్తున్నారు.' అన్నాడు కాటోవ్, గద్గద స్వరంతో. మార్కాసరసను నిలబడి. మార్కా వెనకకు అడుగువేసి 'మనజనాన్ని సిద్ధంచెయ్యి,' అన్నాడు.

తానే శిబిరంలో యుద్ధఖైదీగా బంధింపబడి ఆ శిబిర రక్షకులచేతనే అదృష్టవశాత్తు, అనుకోకుండానే, స్వేచ్ఛను పొందాడో ఆశిబిరంలోనున్న నాలుగువేల రష్యను ఖైదీలు యిప్పుడు చిత్రవధ చెయ్యబడ్డారు.

చిత్రవధా క్రమమంతా చాలా తేలికగా నిర్వహింపబడింది. మొదట కాపలావారు బ్రహ్మాండమైన శిబిర భవనాలకు అగ్నిసంస్కారం చేశారు. దాంతో లోపలనున్న రష్యన్ ఖైదీలందరూ భయభ్రాంతులై బిలబిలలాడుతూ ప్రవాహం క్రింద ఆవరణలోకి వచ్చేశారు. అప్పటి కప్పుడే పహరా బురుజుల మీద మరఫిరంగులను గురిపెట్టి కూర్చున్న కావలివారు యెడతెరపలేకుండా నిప్పుల వర్షం కురిపించారు, ఖైదీల మీద కాలిస్తే అంతర్జాతీయ న్యాయసూత్రాల నుల్లంఘించడ మవుతుందేమో నని యెవరూ పారిపోకుండా వుండడానికి ముళ్ళ తీగమీదకు గురిపెట్టి కాల్చారు. అలా చెయ్యడానికి అంతర్జాతీయ న్యాయసూత్రం అడ్డురాదు. ఆశిరంలో మొత్తం ఎనిమిదివేల మందివరకూ ఖైదీలుగా వున్నారు. కాని, ఆవర

ణాలో నాలుగువేలమంది కన్న యెక్కువపట్టరు. ఇక మిగతా వాళ్ళెక్కడికి పోతారు?

ముళ్ళతీగె పొడుగునా మానవకంకాళాలతో గోడకట్టినట్టని పించింది. ఈగోడముళ్ళతీగె యెంత యెత్తువరకూ వుందో అంతవరకూ పెరిగివున్నందున చావగా మిగిలినవారు ఆగోడ మీదనుండి ఆవలివైపునకు దాటిపోదా మనుకున్నారు. కొందరు కృతకృత్యులయ్యారన్నమాటే కాని, ఆవలివైపునయిలా తప్పించుకు వచ్చేవారి కోసం సిద్ధంగా వున్న జర్మన్ గస్తీ శిపాయిల మరఫిరంగులు వారిని పొట్టను పెట్టుకున్నాయి. వారినికూడా తప్పించుకుని పోయినవారిని గ్రామ వీధుల్లో కుక్కల్ని కాల్చి చంపినట్లు చంపారు.

అయితే, ఆ రాత్రి పట్టణవీధులలో గస్తీ తిరుగుతున్నది జర్మన్ సైనికులొక్కరె కాదు. కొటోవ్ స్వతంత్ర రష్యన్ శిపాయిలు కూడా కదలికగానే తిరుగుతున్నారు. వారు నిర్వహించవలసిన విధులలో పట్టణంలో శాంతి భద్రతలనుకాపాడటం ఒకటి. జర్మన్ గస్తీ దళాలకు తెలుసు ' తెల్ల పట్టీలను చేతులకు కట్టుకుని తిరుగుతున్న రష్యనులు స్థానిక పోలీసులనీ, వారిమీద యిప్పుడప్పుడే చెయి చేసుకోడానికి వీలు లేదని. కాని, ఆరాత్రి, యేకంగా, అంతమంది పోలీసులు వీధుల్లో తిరగడానికి కారణం యేమైవుంటుంది? శిబిరంలోంచి పారిపోయి, గస్తీదళాల కన్నుగప్పి బయటపడ్డ ఖైదీలకు వెంటనే తెల్లపట్టాలనిచ్చి తమలో కలిపేసుకుంటూ వచ్చారు కాటోవ్ బృందం. ఆ విధంగా పైకి కనపడని ఘర్షణ ఒకటి

యూ ఖైదీల ప్రాణరక్షణ కోసం ప్రారంభమైంది. తప్పించుకు వచ్చిన వారిలో చాలమంది! చీకటి మాటున, అప్పటి కప్పుకు' నది కావలియొడ్డుకు చేర్చి వెయ్య బడ్డారు. ఆవిధంగా కొన్నివందలమంది ప్రాణాలు రక్షించబడమె కాక కొటోవ్ బలం పెరిగిందికూడ.

ఇంతవరకు పరిస్థితులు మళ్ళీముఖం పట్టాయి. ఇక జరగ వలసింది జర్మనులమీద యుద్ధమె. జర్మనులు సాయంచేయ డంవల్ల బయట పడ్డవారే యీయుద్ధానికి తోడ్పడు తున్నారు. ఇప్పటి నుండి మార్క్, అతని తోటినాయకులు, అజ్ఞాతవాసం లోకిపోయి, గూఢచారులు, పంచమాంగ దళం వారు ద్రో హులు తమలో యేర్పడమంటా, మారువేషాలతో కనిపె డుతూ వుండడానికి నిశ్చయించారు.

ఈ విధంగా మరొక సంవత్సరం దొర్లిపోయింది. దానితోటే నిర్గమించాయి హిట్లరుఅలవాటుపడ్డ విజయపరంపరలు. అంత కంతకు బాహాటంగా జర్మన్‌బలాలు వెనకంజవేస్తూ వచ్చా యి.వారివార్తాప్రకటనలలో'యుద్ధరంగం పరిమితంచేస్తున్నాం' అని ఉదహరించేవారు. కాని,వాస్తవానికి యిది తిరోగమనమే అనిప్రతివారికీ అర్థమైపోయింది. ఎప్పటికైనా తమఅదృష్టం కలసిరాకపోతుందాఅని జర్మనులు ఆశిస్తూ వుండేవారు. అలా ఆశాహృదయాలతో, యుద్ధంచేస్తూ వుండండని వారి నియంత ఆజ్ఞ. ప్రపంచాన్నంతెనూ పాదాక్రాంతంచేసే కొత్త ఆయుధా న్నొకదాన్ని వారిచేతికందిస్తానని ఊరిస్తూవుండేవాడు హిట్లరు. కాని, యుద్ధభూమిలో నున్నవారికి నమ్మకం జారి

పోయింది. వెనకనున్నవారు మాత్రం దాన్నింకా పట్టుకుని ఊగుతున్నారు.

తూర్పు యుద్ధరంగానికి వెనక భాగంలో జర్మన్ సైనికాధికారులు రకరకాల యూనిఫారములతో, బిరుదులతో ప్రత్యక్షమౌతూ వుండేవారు. వారంతా ఆక్రమిత రష్యాను పాలించడానికి దిగుమతీ చెయ్యబడ్డవారు. వారికి, హెర్ ఆల్‌ఫ్రెడ్ రోసెన్‌బర్గ్ అనే(ప్రాచ్యప్రాంతీయ శాఖామంత్రి) ఆధిపత్యం వహించాడు. ఈయనకు ఉన్నతపదవినిచ్చి రష్యాలో చమవు చెప్పించియీపనికి తయారుచేశారు. కాని, యీయనకు రష్యాకు సంబంధించిన దేదన్నా చిరాకే. ఆ చిరాకుకు మితి అనేది లేదు.

రొసెన్‌బర్గను రష్యన్ పాలకుడుగా నియమించాడు హిట్లర్. ఆయన ఆజ్ఞానుసారం రష్యనులు నిలువుదోపిడీ చెయ్యబడుతూ వచ్చారు. ధాన్యాలు, పశువులు—ఒక టేమిటి కంటికి కనపడిన ప్రతిరష్యన్ సంపదను జర్మన్‌వారు చేజిక్కించుకున్నారు. జర్మన్ ఉద్యోగులు గ్రామాలమీదపడి వారిచేతికి ఏదిదొరికితే దాన్ని సంగ్రహిస్తూ వచ్చారు. రైళ్ళకొద్దీ ఆహారసామగ్రిని, అమూల్యసంపదలనూ జర్మనీకి తరలించారు. కొన్నిరైళ్ళు రష్యనులను బానిసచాకిరీకి తరలించాయి.

ఎప్పటికైనా మనకు జర్మనీవాళ్ళ చేతుల్లో విమోచనమనేది లభిస్తుందా అని ఆశ్చర్యపోయేవారు.సర్వస్వం కమ్యూనిస్టులు కైవసం చేసుకోవడానికి బదులు జర్మనులు చేస్తున్నారు. తమకు తిండికివుండాలనీ, కాబట్టి పంటను స్వాధీనము

చెయ్యలేమనీ రష్యన్ గ్రామీణులు ప్రతిఘటిస్తే వారిని జర్మనులు కాల్చి చంపి, గృహాలను దగ్ధంచేశారు. జర్మనీలో కూలిపని చేయడానికి రష్యనులను సప్లై చెయ్యాలని జారీచేయబడిన జర్మను ఉత్తరువులను పట్టణాలు ఉల్లంఘించినప్పుడు అంగళ్ళమీదకు, నివాసగృహాలమీదకు దాడిచేసి అక్కడ దొరికినవారిని పశువుల నెక్కించినట్లు రైళ్ళలో ఎక్కించి, తూర్పున వున్న సైబీరియాకు కాకుండా పశ్చిమంగా జర్మనుకు తోలేసేవారు. ఐతే, యీ రెంటికీ భేదం యేమిలేదు.

జర్మన్ శ్రేణుల వెనకభాగాన పెద్దపెట్టున గందరగోళం, మారణహోమం ప్రారంభమైనాయి. అమూల్యమైన సైనిక సామగ్రితో నింపబడ్డ జర్మన్ రైళ్ళు రైలుకట్టలావల నుండి దొర్లిపోయేవి. ఎడాల్ఫ్‌హిట్లర్ తాలూకు ఉద్యోగులు, సైనికులు రైలుప్రమాదాల్లో హతులౌతూ వచ్చారు. రష్యావారిగడ్డమీద యెక్కడా జర్మనులకు సురక్షితమైన స్థానం కనుపించలేదు. జర్మన్ ఆక్రమిత కార్యాలయాలలో వెనకటి 'ఓల్డిమేనర్'కు సంబంధించిన చిత్రాతిచిత్రమైనకథలు వినిపించబడేవి. ఇప్పుడు కరెడ్జికోట్జిఅనే నూతనసంస్థను గురించి మాట్లాడుకుంటున్నారు.

'నల్లపిల్లి' దాని ఆనవాళ్ళు యెక్కడచూస్తే అక్కడే కనపడేవి. రాత్రిళ్ళు అది జర్మన్ స్థావరాలపై దాడి చేసేది; జర్మన్ సైనికులను చంపేది. తనశక్తినీ, ఆగ్రహాన్ని ప్రదర్శించిన తరువాత యీక్రింది హెచ్చరిక చేస్తూండేది.

'నల్లపిల్లి' ప్రజారక్షణకు పూనుకుంది. చంపబడ్డ ప్రతి రష్యనుకూ, ఒక జర్మన్ తనప్రాణాల నివ్వవలసి వుంటుంది."

ఈ నల్లపిల్లి వ్యవస్థకు చెందిన నాయకులలో ఒకడు మార్క్ సురోవ్.

'ఇప్పుడు శత్రువు గుండెలమీద దెబ్బతీసే అవకాశం ప్రాప్తమైంది' అన్నాడు మార్క్. 'అప్పుడు బహుశః జర్మనులు గ్రహిస్తారు రష్యావారి గడ్డపైనే రష్యావారిని ఆటవికులు వేటాడినట్లు వేటాడితే మాట దక్కదని'. మార్క్ మౌనంగా కూర్చున్నాడు. మిగతావారు కూడా దీర్ఘాలోచనలో మౌనం వహించి కూర్చున్నారు. అందులో ఒక డసి గాడు. 'బిషో మాశైనిటుని. మార్క్ తలపంకించాడు. "విశేష శక్తి సామర్థ్యాలుగల ప్రాచ్య ప్రాంతీయ జర్మన్ కమిసార్ భిడోను తుడిచిపెట్టేస్తే అప్పుడు జర్మనులు తమ పద్ధతులను మార్చుకుంటారు. తమ పరిరక్షకుడైన అధికారికే దిక్కులేనప్పుడు, మనమంతా అత్యంత ప్రమాద భరితమైన పరిస్థితుల్లో పడ్డామని ఉన్నవారు గ్రహిస్తారు."

ఈ సమావేశానంతరం నల్లపిల్లి సంస్థ అనేక భంగపాట్లకు లోనైంది. జర్మనుల సహాయంతో మాస్కో కమిసారు యీ సంస్థను నిర్మూలించడానికి విపుల సన్నాహాలను చేశారు. ఐతే అలాచేసేముందు మార్క్ సురోవ్‌తోటి, తదితర నాయకులతోటి మంతనాలు జరిపారు. వారి అపరాధములను మాస్కో క్షమిస్తుందని, కమ్యూనిస్టు పితృభూమికి సవ్యంగా తిరిగివస్తే, వారివారి ప్రత్యేక సేవలకు బహుమానాలు యివ్వబడతాయనీ యెరచూపించారు. కాని, అంతా నిష్ఫలమైంది. తమ కడపటి రహస్య సమావేశంలో సోవియట్ ప్రతినిధులతో మార్క్ యీవిధంగా స్పష్టం చేశాడు.

'ఈనాడున్నంత ఆహ్లాదంగా, సుఖంగా మన మిదివరకెన్నడూ లేము. అటు హిట్లరూ, యిటు స్టాలిన్ – ఇద్దరూ శత్రువులె; యిద్దరిని మనం హతమార్చాలి. మీ బలాలను మీరు సమకూర్చుకుంటూంటే మేమెట్టి అవరోధాలను కల్పించం. కాని, నల్లపిల్లి స్టాలిన్ చేతిలో కీలుబొమ్మ మెంత మాత్రం కాబోదు. మన దేశం సువిశాలమైన దేశం; కాబట్టి, ఒకరి ప్రమేయం ఒకరికి లేకండా, భిన్న మార్గాలలో యధేచ్ఛగా సంచరించవచ్చు, ఈక్షణంలో మీరూ మేమూ కూడా జర్మన్‌లతో యుద్ధం చేస్తాం. కాని, రేపటిరోజున మీతోటే యుద్ధం చేయవలసి ఉంటుంది.

నల్లపిల్లి వ్యవస్థలను వశపరచుకొనడం సాధ్యం కావడం లేదని సోవియట్ ప్రతినిధులు తెలియచెయ్యగానే మాస్కో సమాధాన మిచ్చింది.

"ఐతే, మీ శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించి దాన్ని నాశనం చెయ్యండి." ఆ సంస్థ కూడా ఉమ్మడిశత్రువులను ఓడించడానికే కృషిచేస్తున్నప్పటికీ, దానిభేదం స్టాలిన్ కేమాత్రం కనిపించలేదు. దీనిపర్యవసానంగా నల్లపిల్లి రెండువైపులా యుద్ధం చెయ్యవలసివచ్చింది. స్టాలిన్ గూఢచారులూ, ఏజంట్లూ ఒక ప్రక్క, హిట్లరు గూఢచారులూ, యేజంట్లూ వేరొకప్రక్క. అయినా, జంకుకొంకులులేక ఆసంస్థ తనకృషిని అనుకున్నప్రకారం సాగిస్తూనేవుంది. ఇప్పుడది 'బిడో'ను హత్యచెయ్యడానికే నిశ్చయించింది.

నల్లపిల్లి నాయకులలో మార్క్సుకు సన్నిహితులైన వారిలో గ్రోబిన్ అనే నాయకుడు, జర్మన్ కమీసార్ అయిన భిడో

యింట్లోకి పరిచారిక ఒకర్తె కావలసివచ్చిందని యెలాగో తెలుసుకున్నాడు. ఆసంగతి మేరియాకూ తెలిసింది. మార్క్ లేనప్పుడు, మేరియా, డ్రోబిన్‌ను బలవంతపెట్టింది, తన నెలాగైనా ఆపనికి వప్పగించేటట్టు మార్క్‌ను వొప్పించుమని. ఈ సంగతంతా మార్క్ దృష్టిలోకెవచ్చేటప్పటికే మేరియా నిశ్చయానికి వచ్చేసింది. పరిస్థితులు చెయిదాటిపోయినాయి. ఓల్గాప్రఖిణా అనిపేరు మార్చుకున్న మేరియా పరిచారిక అన్వేషణకై భిడాచె నియోగింపబడ్డ ఉద్యోగిని కలుసుకుని నప్పగించింది. తనకెవరూ ప్రియులుకాని, సంసారంకాని, మరే యితర యిబ్బందులుకాని లేవనీ, రాజకీయాలతో తన కేప్రసక్తీ లేదనీ, విన్నవించుకుంది. అతడెటువంటి వ్యక్తికై అన్వేషిస్తున్నాడో, సరిగ్గా అవేయోగ్యతలుగల వ్యక్తి తాననీ, తనవినయవిధేయతలతో మెప్పించగలననీ ప్రాధేయపడింది. ఆ ఉద్యోగి ఒల్గాప్రఖిణాను పనిలో నియోగించడానికి అంగీకరించాడు, ఆ మెప్రయాణం ప్రారంభమైనదంటె, యిక ఆగడంకాని, వెనకముఖంపట్టడంకాని వుండదు. తనభద్రతకు ప్రమాదం వొస్తున్నట్టు యేమాత్రంపసిగట్టినా అక్కడ వుండ వద్దని మార్క్ గట్టిగా హెచ్చరించాడు.

"ఫ్రా ఓల్గా" కు కేటాయింపబడినగది క్రిందిఅంతస్థులో హాలుకు ఒకవైపున ఉంది. ఆగదిలోనికి వెళ్ళడానికీ, రావడానికీ, ద్వారం ఒక్కటె హాలులోకి వుంది. వెనకగోడకు కిటికీలు పెరటిలోనికి తెరచుకునివున్నాయి. ఆ పెరటిలో సాయుధభటులు రాత్రింబగళ్ళు కాపలాకాస్తున్నారు. హాలులో ఒక చివర కమిసార్ ప్రత్యేకఅంగరక్షకులువుండే పెద్దగది

వుంది. దానిప్రక్కనే వున్న మరొక గదిలో రెండు పెద్దకుక్కలున్నాయి. వాటిలో ఒకటి తెల్లది, రెండవది గౌరవర్ణం కలది. ప్రాబ్లా ప్రతిరోజు నిర్వహించవలసిన విధులలోఒకటి యీ కుక్కలను రోజూమూడుసార్లు బయటకుషికారు తీసుకు వెళ్ళడం; రెండవది, రాత్రిళ్ళు పడుకోబోయేముందు కుక్కలున్న గదికీ, హాలుకూ మధ్యనున్న ద్వారాన్ని తెరచి వుంచడం.

మొడ తెరపి లేకుండా వాగుతూ వేవుండే మనిషి ప్రాభిడో చెప్పింది మేరియాతో — రాత్రిళ్ళుకుక్కలున్న గదితలుపు నెందుకు తీసిఉంచుతారో. ఆమెభర్త అయిన జస్టిన్‌కమిసార్ నిద్రిస్తున్నప్పుడు ఆయనకేప్రమాదమూరాకుండా యీకుక్కలు కాపలా కాస్తూంటాయట. ఇంట్లోపహారా మారినపుడల్లా యీకుక్కలుకూడా పహరా మార్చుకుంటూ వుంటాయి.

రాత్రింబగళ్ళు ఆభవనంలో జరిగె యీ యేర్పాట్లు ఒక కాగితంమీద దగ్గరదగ్గరగావ్రాసి, అంతకుపూర్వం రహస్యంగా చేసుకున్నయేర్పాటు ప్రకారం, భవనానికి సమీపంలో వున్నపార్కులో ఒకబెంచిక్రింద మేరియా పడేసింది. ఆవివరాల సహాయంతో మార్క్ బ్రహ్మాండమైన యుక్తినొకదాన్ని ఆలోచించాడు..

వారాలకొద్దీ రాత్రింబగళ్ళు, చకచకాపని సాగిపోతోంది. పథకంవివరాలు పూర్తిగా రూపొందించబడ్డాయి. ఇందుకు కావలసిన సామగ్రి, పరికరాలు మొదలైనవన్నీ స్వయంగా తయారు చేసికాని, సేకరించికాని మేరియాగదికి వెనకవైపున నున్నగవాక్షం ద్వారం లోపలికిచేర్చబడ్డాయి. ఆమె వాటిని యేమిచెయ్యాలో సవివరంగా తెలుసుకుంది.

చివరకు తాననుకున్న రాత్రిపడింది. తనగడియారం వైపు చూసింది మేరియా. పన్నెండుగంటలపదిహేను నిమిషాలైంది. కుర్చీలోంచి లేచింది. సిద్ధంగావుంచిన సామగ్రిని చేతపట్టుకుంది. మృదువైన తెల్లటి చర్మంతో తెల్లకుక్క గుండెలకు, వీపునకు సరిగ్గా సరిపడేటట్టు పటకాఒకటి తయారుచెయ్యబడింది. ఆ పటకాలో యిమిడేటట్టు ఒక తెల్లటిపెట్టె; ఆపెట్టెలోకి సరిగ్గా నప్పే ఒకపొడుగాటి లోహపువస్తువు. ఆవస్తువుమీదనున్న సున్నితమైన సూచిక 2 అంకెనుసమీపించేటప్పటికి పెట్టెపేలేటట్టు యేర్పాటు చెయ్యబడింది.

పన్నెండు-ఇరవై. మేరియా త్వరితంగా ద్వారం వైపు వెళ్ళింది. శబ్దం కాకుండా ద్వారం తెరచుకుంది. నిర్మానుష్యంగాను, మసకచీకటిగాను ఉన్న హాలును పైకి క్రిందికీ ఒకసారి పరికించింది. తోలుపటకాలు, పెట్టె చేతబట్టుకుని కుక్కలున్న గదిలో చటుక్కున ప్రవేశించింది.

తెల్ల కుక్క ఆమె వైపు ఆశ్చర్యంతో చూసింది. ఇది ఎరకెన్నడూ మేరియా అపద్ధతిలో గదిలో ప్రవేశించలేదు. అయినా మేరియాను బాగా యెరిగివున్నందున యేవిధమైన అభ్యంతరమూ చెప్పక మేరియా చేసిన దానికల్లా తల ఒగ్గింది. మేరియా పటకాను మెడకు దూర్చి పెట్టెను దానికడుపుక్రింద కట్టింది. మేరియా ద్వారంవద్దకు వెడుతూంటె కుక్క పరకాయించింది. తాను వెళ్ళిపోయేముందు ఒక్కసారి వెనుకకు తిరిగి కుక్కకేసి చూసింది. ఆ తెల్ల పటకాలు, తెల్ల పెట్టె కుక్కకన్నా తెల్లజూలులో సరిగా కనిపించడమేలేదు. ఒక్క క్షణం తనకుక్కకు రాబోయే ప్రమాదాన్ని తలచుకుని మేరియా జాలిపడింది. ఆతరవాత హాల్లోకి, అందులోంచి తనగదిలోకి వెళ్ళి పోయింది.

పన్నెండు–ముప్పై. పహారా మారేవేళయింది. దానితో పాటు యెర్రకుక్క స్థానే తెల్లకుక్క కమిసార్‌కు కాపలా కాయడానికి ఆయన పడుకున్నచోట తలాపు దిక్కున హాజరవుతుంది. తలుపు తెరుచుకుని మేరియా మెల్లగా దొడ్డిలో ప్రవేశించింది. అక్కడ గస్తీవాడు పహారా కాయడంకన్న గురక పెట్టి నిద్ర బాగాపోవడం గమనించింది మేరియా. కాపలా వాడు గేటుకు దూరంగా ఉన్న మూడవ రాటకు ఆనుకుని కూర్చుని హాయిగా నిద్రపోతున్నాడు. ధైర్యంగా అతనివైపు నడచింది. అతడేమి కదలలేదు, మాట్లాడలేదు, కేక పెట్టలేదు, మొహం మీద ముహం పెట్టి చూసింది. నల్లగా ఉన్న అతని నాలుక వ్రేలాడుతోంది; అర్ధనిమీలిత నేత్రాలామె వైపు అలాగే తేరిపార చూస్తున్నాయి. ఇదేమిటా అని ఆశ్చర్యంతో నక్షత్రాలకేసి చూసింది మేరియా. కాపలా వాడు చచ్చిపడివున్నాడు. ఊపిరి ఆడనివ్వక అతని ప్రాణాలను తీసిన త్రాటితో అతని శరీరం క్రిందపడకుండా రాటకు కట్టి వెయ్యబడింది. అతని ప్రక్కనే ఒక సొరంగంద్వారా మేరియా దూరడానికి వీలైనంత పెద్దది త్రవ్వబడింది. ఈ సొరంగం ద్వారా మేరియా బైట పడడానికి వీలుగా.

ఇండ్ల నీడలలోంచి, నిశ్శబ్దంగా, వడీ చప్పుడూ కాకుండా, మేరియా ముందుకు పోతోంది. నల్లపిల్లి సంస్థతాలూకు మనుష్యులు నిర్ణీత ప్రదేశాలలో, అనుకున్న ప్రకారం, మేరియా కోసం నిరీక్షిస్తు ఒకరినుండి ఒకరు చొప్పున మేరియాను ఊరు బయటకు దాటించారు. అచ్చట తన ఆఖరి మార్గదర్శకుని సహాయంతో ఒక గయ్యాళు భూమిలో ప్రవేశించింది. పొద

ల్లోంచి దారి చేసుకుంటూ ముందుకు వెళ్ళి వెళ్ళి చిన్న మెట్ట ప్రదేశానికి చేరుకుంది. సుమారు గంటన్నరసేపటి నుండి ఆమె అలా నడుస్తూనే వుంది.

తనవైపు యెవరో వడివడిగా నడచి వస్తున్నారని అడుగుల సవ్వడిని బట్టి ఆమె గ్రహించింది. మార్క్ వస్తున్నాడని ఆమెకు తెలుసు; అతడామెను సమీపించాడు. ఆమె అతనివైపు పరిగెత్తుకు వస్తూంటె మార్క్ ఆమెను ఒక్క తోపు తోసి, గడియారాన్ని కళ్ళకు దగ్గరగా పెట్టి టైము చూస్తున్నాడు. అదొకవిధమైన ఆవేశంతో 'సరిగ్గా రెండయింది" అని ఒక్క వెర్రికేక పెట్టాడు,

అతని వెంటవస్తున్నవారు ఆగిపోయి పట్టణంలోకి పోదామనుకుంటూ తిరిగారు. మార్క్ తనచేతిని క్రిందికి దింపి మేరియా వెనకకు తిరిగి పట్టణం వైపు తేరి చూస్తున్నాడు.

ఒక్క నిముషం గడచింది. రెండునిముషాలు—

"ఏమీ పొరపాటు జరగలేదు, కదా!" అనుకుని కళవళపడ్డాడతడు.

ఆక్షణంలో ఒక తీక్ష్ణమైన విద్యుత్కాంతి పట్టణం మీద నున్న ఆకాశాన్ని ప్రకాశింప చేసింది. కనురెప్ప పాటులో దూరాన యెక్కడో పెద్ద ప్రేలుడు జరిగినట్టు శబ్దమైంది.

'మేరియా, నాప్రియతమా! సాధించావు" అంటూ గిరుక్కున దిరిగి మేరియాను తన కౌగిటలోకి గాఢంగా హత్తుకున్నాడు. సంతోషంతో ఆమెతో అన్నాడు—

"చూశావా? కొట్టాం దెబ్బ శత్రువు గుండెలమీద. ఆ కొట్టింది నువ్వు, మేరియా, నాలక్ష్మివి."

ఆమె ఆనందంతో, పారవశ్యంతో నవ్వులను వొలకబోసి, అతని చెంపమీద మెల్లిగా తట్టింది. తన శరీరాన్ని అతని శరీరానికి గట్టిగా అదిమింది.

కమిస్సార్ భిడో, తెల్లకుక్కా ఛిన్నాభిన్నంకాక పూర్వమె, రక్షణోద్యోగి లెఫ్టినెంట్ పీటర్సన్ గౌరవర్ణం కుక్కను ఫ్రాటిల్లా ఖాళీగదిలోకితీసుకువెళ్ళి, ఆమె కాలిజోళ్ళను, దుస్తులను దానికి వాసనచూపించి ఫ్రాటిల్లా జాడలను తియ్యమని వదిలేశాడు. లెఫ్టినెంట్ ఆగ్రహంతో మండిపడి పోతున్నాడు. భిడోను రక్షించలేకపోయినందుకు యిప్పుడు తన ప్రాణానికే ముప్పు వచ్చేటట్లుగావుంది. ఇంతకూ ఆరమ్యన్ యువతి యీ ప్రేలుడుకు కారణమై యుండాలి. తానెలాగైనా ఆమెను వెతకిపట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమెనే కనక పట్టుకుంటె ..

కొటోవ్ తన జీవితంలో యెన్నో పొరపాట్లుచేశాడు. ఇది ఆఖరు పొరపాటు. "ఇక్కడే కాస్త కునుకుతీద్దాం. ఇక్కడే యెక్కడైనా మాటుగా పగలంతా గడిపి, యెవరకీ కనపడకుండా రేపు రాత్రి కదలుదాం. లేకపోతే, పగలు మనం యెవరి కంటైనా పడవచ్చు" అనుకున్నాడు.

తాము వేసినపథకం జయప్రదమైందన్న సంతోషంతో కైపెక్కిపోయిన మార్క్, డ్రోబిన్ తదితరులూ, యీ సూచనను వెంటనే అంగీకరించారు.

మార్క్ కూడా ఒక్క విషయాన్ని విస్మరించాడు–రెండో కుక్క [illegible] జాడలుతీస్తూ వెంటబడవచ్చునన్న సంగతి.

కొటోవ్ శిబిరానికి వందగజాలదూరంలో పహారావాళ్ళను నియమించాడు. వీరు జర్మన్ సైనికులు తమవైపు చొచ్చుకు వస్తున్నసంగతిని కనిపెట్టి కాల్పులుసాగించినప్పటికీ, కొన్ని నిముషాల్లోనే జర్మన్ సైనికులు వారిపై బడ్డారు. జరుగుతున్న పరిస్థితులను అవగాహనచేసుకునేలోపుగా ఆకుపచ్చని యూనిఫారమ్‌లు చెట్లసందుల్లోంచి కానవస్తున్నాయి. వెంటనే వాళ్ళు రష్యన్ ముఠామీద నిప్పులవర్షం కురిపించేశారు. మరుక్షణంలో నిహతులైనవారు, క్షతగాత్రులూ నేలకొరిగారు.

మేరియా పక్కలో తగిలిన గాయంనుండి ప్రవహిస్తున్న రక్తాన్ని ఒకచేతితో అదిమిపట్టి రెండవచేతితో మార్క్ దగ్గర నుంచి లాగెయ్యడానికి ప్రయత్నించాడు. కాని, మార్క్ కళ్ళల్లోకిచూస్తూ మేరియా అతణ్ణి శక్తికొద్దీ పట్టుకు వ్రేలాడుతోంది. ఆయాసంతో, రుద్ధమైనకంఠంతో నెమ్మదిగా అంది; "మార్క్...ప్రియతమా...నువ్వు...ఒంటరివి..." కడసారి తనముఖాన్నీ శరీరాన్నీ అతనిముఖానికి శరీరానికిహత్తింది. అతడు ఆమెపై వ్రాలగా కన్నీళ్ళుధారాపాతంగా కరుస్తున్నాయి. ఆమెతల వెనకకు పడిపోగానే ఆమెతలను బుగ్గలను కంఠాన్ని చేతులను పదేపదే ముద్దుపెట్టుకున్నాడు మార్క్. "నన్ను క్షమించు;క్షమించు మేరియా" అంటూ గుండె లవిసేటట్టు విలపించాడు. కొటావ్ మరఘిరంగిని చివరివరకూ కాల్చి వాళ్ళ ప్రక్కనుంచి పరుగెడుతూ "నా వెంటరండి, మిత్రులారా!" అన్నాడు. ఆసమయంలో మార్క్ కౌగిటిలోంచి మేరియాను లాగేశాడు డ్రోబిన్. మార్క్‌ను దూరంగా నెట్టేసి డ్రోబిన్ తన పిస్టల్‌ను మేరియాకణతలమీద గురిపెట్టికాల్చాడు. మార్క్

బెదిరిపోయిన జంతువువలె డ్రోబిన్ మీద కురికాడు. కాని, మిగతావారు మార్క్ జబ్బలు పట్టుకొని కొటోవ్ చూపిస్తున్న వైపునకు లాక్కుపోయారు. మేరియా మెల్లగా చచ్చిపోయిందని మార్క్ వాళ్ళతో నడవడానికి అభ్యంతరం చెప్పలేదు-కొంతదూరం తనను యీడ్చుకుపోతున్నా-తోసుకు పోతున్నా అతడు ప్రతిఘటించనూ లేదు.

మరొక నూరుగజాలు. యెంతో వెనకకు వెళ్ళి మళ్ళీ మరఫిరంగిని అమర్చాడు కొటోవ్. ఆ అగ్నివర్షంమాటునుండి డ్రోబిన్ మార్క్ మొదలైనవారు సురక్షితప్రాంతం చేరుకున్నారు. కొంతదూరం వెళ్ళి వెనక్కు తిరిగి చూసేవరకు కొటోవ్ బోర్లాపడిపోయాడు.

చలనం లేకుండా అలాగే వుండిపోయాడు.

ఓడింపబడిన జర్మనులు, రష్యాదేశంనుండి దెబ్బతిన్న జంతువువలె వెళ్ళిపోతుంటే, వారిని వెంబడించారు మిడుతల దండువలె రష్యను కాందిశీకులు. వారికి మళ్ళీ కమ్యూనిస్టు ప్రభుత్వానికి దాసోహమనడం యిష్టంలేకపోయింది. తమ వెనకటి బానిసబ్రతుకులు తలుచుకుంటే ఆకలిదప్పులతోటి అనంత క్లేశాలతోటి బాధపడడమె మంచిదనిపించింది. ఆ కాందిశీకులతో పాటు వెళ్ళదలచుకొన్నవారిలో డ్రోబిన్ కూడా కలిసి, మార్కునూ బలవంతం చేశాడు రమ్మని తాము రైలెక్కవలసిన స్టేషన్లో "డ్రోబిన్ మార్కును "నువ్వుకూడా, రా" అని అడిగాడు. మాతో పాటు నువ్వుకూడా రష్యాకోసం వేరొక చోట పోరాటం సాగించవచ్చు. తరుణంవచ్చినప్పుడు తిరిగి రానూవచ్చు"

మార్క్ నిశ్శబ్దంగా నిలుచునిపోయాడు. ఎలా వెళ్ళగలడతడు? సురోవ్ కొడుకులందరిలోకీ కడసారంవాడు మార్క్. యుద్ధం ప్రారంభమైనతొలిరోజునే ఇవాన్, తన తల్లీ యిరువురూకూడా చంపబడ్డారు; కోర్నీ, తన పాతస్నేహితుడైన జోసెఫ్ అవనాశెంకోను రక్షించబోయి, వీరోచితంగా యుద్ధభూమిలో కూలిపోయాడు; సైమన్ ఒక జర్మన్ సేనానాయకుణ్ణి సపరివారంగా ప్రేల్చేసి తనూ బలిఅయిపోయాడు. ఓల్గా, టాటియానా యేమయ్యారో జాడ లేదు.

ప్రశాంతంగా, తనతలను పంకించి సమాధానమిచ్చాడు. మార్క్, "నువ్వెళ్ళు డ్రోబిన్. ప్రతిచోటకూడా రష్యాకోసం యుద్ధం చెయ్యకతప్పదు; చేసితీరవలసిందే; కాని, మమ్మల్ని-బ్రతికున్నవారిని, చచ్చినవారిని కూడా- జ్ఞాపకం ఉంచుకో. ఎప్పుడో ఒకనాడు మనం మళ్ళీ స్వతంత్రరష్యాలో కలుసుకుంటామని ఆశిద్దాం.

మార్క్ స్టేషన్ నుండి వెళ్ళిపోతోంటే కోరోవిన్ వచ్చి కలుసుకున్నాడు. ఇద్దరు ఒక కొండనెక్కి పరిసరాలను అవలోకించారు. పట్టణశిథిలాలు వెనకకుతిరిగిచూస్తే కనిపిస్తున్నాయి. ఏవైపుచూసినా, తమచుట్టూ, అంతులేని స్వదేశం విస్తరించివుంది. తాను ప్రాణతుల్యంగా భావిస్తున్న స్వదేశపుమట్టిని ఆఘ్రాణిస్తూ, శూన్యంలోకిచూస్తూ అలాగే నిల్చుండిపోయాడు.

"ఏమిటి చూస్తున్నావ్, మార్క్", చివరకు అడిగాడు కోరోవిన్.

"నవోదయాన్ని చూస్తున్నాను. నాకానమ్మకంవుంది, భగవంతుడు మరొక నవోదయాన్ని ప్రసాదిస్తాడని."

ణిలో నాలుగు వేలమంది కన్న యెక్కువపట్టరు. ఇక మిగతా వాళ్ళెక్కడికి పోతారు?

ముళ్ళతీగె పొడుగునా మానవకంకాళాలతో గోడకట్టినట్టని పించింది. ఈగోడముళ్ళతీగె యెంత యెత్తువరకూ వుందో అంతవరకూ పెరిగివున్నందున చావగా మిగిలినవారు ఆగోడ మీదనుండి ఆవలివైపునకు దాటిపోదా మనుకున్నారు. కొందరు కృతకృత్యులయ్యారన్నమాటే కాని, ఆవలివైపునయిలా తప్పించుకు వచ్చేవారి కోసం సిద్ధంగా వున్న జర్మన్ గస్తీ శిపాయిల మరఫిరంగులు వారిని పొట్టను పెట్టుకున్నాయి. వారినికూడా తప్పించుకుని పోయినవారిని గ్రామ వీధుల్లో కుక్కల్ని కాల్చి చంపినట్లు చంపారు.

అయితే, ఆరాత్రి పట్టణవీధులలో గస్తీ తిరుగుతున్నది జర్మన్ సైనికులొక్కరె కాదు. కొటోవ్ స్వతంత్ర రష్యన్ శిపాయిలు కూడా కదలికగానే తిరుగుతున్నారు. వారు నిర్వ హించవలసిన విధులలో పట్టణంలో శాంతి భద్రతలనుకాపాడ టం ఒకటి. జర్మన్ గస్తీ దళాలకు తెలుసు ' తెల్ల పట్టీలను చేతులకు కట్టుకుని తిరుగుతున్న రష్యనులు స్థానిక పోలీసులనీ, వారిమీద యిప్పుడప్పుడే చెయి చేసుకోడానికి వీలు లేదని. కాని, ఆరాత్రి, యేకంగా, అంతమంది పోలీసులు వీధుల్లో తిరగడానికి కారణం యేమైవుంటుంది? శిబిరంలోంచి పారి పోయి, గస్తీదళాల కన్నుగప్పి బయటపడ్డ ఖైదీలకు వెంటనే తెల్లపట్టీలనిచ్చి తమలో కలిపేసుకుంటూ వచ్చారు కొటోవ్ బృందం. ఆ విధంగా పైకి కనపడని ఘర్షణ ఒకటి

యీ ఖైదీల ప్రాణరక్షణ కోసం ప్రారంభమైంది. తప్పించుకు వచ్చిన వారిలో చాలమంది! చీకటి మాటున, అప్పటి కప్పుడు నదికావలియొడ్డుకు చేర్చి వెయ్య బడ్డారు. ఆవిధంగా కొన్నివందలమంది ప్రాణాలు రక్షించబడమె కాక కొటోవ్ బలం పెరిగిందికూడ.

ఇంతవరకు పరిస్థితులు మళ్ళీముఖం పట్టాయి. ఇక జరగ వలసింది జర్మనులమీాద యుద్ధమె. జర్మనులు సాయంచేయ డంవల్ల బయట పడ్డవారే యీయుద్ధానికి తోడ్పడు తున్నారు. ఇప్పటి నుండి మార్క్, అతని తోటినాయకులు, అజ్ఞాతవాసం లోకిపోయి, గూఢచారులు, పంచమాంగ దళం వారు ద్రో హులు తమలో యేర్పడకుండా, మారువేషాలతో కనిపె డుతూ వుండడానికి నిశ్చయించారు.

ఈ విధంగా మరొక సంవత్సరం దొర్లిపోయింది. దానితో టే నిర్గమించాయి హిట్లరుఅలవాటుపడ్డ విజయపరంపరలు. అంత కంతకు బాహాటంగా జర్మన్ బలాలు వెనకంజవేస్తూ వచ్చా యి.వారివార్తాప్రకటనలలో 'యుద్ధరంగం పరిమితంచేస్తున్నాం' అని ఉదహరించేవారు. కాని,వాస్తవానికి యిది తిరోగమనమే అనిప్రతివారికీ అర్థమైపోయింది. ఎప్పటికైనా తమఅదృష్టం కలసిరాకపోతుందాఅని జర్మనులు ఆశిస్తూ వుండేవారు. అలా ఆశావ్యాదయాలతో, యుద్ధంచేస్తూ వుండండని వారి నియంత ఆజ్ఞ.ప్రపంచాన్నంతనూ పాదాక్రాంతంచేసే కొత్త ఆయుధా న్నొకదాన్ని వారిచేతికందిస్తానని ఊరిస్తూవుండేవాడు హిట్లరు. కాని, యుద్ధభూమిలో నున్నవారికి నమ్మకం జారి

పోయింది. వెనకనున్నవారు మాత్రం దాన్నింకా పట్టుకుని ఊగుతున్నారు.

తూర్పు యుద్ధరంగానికి వెనకభాగంలో జర్మన్ సైనికాధికారులు రకరకాల యూనిఫారములతో, బిరుదులతో ప్రత్యక్షమౌతూ వుండేవారు. వారంతా ఆక్రమిత రష్యాను పాలించడానికి దిగుమతీ చెయ్యబడ్డవారు. వారికి, హెర్ ఆల్‌ఫ్రెడ్ రోసెన్‌బర్గ్ అనే(ప్రాచ్య ప్రాంతీయ శాఖామంత్రి) ఆధిపత్యం వహించాడు. ఈయనకు ఉన్నతపదవినిచ్చి రష్యాలో చమవు చెప్పించి యీపనికి తయారుచేశారు. కాని, యీయనకు రష్యాకు సంబంధించిన వేదన్నా చిరాకే. ఆ చిరాకుకు మితి అనేది లేదు.

రోసెన్‌బర్గను రష్యన్ పాలకుడుగా నియమించాడు హిట్లర్. ఆయన ఆజ్ఞానుసారం రష్యనులు నిలువుదోపిడీ చెయ్యబడుతూ వచ్చారు. ధాన్యాలు, పశువులు—ఒక టేమిటి కంటికి కనపడిన ప్రతిరష్యన్ సంపదను జర్మన్‌వారు చేజిక్కించుకున్నారు. జర్మన్ ఉద్యోగులు గ్రామాలమీదపడి వారిచేతికి ఏది దొరికితే దాన్ని సంగ్రహిస్తూ వచ్చారు. రైళ్ళకొద్దీ ఆహార సామగ్రిని, అమూల్యసంపదలనూ జర్మనీకి తరలించారు. కొన్నిరైళ్ళు రష్యనులను బానిసచాకిరీకి తరలించాయి.

ఎప్పటికైనా మనకు జర్మనీవాళ్ళ చేతుల్లో విమోచనమనేది లభిస్తుందా అని ఆశ్చర్యపోయేవారు. సర్వస్వం కమ్యూనిస్టులు కైవసం చేసుకోవడానికి బదులు జర్మనులు చేస్తున్నారు. తమకు తిండికివుండాలనీ, కాబట్టి పంటను స్వాధీనము

చెయ్యలేమనీ రష్యనుగ్రామీణులు ప్రతిఘటిస్తే వారిని జర్మనులు కాల్చి చంపి, గృహాలను దగ్ధంచేశారు. జర్మనీలో కూలిపని చేయడానికి రష్యనులను సప్లై చెయ్యాలని జారీచేయబడిన జర్మను ఉత్తరువులను పట్టణాలు ఉల్లంఘించినప్పుడు అంగళ్ళమీదకు, వినోదగృహాలమీదకు దాడిచేసి అక్కడ దొరికినవారిని పశువులనెక్కించినట్లు రైళ్ళలో యెక్కించి, తూర్పున నున్న సైబీరియాకు కాకుండా పశ్చిమంగా బెర్లినుకు తోలేసేవారు. ఐతే, యీ రెంటికీ భేదం యేమిలేదు.

జర్మన్ శ్రేణుల వెనకభాగాన పెద్దపెట్టున గందరగోళం, మారణహోమం ప్రారంభమైనాయి. అమూల్యమైన సైనిక సామగ్రితో నింపబడ్డ జర్మన్ రైళ్ళు రైలుపట్టాలమీద నుండి దొర్లిపోయేవి. ఎడాల్ఫ్‌హిట్లర్ తాలూకు ఉద్యోగులు, సైనికులు రైలుప్రమాదాల్లో హతులౌతూ వచ్చారు. రష్యా వారిగడ్డమీద యెక్కడా జర్మనులకు సురక్షితమైన స్థానం కనుపించలేదు. జర్మన్ ఆక్రమిత కార్యాలయాలలో వెనకటి 'ఓల్డిమేనర్'కు సంబంధించిన చిత్రాతిచిత్రమైనకథలు వినిపించబడేవి. ఇప్పుడు కరెడ్జికోట్జిఅనే నూతనసంస్థను గురించి మాట్లాడుకుంటున్నారు.

'నల్లపిల్లి' దాని ఆనవాళ్ళు యెక్కడచూస్తే అక్కడే కనపడేవి. రాత్రిళ్ళు అది జర్మన్ స్థావరాలపై దాడి చేసేది; జర్మన్ సైనికులను చంపేది. తనశక్తినీ, ఆగ్రహాన్ని ప్రదర్శించిన తరువాత యీ క్రింది హెచ్చరిక చేస్తూండేది.

'నల్లపిల్లి' ప్రజారక్షణకు పూనుకుంది. చంపబడ్డ ప్రతి రష్యనుకూ, ఒక జర్మన్ తనప్రాణాల నివ్వవలసి వుంటుంది."

ఈ నల్లపిల్లి వ్యవస్థకు చెందిన నాయకులలో ఒకడు మార్క్ సురోవ్.

'ఇప్పుడు శత్రువు గుండెలమీద దెబ్బతీసే అవకాశం ప్రాప్తమైంది' అన్నాడు మార్క్. 'అప్పుడు బహుశః జర్మనులు గ్రహిస్తారు రష్యావారి గడ్డపైనే రష్యావారిని ఆటవికులు వేటాడినట్లు వేటాడితే మాట దక్కదని'. మార్క్ మౌనంగా కూర్చున్నాడు. మిగతావారు కూడా దీర్ఘాలోచనలో మౌనం వహించి కూర్చున్నారు. అందులో ఒక డసిగాడు. 'బిషో మాకెనిటని. మార్క్ తలపంకించాడు. "విశేష శక్తి సామర్థ్యాలుగల ప్రాచ్య ప్రాంతీయ జర్మన్ కమిసార్ భిడోను తుడిచిపెట్టేస్తే అప్పుడు జర్మనులు తమ పద్ధతులను మార్చుకుంటారు. తమ పరిరక్షకుడైన అధికారికే దిక్కులేనప్పుడు, మనమంతా అత్యంత ప్రమాద భరితమైన పరిస్థితుల్లో సన్లామని ఉన్నవారు గ్రహిస్తారు."

ఈ సమావేశానంతరం నల్లపిల్లి సంస్థ అనేక భంగపాట్లకు లోనైంది. జర్మనుల సహాయంతో మాస్కో కమిసారు యీ సంస్థను నిర్మూలించడానికి విపుల సన్నాహాలను చేశారు. ఐతే అలాచేసేముందు మార్క్ సురోవ్‌తోటి, తదితర నాయకులతోటి మంతనాలు జరిపారు. వారి అపరాధములను మాస్కో క్షమిస్తుందని, కమ్యూనిస్టు పితృభూమికి సవ్యంగా తిరిగివస్తే, వారివారి ప్రత్యేక సేవలకు బహుమానాలు యివ్వబడతాయనీ ఎరచూపించారు. కాని, అంతా నిష్ఫలమైంది. తమ కడపటి రహస్య సమావేశంలో సోవియట్ ప్రతినిధులతో మార్క్ యీవిధంగా స్పష్టం చేశాడు.

'ఈనాడున్నంత ఆహ్లాదంగా, సుఖంగా మన మిదివరకెన్నడూ లేము. అటు హిట్లరూ, యిటు స్టాలిన్ – ఇద్దరూ శత్రువులె; యిద్దరిని మనం హతమార్చాలి. మీ బలాలను మీరు సమకూర్చుకుంటూంటే మే మెట్టి అవరోధాలను కల్పించం. కాని, నల్లపిల్లి స్టాలిన్ చేతిలో కీలు బొమ్మ యెంత మాత్రం కాబోదు. మన దేశం సువిశాలమైన దేశం; కాబట్టి, ఒకరి ప్రమేయం ఒకరికి లేకండా, భిన్న మార్గాలలో యథేచ్ఛగా సంచరించ వచ్చు, ఈక్షణంలో మీరూ మేమూ కూడా జర్మన్లతో యుద్ధం చేస్తాం. కాని, రేపటిరోజున మీతోటే యుద్ధం చేయవలసి ఉంటుంది.

నల్లపిల్లి వ్యవస్థలను వశపరచుకోనడం సాధ్యం కావడం లేదని సోవియట్ ప్రతినిధులు తెలియచెయ్యగానే మాస్కో సమాధాన మిచ్చింది.

"ఐతే, మీ శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించి దాన్ని నాశనం చెయ్యండి." ఆ సంస్థకూడా ఉమ్మడిశత్రువులను ఓడించడానికే కృషిచేస్తున్నప్పటికీ, దానిభేదం స్టాలిన్ కేమాత్రం కనిపించలేదు. దీనిపర్యవసానంగా నల్లపిల్లి రెండువైపులా యుద్ధం చెయ్యవలసివచ్చింది. స్టాలిన్ గూఢచారులూ, ఏజంట్లూ ఒక ప్రక్క, హిట్లరు గూఢచారులూ, యేజంట్లూ వేరొకప్రక్క. అయినా, జంకుకొంకులులేక ఆసంస్థ తనకృషిని అనుకున్నప్రకారం సాగిస్తూనేవుంది. ఇప్పుడది 'బిడో'ను హత్యచెయ్యడానికే నిశ్చయించింది.

నల్లపిల్లి నాయకులలో మార్క్సుకు సన్నిహితులైన వారిలో డ్రోబిన్ అనే నాయకుడు, జర్మన్ కమీసార్ అయిన బిడో

యింట్లోకి పరిచారిక ఒక_్తె కావలసివచ్చిందని యెలాగో తెలుసుకున్నాడు. ఆసంగతి మేరియాకూ తెలిసింది. మార్క్ లేనప్పుడు, మేరియా, డ్రోబిన్‌ను బలవంతపెట్టింది, తన నెలాగైనా ఆపనికి వప్పగించేటట్టు మార్క్‌ను వొప్పించుమని. ఈ సంగతంతా మార్క్ దృష్టిలోకివచ్చేటప్పటికే మేరియా నిశ్చయానికి వచ్చేసింది. పరిస్థితులు చెయిదాటిపోయినాయి. ఓల్గాప్రఖినా అని పేరు మార్చుకున్న మేరియా పరిచారిక అన్వేషణకై భిడో౦చె నియోగింపబడ్డ ఉద్యోగిని కలుసుకుని నప్పగించింది. తన కెవరూ ప్రియులుకాని, సంసారంకాని, మరే యితర యిబ్బందులుకాని లేవనీ, రాజకీయాలతో తన కేప్రసక్తీ లేదనీ, విన్నవించుకుంది. అతడెటువంటి వ్యక్తికై అన్వేషిస్తున్నాడో, సరిగ్గా అవేయోగ్యతలుగగ వ్యక్తి తానేననీ, తనవినయవిధేయతలతో మెప్పించగలననీ ప్రాధేయ పడింది. ఆ ఉద్యోగి ఓల్గాప్రఖినాను పనిలో నియోగించడానికి అంగీకరించాడు, ఆమెప్రయాణం ప్రారంభమైనదంటె, యిక ఆగడంకాని, వెనకముఖంపట్టడంకాని వుండదు. తనభద్రతకు ప్రమాదం వొస్తున్నట్టు యేమాత్రంపసిగట్టినా అక్కడ వుండ వద్దని మార్క్ గట్టిగా హెచ్చరించాడు.

"ఫ్రా ఓల్గా" కు కేటాయింపబడినగది క్రిందిఅంతస్థులో హాలుకు ఒకవైపున ఉంది. ఆగదిలోనికి వెళ్ళడానికీ, రావడానికీ, ద్వారం ఒక్కటె హాలులోకి వుంది. వెనకగోడకు కిటికీలు పెరటిలోనికి తెరచుకునివున్నాయి. ఆ పెరటిలో సాయుధ భటులు రాత్రింబగళ్ళు కాపలాకాస్తున్నారు. హాలులో ఒక చివర కమిసార్ ప్రత్యేకఅంగరక్షకులువుండే పెద్దగది

వుంది. దాని ప్రక్కనే వున్న మరొకగదిలో రెండు పెద్దకుక్కలున్నాయి. వాటిలో ఒకటి తెల్లది, రెండవది గౌరవర్ణం కలది. ప్రాబిల్లా ప్రతిరోజు నిర్వహించవలసిన విధులలో ఒకటి యీ కుక్కలను రోజూ మూడుసార్లు బయటకు షికారు తీసుకు వెళ్ళడం; రెండవది, రాత్రిళ్ళు పడుకోబోయేముందు కుక్కలున్న గదికీ, హాలుకూ మధ్యనున్న ద్వారాన్ని తెరచి వుంచడం.

యెడ తెరపి లేకుండా వాగుతూ వుండే మనిషి ప్రాభిడో చెప్పింది మేరియాతో — రాత్రిళ్ళు కుక్కలున్న గదితలుపు నెందుకు తీసి వుంచుతారో. ఆ మెభర్త అయిన జర్మన్ కమిసార్ నిద్రిస్తున్నప్పుడు ఆయనకే ప్రమాదమూ రాకుండా యీ కుక్కలు కాపలా కాస్తుంటాయట. ఇంట్లో పహారా మారినపుడల్లా యీ కుక్కలు కూడా పహరా మార్చుకుంటూ వుంటాయి.

రాత్రింబగళ్ళు ఆ భవనంలో జరిగె యీ యేర్పాట్లు ఒక కాగితం మీద దగ్గరదగ్గరగా వ్రాసి, అంతకుపూర్వం రహస్యంగా చేసుకున్న యేర్పాటు ప్రకారం, భవనానికి సమీపంలో వున్న పార్కులో ఒక బెంచిక్రింద మేరియా పడేసింది. ఆ వివరాల సహాయంతో మార్క్ బ్రహ్మాండమైన యుక్తినొకదాన్ని ఆలోచించాడు..

వారాలకొద్దీ రాత్రింబగళ్ళు, చకచకా పని సాగిపోతోంది. పథకం వివరాలు పూర్తిగా రూపొందించబడ్డాయి. ఇందుకు కావలసిన సామగ్రి, పరికరాలు మొదలైనవన్నీ స్వయంగా తయారు చేసికాని, సేకరించికాని మేరియా గదికి వెనకవైపున వున్న గవాక్షం ద్వారం లోపలికి చేర్చబడ్డాయి. ఆమె వాటిని యేమి చెయ్యాలో సవివరంగా తెలుసుకుంది.

చివరకు తామనుకున్న గా(త్రిపడింది. తనగడియారంవైపు చూసింద మేరియా. పన్నెండుగంటలపదిహేను నిమిషాలైంది. కుర్చీలోంచి లేచింది. సిద్ధంగావుంచినసామగ్రిని చేతపట్టుకుంది. మృధువైన తెల్లటి చర్మంతో తెల్ల కుక్క గుండెలకు, వీపునకు సరిగ్గా సరిపడేటట్టు పటకాఒకటి తయారుచెయ్యబడింది. ఆ పటకాలో యిమిడేటట్టు ఒక తెల్లటిపెట్టె; ఆపెట్టెలోకి సరిగ్గా నప్పే ఒకపొడుగాటి లోహపువస్తువు. ఆవస్తువుమీాదనున్న సున్నితమైన సూచిక 2 అంకెనుసమీపించేటప్పటికి పెట్టె పేలే టట్టు యేర్పాటు చెయ్యబడింది.

పన్నెండు-ఇరవై. మేరియా త్వరితంగా ద్వారం వైపు వెళ్ళింది. శబ్దం కాకుండా ద్వారం తెరచుకుంది. నిర్మానుష్యంగాను, మసకచీకటిగాను ఉన్న హాలును పైకి క్రిందికీ ఒకసారి పరికించింది. తోలుపటకాలు, పెట్టె చేతబట్టుకుని కుక్కలున్న గదిలో చటుక్కున ప్రవేశించింది.

తెల్ల కుక్క అమె వైపు ఆశ్చర్యంతో చూసింది. ఇదివరకెన్నడూ మేరియా అపద్ధతిలో గదిలో ప్రవేశించలేదు. అయినా మేరియాను బాగా యెరిగివున్నందున యేవిధమైన అభ్యంతరమూ చెప్పక మేరియా చేసిన దానికల్లా తల ఒగ్గింది. మేరియా పటకాను మెడకు దూర్చి పెట్టెను దానికడుపుక్రింద కట్టింది. మేరియా ద్వారంవద్దకు వెడుతూంటె కుక్క పరకాయించింది. తాను వెళ్ళిపోయేముందు ఒక్కసారి వెనుకకు తిరిగి కుక్కకేసి చూసింది. ఆ తెల్ల పటకాలు, తెల్లపెట్టె కుక్కకన్నా తెల్లజూలులో సరిగా కనిపించడమే లేదు. ఒక్క క్షణం తనకుక్కకు రాబోయే ప్రమాదాన్ని తలచుకుని మేరియా జాలిపడింది. ఆతరవాత హాల్లోకి, అందులోంచి తనగదిలోకి వెళ్ళిపోయింది.

పన్నెండు—ముప్పై. పహారా మారే వేళయింది. దానితో పాటు యెర్రకుక్క—స్థానే తెల్లకుక్క—కమిసార్ కు కాపలా కాయడానికి ఆయన పడుకున్నచోట తలాపు దిక్కున హాజరవుతుంది. తలుపు తెరచుకుని మేరియా మెల్లగా దొడ్డిలో ప్రవేశించింది. అక్కడ గస్తీవారు పహారా కాయడంకన్న గురక పెట్టి నిద్ర బాగాపోవడం గమనించింది మేరియా. కాపలా వాడు గేటుకు దూరంగా ఉన్న మూడవ రాటకు ఆనుకుని కూర్చుని హాయిగా నిద్రపోతున్నాడు. ధైర్యంగా ఆతనివైపు నడచింది. అతడేమి కదలలేదు, మాట్లాడలేదు, కేక పెట్టలేదు, మొహం మీద మొహంపెట్టి చూసింది. నల్లగా ఉన్న అతని నాలుక వ్రేలాడుతోంది; అర్ధనిమీలిత నేత్రాలామె వైపు అలాగే తేరిపార చూస్తున్నాయి. ఇదేమిటా అని ఆశ్చర్యంతో నక్షత్రాలకేసి చూసింది మేరియా. కాపలా వాడు చచ్చిపడివున్నాడు. ఊపిరి ఆడనివ్వక అతని ప్రాణాలను తీసిన త్రాటితో అతని శరీరం క్రిందపడకుండా రాటకు కట్టి వెయ్యబడింది. అతని ప్రక్కనే ఒక సొరంగంద్వారా మేరియా దూరడానికి వీలైనంత పెద్దది త్రవ్వబడింది. ఈ సొరంగం ద్వారా మేరియా బైట పడడానికి వీలుగా.

ఇండ్ల నీడలలోంచి, నిశ్శబ్దంగా, చడీ చప్పుడూ కాకుండా, మేరియా ముందుకు పోతోంది. నల్లపిల్లి సంస్థతాలూకు మనుష్యులు నిర్ణీత ప్రదేశాలలో, అనుకున్న ప్రకారం, మేరియా కోసం నిరీక్షిస్తు ఒకరినుండి ఒకరు చొప్పున మేరియాను ఊరు బయటకు దాటించారు. అచ్చట తన ఆఖరి మార్గదర్శకుని సహాయంతో ఒక గయూళు భూమిలో ప్రవేశించింది. పొద

ల్లోంచి దారిచేసుకుంటూ ముందుకు వెళ్ళి వెళ్ళి చిన్న మెట్ట ప్రదేశానికి చేరుకుంది. సుమారు గంటన్నరసేపటి నుండి ఆమె అలా నడుస్తూనే వుంది.

తనవైపు యెవరో వడివడిగా నడచి వస్తున్నారని అడుగుల సవ్వడిని బట్టి ఆమె గ్రహించింది. మార్క్ వస్తున్నాడని ఆమెకు తెలుసు; అతడామెను సమీపించాడు. ఆమె అతనివైపు పరిగెత్తుకు వస్తూంటె మార్క్ ఆమెను ఒక్కతోపు తోసి, గడియారాన్ని కళ్ళకు దగ్గరగా పెట్టి టైము చూస్తున్నాడు. అనేకవిధమైన ఆవేశంతో 'సరిగ్గా రెండయింది" అని ఒక్క వెర్రికేక పెట్టాడు,

అతని వెంటవస్తున్నవారు ఆగిపోయి పట్టణంలోకి పోదామనుకుంటూ తిరిగారు. మార్క్ తనచేతిని క్రిందికి దింపి మేరియా వెనకకు తిరిగి పట్టణం వైపు తేరి చూస్తున్నాడు.

ఒక్కనిముషం గడచింది. రెండునిముషాలు—

"ఏమీ పొరపాటు జరగలేదు, కదా?" అనుకుని కళవళ పడ్డాడతడు.

ఆక్షణంలో ఒక తీక్ష్ణమైన విద్యుత్కాంతి పట్టణం మీద నున్న ఆకాశాన్ని ప్రకాశింప చేసింది. కనురెప్ప పాటులో దూరాన యెక్కడో పెద్ద ప్రేలుడు జరిగినట్టు శబ్దమైంది.

'మేరియా, నాప్రియతమా! సాధించావు" అంటూ గిరుక్కున దిరిగి మేరియాను తన కౌగిటలోకి గాఢంగా హత్తుకున్నాడు. సంతోషంతో ఆమెతో అన్నాడు—

"చూశావా? కొట్టాం దెబ్బ శత్రువు గుండెలమీద. ఆ కొట్టింది నువ్వు, మేరియా. నాలక్ష్మివి."

ఆమె ఆనందంతో, పారవశ్యంతో నవ్వులను ఆపలేక పోసి, అతని చెంపమీద మెల్లిగా తట్టింది. తన శరీరాన్ని అతని శరీరానికి గట్టిగా అదిమింది.

కమిసార్ భిడో, తెల్లకుక్కా — ఛిన్నాభిన్నంకాక పూర్వమె, రక్షణోద్యోగి లెఫ్టినెంట్ పీటర్ సన్ గౌరవర్ణం కుక్కను ఫ్రా ఓల్గా ఖాళీగదిలోకితీసుకువెళ్ళి, ఆమె కాలిజోళ్ళను, దుస్తులను దానికి వాసనచూపించి ఫ్రాఓల్గా జాడలను తియ్యమని వదిలేశాడు. లెఫ్టినెంట్ ఆగ్రహంతో మండిపడి పోతున్నాడు.భిడోను రక్షించలేకపోయినందుకు యిప్పుడు తన ప్రాణానికే ముప్పు వచ్చేటట్లుగావుంది.ఇంతకూ ఆరియన్ యువతి యీప్రేలుడుకు కారణమై యుండాలి.తానెలాగైనా ఆమెను వెతకిపట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమెనే కనక పట్టుకుంటె ..

కొటోవ్ తన జీవితంలో యెన్నో పొరపాట్లుచేశాడు. ఇది ఆఖరు పొరపాటు. "ఇక్కడ కాస్త కునుకుతీద్దాం. ఇక్కడే యెక్కడైనా మాటుగా పగలంతా గడపి, యెవరకీ కనపడకుండా రేపు రాత్రి కదలుదాం. లేకపోతే, పగలు మనం యెవరికంటైనా పడవచ్చు" అనుకున్నాడు.

తాము వేసినపథకం జయప్రదమైందన్న సంతోషంతో కైపెక్కిపోయిన మార్క్, డ్రోబిన్ తదితరులూ, యీ సూచనను వెంటనే అంగీకరించారు.

మార్క్ కూడా ఒక్క విషయాన్ని విస్మరించాడు—రెండో కుక్క మేరియా జాడలుతీస్తూ వెంటబడవచ్చునన్నసంగతి.

కొటోవ్ శిబిరానికి వందగజాలదూరంలో పహరావాళ్ళను నియమించాను. వీరు జర్మన్ సైనికులు తమవైపు చొచ్చుక వస్తున్నసంగతిని కనిపెట్టి కాల్పులుసాగించినప్పటికీ, కొన్ని నిముషాల్లోనే జర్మన్ సైనికులు వారిపై బడ్డారు. జరుగుతున్న పరిస్థితులను అవగాహనచేసుకునేలోపుగా ఆకుపచ్చని యూనిఫారములు చెట్లసందుల్లోంచి కానవస్తున్నాయి. వెంటనే వాళ్ళు రష్యన్ ముఠామీద నిప్పులవర్షం కురిపించేశారు.మరుక్షణంలో నిహతులైనవారు, క్షతగాత్రులూ నేలకొరిగారు.

మేరియా పక్కలో తగిలినగాయంనుండి ప్రవహిస్తున్న రక్తాన్ని ఒకచేతితో అదిమిపట్టి రెండవచేతితో మార్క్ దగ్గర నుంచి లాగెయ్యడానికి ప్రయత్నించాడు. కాని, మార్క్ కళ్ళ ల్లోకిచూస్తూ మేరియా అతణ్ణి శక్తికొద్దీ పట్టుకువ్రేలాడ తోంది. ఆయాసంతో, రుద్ధమైనకంఠంతో నెమ్మదిగా అంది "మార్క్... ప్రియతమా...నువ్వు...ఒంటరివి..." కడసారి తనముఖాన్నీ శరీరాన్నీ అతనిముఖానికి శరీరానికిహత్తింది అతడు ఆమెపై వ్రాలగా కన్నీళ్ళుధారాపాతంగా కరుస్తు న్నాయి. ఆమెతల వెనకకు పడిపోగానే ఆమెతలను బుగ్గలను కంఠాన్ని చేతులను పదేపదే ముద్దుపెట్టుకున్నాడు మార్క్. "నన్నుక్షమించు;క్షమించు మేరియా"అంటూ గుండె లవిసేటట్లు విలపించాడు. కొటోవ్ మరఫిరంగిని చివరివరకూకాల్చి వాళ్ళ ప్రక్కనుంచి పరుగెడుతూ "నా వెంటరండి, మిత్రులారా!" అన్నాడు. ఆసమయంలో మార్క్ కౌగిటిలోంచి మేరియాను లాగేశాడు డ్రోబిన్. మార్క్ను దూరంగానెట్టేసి డ్రోబిన్ తన పిస్టల్ను మేరియాకణతలమీద గురిపెట్టికాల్చాడు. మార్క్

కొటోవ్ శిబిరానికి వందగజాలదూరంలో పహరావాళ్ళను నియమించాడు. వీరు జర్మన్ సైనికులు తమవైపు చొచ్చుకు వస్తున్నసంగతిని కనిపెట్టి కాల్పులుసాగించినప్పటికీ, కొన్ని నిముషాల్లోనే జర్మన్ సైనికులు వారిపైబడ్డారు. జరుగుతున్న పరిస్థితులను అవగాహనచేసుకునేలోపుగా ఆకుపచ్చని యూనిఫారములు చెట్లసందుల్లోంచి కానవస్తున్నాయి. వెంటనే వాళ్ళు రష్యన్ ముఠామీద నిప్పులవర్షం కురిపించేశారు.మరుక్షణంలో నిహతులైనవారు, క్షతగాత్రులూ నేలకొరిగారు.

మేరియా పక్కలో తగిలిన గాయంనుండి ప్రవహిస్తున్న రక్తాన్ని ఒకచేతితో అదిమిపట్టి రెండవచేతితో మార్క్ దగ్గర నుంచి లాగెయ్యడానికి ప్రయత్నించాడు. కాని, మార్క్ కళ్ళల్లోకిచూస్తూ మేరియా అతణ్ణి శక్తికొద్దీ పట్టుకువ్రేలాడుతోంది. ఆయాసంతో, రుద్ధమైనకంఠంతో నెమ్మదిగా అంది; "మార్క్... ప్రియతమా... నువ్వు... ఒంటరివి..." కడసారి తనముఖాన్నీ శరీరాన్నీ అతనిముఖానికి శరీరానికిహత్తింది. అతడు ఆమెపై వ్రాలగా కన్నీళ్ళుధారాపాతంగా కరుస్తున్నాయి. ఆమెతల వెనకకు పడిపోగానే ఆమెతలను బుగ్గలను కంఠాన్ని చేతులను పదేపదే ముద్దుపెట్టుకున్నాడు మార్క్. "నన్నుక్షమించు;క్షమించు మేరియా"అంటూ గుండెలవిసేటట్టు విలపించాడు. కొటావ్ మరఫిరంగిని చివరివరకూకాల్చి వాళ్ళ పక్కనుంచి పరుగెడుతూ "నా వెంటరండి, మిత్రులారా!" అన్నాడు. ఆసమయంలో మార్క్ కౌగిటిలోంచి మేరియాను లాగేశాడు డ్రోబిన్. మార్క్ ను దూరంగానెట్టేసి డ్రోబిన్ తన పిస్టల్ ను మేరియాకణతలమీద గురిపెట్టికాల్చాడు. మార్క్

బెదిరిపోయిన జంతువువలె డ్రోబిన్ మీద కురికాడు. కాని, మిగతావారు మార్క్ జబ్బలు పట్టుకొని కోటోవ్ చూపిస్తున్న వైపునకు లాక్కుపోయారు. మేరియూ యెలాగా చచ్చిపోయిందని మార్క్ వాళ్ళతో నడవడానికి అభ్యంతరం చెప్పలేదు-కొంతదూరం తనను యీడ్చుకుపోతున్నా-తోసుకుపోతున్నా అతడు ప్రతిఘటించనూలేదు.

మరొక నూరుగజాలు. యెంతో వెనకకువెళ్ళి మళ్ళీ మరఫిరంగిని అమర్చాడుకోటోవ్. ఆ అగ్నివర్షంమాటునుండి డ్రోబిన్ మార్క్ మొదలైనవారు సురక్షితప్రాంతం చేరుకున్నారు. కొంతదూరంవెళ్ళి వెనక్కు తిరిగి చూసేవరకు కోటోవ్ బోర్లాపడిపోయాడు.

చలనంలేకుండా అలాగేవుండిపోయాడు.

ఓడింపబడిన జర్మనులు, రష్యాదేశంనుండి దెబ్బతిన్న జంతువువలె వెళ్ళిపోతోంటే, వారిని వెంబడించారు మిడుతల దండువలె రష్యను కాందిశీకులు. వారికి మళ్ళీ కమ్యూనిస్టు ప్రభుత్వానికి దాసోహమనడం యిష్టంలేకపోయింది. తమ వెనకటి బానిసబ్రతుకులు తలుచుకుంటే ఆకలిదప్పులతోటి అనంత క్లేశాలతోటి బాధపడడమే మంచిదనిపించింది. ఆ కాందిశీకులతో పాటు వెళ్ళదలచుకొన్నవారిలో డ్రోబిన్ కూడా కలిసి, మార్కునూ బలవంతంచేశాడు రమ్మని తాను రైలెక్కవలసిన స్టేషన్‌లో "డ్రోబిన్ మార్కును "నువ్వుకూడా, రా" అని అడిగాడు. మాతోపాటు నువ్వుకూడా రష్యాకోసం వేరొకచోట పోరాటం సాగించవచ్చు. తరుణంవచ్చినప్పుడు తిరిగి రానూవచ్చు"

మార్క్ నిశ్శబ్దంగా నిలుచునిపోయాడు. ఎలా వెళ్ళగలడతడు? సురోవ్ కొడుకులందరిలోకీ కడసారంవాడు మార్క్. యుద్ధం ప్రారంభమైనతొలిరోజునే ఇవాన్, తన తల్లి యిరువురూకూడా చంపబడ్డారు; కోర్నీ, తన పాతస్నేహితుడైన జోసెఫ్ అపనాశెంకోను రక్షించబోయి, వీరోచితంగా యుద్ధభూమిలో కూలిపోయాడు; సైమన్ ఒక జర్మన్ సేనానాయకుణ్ని సపరివారంగా ప్రేల్చేసి తనూ బలిఅయిపోయాడు. ఒల్గా, టాటియానా యేమయ్యారో జాడలేదు.

ప్రశాంతంగా, తనతలను పంకించి సమాధానమిచ్చాడు. మార్క్, "నువ్వెళ్ళు ట్రోబిన్. ప్రతిచోటకూడా రష్యాకోసం యుద్ధంచెయ్యకతప్పదు; చేసితీరవలసిందే;కాని,మమ్మల్ని-బ్రతికున్నవారిని, చచ్చినవారిని కూడా- జ్ఞాపకం ఉంచుకో. ఎప్పుడో ఒకనాడు మనం మళ్ళీ స్వతంత్రరష్యాలో కలుసుకుంటామని ఆశిద్దాం.

మార్క్ స్టేషన్ నుండి వెళ్ళిపోతుంటే కొరొవిన్ వచ్చి కలుసుకున్నాడు. ఇరువురు ఒక కొండనెక్కి పరిసరాలను అవలోకించారు. పట్టణశిధిలాలు వెనకకుతిరిగిచూస్తే కనిపిస్తున్నాయి. ఏవైపుచూసినా,తమచుట్టు, అంతులేని స్వదేశం విస్తరించివుంది.తాను ప్రాణతుల్యంగా భావిస్తున్న స్వదేశపుమట్టిని ఆఘ్రాణిస్తూ,శూన్యంలోకిచూస్తూ అలాగే నిల్చుండిపోయాడు.

"ఏమిటి చూస్తున్నావ్, మార్క్", చివరకు అడిగాడు కొరొవిన్.

"నవోదయానికి చూస్తున్నాను. నాకానమ్మకంవుంది, భగవంతుడు మరొక నవోదయాన్ని ప్రసాదిస్తాడని."

